ప్రథమ ముద్రణ
ప్రతులు : 500

వెల : రు. 3-00

Paper used for Printing of this book was made available by the Government of India at concessional Rate.

ముద్రణ :
**లలితా ప్రెస్**
*ఖైరతాబాదు, హైదరాబాదు-4*

# దీపిక

ఈ న్యాయదర్శనమును రచించిన గౌతమమహర్షికి అక్షపాదుఁడను పేరుకూడ ప్రసిద్ధమైయున్నది. తనమతమును దూషించిన వ్యాసుని గన్నులతోఁ జూడనని ప్రతిజ్ఞ చేసి పాదమందు అక్షిని(కన్ను) కల్పించుకొనుటచే అక్షపాదుఁడను పేరు వచ్చినట్లు పద్మపురాణము చెప్పుచున్నది.

ఒక సారి మునినడచి పోవుచుండగా ముల్లుగ్రుచ్చుకొనఁగా పాదములందు అక్షులు (కన్నులు) ఉన్నచో బాగుండునని తలచి నందువల్ల అక్షపాదుఁడని పేరుగలిగెననియు, అపచారముచేసిన శిష్యుని ఈ కన్నులతో జూడనని అక్షులుపాదములందుఁ గల్పించుకొనుటచే అక్షపాదుఁడని పేరు గలిగె ననియు కొందఱందురు.

ఇతఁడు మిథిలానివాసియనియు రెండువేల సంవత్సరములకు పూర్వపువాడనిఅందురు. డా. సతీశ్ చంద్ర విద్యాభూషణుఁడు క్రీ. పూ. 550 సంవత్సరపువాడని దర్భంగాకు 28మైళ్ళదూరమున గల గౌతమస్థానసారణచపరాజిల్లాలో సరయూనదికి కుడివైపున గోదన్ అనుచోటు ఇతని నివాసస్థానమనెను.

రామాయణ మహాభారతములందును గౌతమయాజ్ఞవల్క్య స్మృతులందును ఇది పేర్కొనఁబడియున్నది. పతంజలి మహాభాష్యములో ?-2-123 సూత్రములో ఈ దర్శనములోని విషయము అనువదింపబడినట్లున్నది. అందుచే ఇది వానికంటె ప్రాచీనమని కొందఱందురు. ఈ దర్శనములో ప్రతితంత్రమను పేరుతో వైశేషిక దర్శనము పేర్కొనబడుటచేతను. శబ్దానిత్యత్వము. ఆత్మస్వరూపము అనుమానము హేత్వాభాసములు నిరూపింపఁబడుటచేతను వైశేషిక దర్శనమునఁగనిపింపని ఈశ్వర కారణత్వ విచారము ఈ దర్శనమునఁ గనిపించుటచేతను ఇదివైశేషిక దర్శనము కంటె తరువాతి"దని యందురు.

ఇందు న్యాయములు దర్శింపఁబడునుగాన న్యాయదర్శనమను పేరు గలిగెను. దృశ్యాదృశ్యపదార్థములు ఇందు చూపఁబడుటచే

దర్శనమని పేరుకలిగెను. బాహ్యేంద్రియ దృశ్యములగు భౌతికపదార్థములు అదృశ్యములయిన ఆత్మమొదలగు పదార్థములను పరీక్షించుట న్యాయము. ఆన్యాయముల దర్శనము న్యాయదర్శనము. ఈ దర్శనమువల్లఉత్తమ లక్ష్యమును గ్రహించి ప్రవృత్తిని గ్రహించి మానవులు నిశ్శ్రేయసమును పొందగలరని యిదిచెప్పబడినది.

బాహ్యేంద్రియములకు ప్రత్యక్షముకాక యనుమాన శాబ్ద ప్రమాణములకు గోచరములగు ఆత్మేశ్వరాదులను దెలిసికొనుటకిది యుపయుక్తమగును. ఇందుసహేతుకముగా పదార్థసత్య నిరూపణ చేయబడినది. హేతువులవలెదోచు హేత్వాభాస ఛల నిగ్రహజాతులను సరిగాదెలిసికొని వానినివిడిచి సరియైన హేతువులను దెలిసికొని తదనుగుణముగా జీవించి జీవి ఉత్తమసత్యము చేరుకొనుటకిది యత్యంతావశ్యకమైనది. న్యాయవైశేషిక దర్శనములను ప్రాచీన న్యాయమందురు.

తర్కసంగ్రహము దీపిక కారికావళి మొదలైనవి దీనిని దెలిసికొనుటకు సాయపడును.

గంగేశోపాధ్యాయులు చింతామణి దీని వ్యాఖ్యదీధితి, మధురాధీశుడు వ్రాసిన దీధితివ్యాఖ్యజగదీశుడు వ్రాసిన జగదీశి శబ్దశక్తిప్రకాశిక, గదాధరుడు వ్రాసిన చింతామణివ్యాఖ్య గదాధరి మొదలైనవానినన్నిటిని నవ్యన్యాయమని పేరుతో వ్యవహరింతురు.

గౌతముని పిదప వాత్స్యాయనాది దార్శనికులు కొందఱు గలరు. వారి వివర మీక్రిందఁదెలుపఁబడుచున్నది.

వాత్స్యాయనుఁడు:-ఇతఁడున్యాయదర్శనమునకుభాష్యము వ్రాసెను.

ఉద్యోతకరుఁడు:-న్యాయవార్తికకర్త బౌద్ధదార్శనికుఁడగు దిగ్నాగుని సిద్ధాంతములను ఖండించెను. కీ శ 6వశతాబ్దిలోనివాఁడు

వాచస్పతిమిశ్రుడు. న్యాయవార్తికమునకు తాత్పర్యటీకను వ్రాసెను. ఇతడు సర్వతంత్ర స్వతంత్రుడు. కీ. శ, తొమ్మిదవ శతాబ్దిలోనివాడు. మిథిలా నివాసి.

జయంతభట్టు :-న్యాయమంజరి కర్త చార్వాక బౌద్ధ, మీమాంసాదులను ఖండించెను. క్రీ. తొమ్మిదవ శతాబ్దిలోనివాడు.

భాసర్వజ్ఞుడు:-న్యాయసారకర్త, ఇందుస్వార్థపరార్థానుమాన వర్ణన, ఉపమానఖండనలుగలవు బౌద్ధులతో సమానముగా పక్షాభాస దృష్టాంతాభాసములవర్ణన, ఆత్మానందోపలబ్ధరూపమైన ముక్తి కల్పనలు చేసెను. క్రీస్తు పదవశతాబ్దలోనివాడు.

ఉదయనాచార్యుఁడు:-వాచస్పతి మిశ్రుని తాత్పర్యటీకకు తాత్పర్య పరిశుద్ధి అనువ్యాఖ్య, న్యాయకుసుమాంజలి అనుగ్రంధములనురచించెను. ఇందునాస్తిక, బౌద్ధాదిదర్శనములు సాంఖ్యాద్యాస్తిక దర్శనములు ఖండింపఁబడెను. ఇతడు పదవశతాబ్దిలోనివాడు.

గంగేశోపాధ్యాయుఁడు చింతామణి కర్త, శ్రీహర్షుని ఖండన ఖండఖాద్యమును ఖండించెను. అవచ్ఛేద్యావచ్ఛేదక, నిరూప్య నిరూపకాది సంబధములను ప్రవర్తింపజేసినవాడు. మిథిలావాసి 13వ శతాబ్దిచివరివాఁడు.

వర్ధమానోపాధ్యాయుఁడు:- గంగేశుని కొడుకు తత్త్వచింతామణికిని వల్లభాచార్యుని లీలావతికిని వ్యాఖ్యలు రచించెను.

ఇట్లే వాసుదేవసార్వభౌముఁడు (క్రీ.16) రఘునాథ శిరోమణి (క్రీ 16) మధురానాధుడు జగదీశభట్టాచార్యుఁడు (క్రీ 17) గదాధరభట్టాచార్యుడు (వ్యుత్పత్తి వాద శక్తి వాద కర్త)మొదలైనవారు నవ్యన్యాయముమీద గ్రంధాలు వ్రాసిరి.

ఇట్టి న్యాయాది దర్శనములను దెలిసికొని మనము ఉత్తమ లక్ష్యమువైపు పయనించి తరింతుముగాక.

ఇట్లు
బుధవిధేయుఁడు
చర్ల గణపతిశాస్త్రి

# వి ష య సూ చి క


| 1వ అధ్యాయము 1వ ఆహ్నికము | పుట |
|---|---|
| 1 ప్రత్యక్షాది ప్రమేయ వివేచనము | 1 |
| 2 ఆత్మాది ప్రమేయ వివేచనము | 4 |
| 3 సంశయ వివేచనము | 6 |
| 4 న్యాయసిద్ధాంత పూర్వాంగ ప్రకరణము | 7 |
| 5 సిద్ధాంత వివేచనము | 8 |
| 6 న్యాయ వివేచనము | 10 |
| 7 న్యాయోత్తరాంగ ప్రకరణము | 12 |
| **1వ అధ్యాయము 2వ ఆహ్నికము** | |
| 8 కథా ప్రకరణము | 12 |
| 9 హేత్వాభాసలు | 13 |
| 10 ఛలము | 16 |
| 11 జాతి, నిగ్రహము | 18 |
| **2వ అధ్యాయము 1వ ఆహ్నికము** | |
| 12 సంశయపరీక్ష | 20 |
| 13 ప్రమాణ సామాన్యపరీక్ష | 22 |
| 14 ప్రత్యక్షపరీక్ష | 25 |
| 15 అవయవి పరీక్ష | 29 |
| 16 అనుమాన పరీక్ష | 30 |
| 17 వర్తమాన పరీక్ష | 31 |
| 18 ఉపమాన పరీక్ష | 33 |
| 19 శబ్ద సామాన్యపరీక్ష | 34 |
| 20 శబ్ద విశేష పరీక్ష | 36 |
| **2వ అధ్యాయము 2వ ఆహ్నికము** | |
| 21 ప్రమాణ చతుష్ట్వపరీక్ష | 41 |
| 22 శబ్దానిత్యత్వ పరీక్ష | 46 |
| 23 శబ్దపరిణామ ప్రకరణము | 53 |
| 24 శబ్దశక్తి పరీక్ష | 59 |
| **3వ అధ్యాయము 1వ ఆహ్నికము** | |
| 25 ఇంద్రియభేద ప్రకరణము | 63 |

26 దేహభేద ప్రకరణము 64
27 చక్షు రద్వైత ప్రకరణము 64
28 మనోభేద ప్రకరణము 67
29 అనాది నిధన ప్రకరణము 68
30 శరీర పరీక్ష 71
31 ఇంద్రియ పరీక్ష 72
32 ఇంద్రియ నానాత్వపరీక్ష 77
33 ఆత్మాదిప్రమేయత్వ ప్రకరణము 80

3వ అధ్యాయము 2వ ఆహ్నికము

34 బుద్ధ్యనిత్యతా ప్రకరణము 76A
35 క్షణభంగ ప్రకరణము 78A
36 బుద్ధ్యాత్మగుణత్వ ప్రకరణము 80A
37 బుద్ధియొక్క యుత్పన్నాపవర్గిత్వప్రకరణము 87
38 బుద్ధిశరీర గుణాభావ ప్రకరణము 88
39 మనఃపరీక్ష 91
40 శరీర పరీక్ష 92

4వ అధ్యాయము 1వ ఆహ్నికము 95

41 దోష పరీక్ష 95
42 ప్రేత్యభావ ప్రకరణము 96
43 శూన్యతోపాదాననిరాకరణ ప్రకరణము 99
44 ఈశ్వరోపాదన ప్రకరణము 99
45 ఆకస్మికత్వ ప్రకరణము 99
46 సర్వానిత్యత్వనిరాకరణ ప్రకరణము 100
47 సర్వనిత్యత్వనిరాకరణ ప్రకరణము 101
48 సర్వపృథక్త్వనిరాకరణ ప్రకరణము 101
49 సర్వశూన్యతా నిరాకరణ ప్రకరణము 102
50 సంఖ్యైకాంతవాద నిరాకరణ ప్రకరణము 103
51 ఫలపరీక్షా ప్రకరణము 104
52 దుఃఖపరీక్షా ప్రకరణము 107
53 అపవర్గపరీక్షా ప్రకరణము 108

| | | |
|---|---|---|
| | 4వ అధ్యాయము 2వ ఆహ్నికము | 111 |
| 54 | తత్త్వజ్ఞానోత్పత్తి ప్రకరణము | 111 |
| 55 | అవయవావయవి ప్రకరణము | 112 |
| 56 | నిరవయవత్వ ప్రకరణము | 115 |
| 57 | బాహ్యార్థభంగ నిరాకరణ ప్రకరణము | 117 |
| 58 | తత్త్వజ్ఞానవివృద్ధి ప్రకరణము | 120 |
| | 5వ అధ్యాయము 1వ ఆహ్నికము | 123 |
| 59 | సత్ప్రతిపక్షదేశనాభాస ప్రకరణము | 123 |
| 60 | జాతిషట్క ప్రకరణము | 126 |
| 61 | ప్రాప్త్యప్రాప్తిసమ ప్రకరణము | 130 |
| 62 | ప్రసంగసమ ప్రతిదృష్టాంతసమములు | 131 |
| 63 | అనుత్పత్తిసమము | 132 |
| 64 | సంశయసమము | 133 |
| 65 | ప్రకరణసమము | 134 |
| 66 | అహేతుసమము | 135 |
| 67 | అర్థాపత్తిసమము | 136 |
| 68 | అవిశేషసమము | 137 |
| 69 | ఉపపత్తిసమము | 138 |
| 70 | ఉపలబ్ధిసమము | 139 |
| 71 | అనుపలబ్ధిసమము | 140 |
| 72 | అనిత్యసమము | 141 |
| 73 | నిత్యసమము | 142 |
| 74 | కార్యసమము | 143 |
| 75 | దోషాది విచారము | 144 |
| 76 | మతానుజ్ఞ | 145 |
| | 5వ అధ్యాయము 2వ ఆహ్నికము | 146 |
| 77 | నిగ్రహస్థానపంచక విశేష ప్రకరణము | 146 |
| 78 | అభిమతవాక్యార్థాప్రతిపాదక నిగ్రహస్థాన చతుష్కము | 149 |
| 79 | స్వసిద్ధాంతానురూప ప్రయోగాభాసనిగ్రహస్థాన త్రికప్రకరణము | 150 |
| 80 | పునరుక్త ప్రకరణము | 151 |
| 81 | కథకాన్యోక్తినిరూప్య నిగ్రహస్థానద్వయ ప్రకరణము | 152 |


—:o:—

# న్యాయ మీమాంసాదర్శనము

## మొదటి యధ్యాయము

### మొదటి ఆహ్నికము

మూ. ప్రమాణ ప్రమేయ సంశయ ప్రయోజన దృష్టాంత సిద్ధాంతావయవ తర్క నిర్ణయ వాద వితండా హేత్వాభాస చ్ఛల జాతి నిగ్రహ స్థానానాం తత్త్వజ్ఞానా న్నిఃశ్రేయసాధిగమః

1. సూ. ప్రమాణము ప్రమేయము సంశయము ప్రయోజనము దృష్టాంతము సిద్ధాంతము అవయవము తర్కము వాదము జల్పము వితండ హేత్వాభాసములు ఛలము జాతి నిగ్రహస్థానముల తత్త్వజ్ఞానమువలన మోక్షము ప్రాప్తించును.

ప్రమాణములచే అర్థమును పరీక్షించుట న్యాయము. అట్టి న్యాయముల దర్శనము న్యాయదర్శనము. దీనిని ఆన్వీక్షకి అనియు నందురు. ప్రత్యక్షాగమ ప్రమాణములచే ఈక్షింపఁబడిన (చూడఁబడిన) దానిని అనుసరించి ఈక్షించుట (చూచుట) ఆన్వీక్ష. ఆ అన్వీక్షచే ప్రవర్తించుచున్నది గాన ఆన్వీక్షకి న్యాయ శాస్త్రము అని వ్యుత్పత్తి. ప్రమాణాదులు ముందు వివరింపఁబడును.

మూ. దుఃఖ జన్మ ప్రవృత్తి దోష మిథ్యాజ్ఞానానా ముత్తరోత్తరాపాయే తదనంతరా భావా దపవర్గః.

2. సూ. దుఃఖ, జన్మ, ప్రవృత్తి, దోష, మిథ్యాజ్ఞానములలో ఒక్కొక్కటి పై పైవి నశింపఁగా వాని వెనుకటివి పోవుటవలన మోక్షము సిద్ధించును.

అనిత్యములను నిత్యములుగాఁ దలంపఁజేయు మిథ్యాజ్ఞానము నశింపఁగా రాగద్వేషాది దోషములు నశించును. దోషములు నశింపఁగాఁ దత్కర్మ ప్రవృత్తి నశించును. కర్మప్రవృత్తి నశింపఁగా జన్మము నశించును. జన్మ నశింపఁగా దుఃఖము నశించును. దుఃఖనాశమే మోక్షము. పైని జెప్పిన ప్రమాణాదుల

తత్త్వజ్ఞానమువలన ఆ మిథ్యాజ్ఞానము నశింపనిచో దోషములును ఆ దోషములు నశింపనిచోఁ బ్రవృత్తియు ఆ ప్రవృత్తి నశింపనిచో జన్మమును జన్మ నశింపనిచో దుఃఖము గలుగునని భావము.

మూ. ప్రత్యక్షానుమానోపమాన శబ్దాః ప్రమాణాని.

3. సూ. ప్రత్యక్షము అనుమానము ఉపమానము శబ్దము అని ప్రమాణములు నాలుగు.

అర్థ నిర్ణయము చేయునది ప్రమాణము. ఉద్దేశము లక్షణము పరీక్ష అని యీ శాస్త్రప్రవృత్తి మూఁడు విధములుగ నుండును. ఆ యా పదార్థములను పేర్కొనుట యుద్దేశము. ఆ యుద్దేశింపఁబడిన పదార్థములను విశేషధర్మములతోఁ దెలుపుట లక్షణము. లక్ష్యములను లక్షణములను సరిగా పరీక్షించుట పరీక్ష.

మూ. ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నం జ్ఞాన మవ్యపదేశ్య మవ్యభిచారి వ్యవసాయాత్మకం ప్రత్యక్షం.

4. సూ. ఇంద్రియములకు ఆ యా వస్తు సన్నికర్షమువలనఁ గలిగినదియు శబ్దములచే వ్యపదేశింపఁబడనిదియు తనకంటె నితరమందుండనిదియునగు నిశ్చయజ్ఞానము ప్రత్యక్ష మనఁబడును.

శబ్దములచే వ్యపదేశింపఁబడనిది యనుటచే రూపరస గంధాది శబ్దము లందును, ఇతరమందుండనిదియనుటచే ఎండమావులందలి నీటి భ్రమయందును, నిశ్చయజ్ఞానమని యనుటచే అది పొగయా దుమ్మా అను సంశయమందును అతిప్రసక్తి యుండదు ఆత్మమనస్సంయోగజన్యమగు సుఖాదుల నివారణ కొఱకు జ్ఞానమనియుఁ జెప్పఁబడినది.

మూ. అథ తత్పూర్వకం త్రివిధ మనుమానం పూర్వవ చ్ఛేషవత్ సామాన్యతోదృష్టంచ.

5. సూ. మఱి ప్రత్యక్షపూర్వకమైన కార్యకారణ సంబంధ దర్శనము అనుమానము. అది పూర్వవంతము శేషవంతము సామాన్యతో దృష్టము నని మూఁడు విధములు.

పర్వతమందుఁ బ్రత్యక్షముగాఁ గనిపించు పొగచేతఁ గనిపింపని నిప్పును కార్యకారణోదాహరణ పూర్వకముగ అనుమానించుట అనుమానము. కారణముచేఁ గార్యమును అనుమానించుట పూర్వవంతము. మేఘోన్నతిచేత వర్షము కురియు ననుజ్ఞానము. శేషవంతము అపూర్వార్థము గలది. కార్యముచేఁ గారణమును అనుమానించుట శేషవంతము. నది నిండిపోవుటచేత వర్షము కురిసినదని కారణము ననుమానించుట. కార్యకారణ సంబంధము ప్రత్యక్షము కానప్పుడు కార్యకారణములకు భిన్నమైన యేదోయొక వస్తువుచేఁగారణ సామాన్యమునుబట్టి యప్రత్యక్షమగు కార్యముతోఁచుట సామాన్యతోదృష్టము. ఇచ్ఛాదులనుబట్టి యాత్మ వ్యక్తమగుట. ఇచ్ఛ మొదలగునవి గుణములు. గుణములు ద్రవ్యము లందుండునవి. కాన ఇచ్ఛాది గుణములకు స్థానముఆత్మ యని గ్రహించునది.

మూ. ప్రసిద్ధసాధర్మ్యా త్సాధ్యసాధన ముపమానం.

6. సూ. ప్రసిద్ధమగు సాదృశ్యమునుబట్టి సాధింపఁదగిన దానిని సాధించుట యుపమానము.

గవయ మృగము గోవువలె నుండును. పెద్దపులి చారల పిల్లివలె నుండును. ఇత్యాదులు ఉదాహరణము. గోవును బట్టి గవయమును పిల్లిని బట్టి పులిని గ్రహించుటయుపమానమని భావము.

మూ. ఆప్తోపదేశః శబ్దః.

7. సూ. ఆప్తులఉపదేశము శబ్దము.

ఆప్తులు అనఁగా ప్రకృతవాక్యము యొక్క యథార్థజ్ఞానము గలవారు. వారిచే నుపదేశింపఁబడినది శబ్దము అనుప్రమాణము. ఆప్తము=ప్రకృత వాక్యము యొక్క యథార్థజ్ఞానము. దానిచే నుపదేశింపఁబడినది అనియు జెప్పనగును.

మూ. స ద్వివిధో దృష్టాదృష్టార్థత్వాత్.

8. సూ. అది దృష్టార్థకము అదృష్టార్థకము అని రెండు విధములు.

ఋషులు కవుల వాక్యాదికము దృష్టార్థకము. అదృష్ట విషయకములైన వేదాదులు అదృష్టార్థకములు.

ఇది ప్రత్యక్షాది ప్రమాణ వివేచనము

అవతారిక :- ఇంక ప్రమేయ వివేచనము చేయఁబడుచున్నది.

మూ. ఆత్మ శరీ రేంద్రియార్థ బుద్ధి మనః ప్రవృత్తి దోష ప్రేత్యభావ ఫల దుఃఖాపవర్గాస్తు ప్రమేయం.

9. సూ. ఆత్మ శరీరము ఇంద్రియములు విషయములు బుద్ధి మనస్సు ప్రవృత్తి దోషములు ప్రేత్యభావము ఫలము దుఃఖము మోక్షము అనునవి ప్రమేయములు.

ప్రమాణములచే గ్రహింపఁబడు విషయములు ప్రమేయములు. వీని లక్షణము ముందు చెప్పఁబడును.

మూ. ఇచ్ఛా ద్వేష ప్రయత్న సుఖ దుఃఖ జ్ఞానా న్యాత్మనో లింగం.

10. సూ. ఇచ్ఛ ద్వేషము ప్రయత్నము సుఖము దుఃఖము జ్ఞానము అనునవి యాత్మకు సూచకములు.

ఆత్మ పైకిఁ గనిపింపదు గాన ఇచ్ఛాదులనుబట్టి యాత్మ యనునది యొకటి యున్నదని గ్రహింపవలయునని భావము.

మూ. చేష్టేంద్రి యార్థాశ్రయః శరీరం.

11. సూ. చేష్టలకు ఇంద్రియములకు విషయములకు ఆధారమైనది శరీరము.

మూ. ఘ్రాణ రసన చక్షు స్త్వక్ శ్రోత్రా ణీంద్రియాణి భూతేభ్యః.

12. సూ. పంచభూతములనుండి కలిగిన ముక్కు నాలుక కన్ను త్వక్కు (చర్మము) చెవి యనునవి యింద్రియములు.

ఈ యింద్రియములు శరీరములో ఆత్మ ప్రాణము ఉన్నంతవఱకుఁ బని చేయును.

మూ. పృథి వ్యాప స్తేజో వాయు రాకాశ మితి భూతాని.

13. సూ. నేల నీరు వెలుఁగు గాలి యాకసము అనునవి యైదును భూతములు.

మూ. గంధం రస రూపస్పర్శ శబ్దాః పృథివ్యాది గుణా స్తదర్థాః.

14. సూ. గంధము రసము రూపము స్పర్శము శబ్దము అనునవి నేల మొదలగు వాని గుణములును ఇంద్రియములకు విషయములు నగు.

నేలకు గంధము, నీటికి రసము, వెలుఁగునకు రూపము గాలికి స్పర్శము ఆకాశమునకు శబ్దము గుణములు. గంధము ముక్కునకును రసము నాలుకకును రూపము కంటికిని స్పర్శము త్వక్కునకును శబ్దము చెవికిని విషయములు.

మూ. బుద్ధి రుపలబ్ధిర్ జ్ఞాన మిత్యనర్థాంతరం.

15 సూ. బుద్ధి యుపలబ్ధి జ్ఞానము అనునవి పర్యాయపదములు.

మూ. యుగపత్ జ్ఞానానుత్పత్తి ర్మనసో లింగం.

16. సూ. ఏకకాలమందు ఒక్కమాటుగా ననేక జ్ఞానములు పుట్టక పోవుట మనస్సు ఉన్నదనుటకు సూచకము.

ఇంద్రియము లనేకమయినను ఆ యా యింద్రియముల జ్ఞానములు ఒక్కమాటుగాఁ గలుగకపోవుటవలనను ఇంద్రియములు ఇంకొకదానితోఁ గలిసినఁగాని ఆజ్ఞానములు కలుగకపోవుటచేతను మనస్సు అనునది యొకటి యున్నదనియు ఆమనస్సుతో ఇంద్రియములకు సంబంధము గలిగినపుడు ఆయా జ్ఞానములు గలుగుచున్నవని భావము. మనస్సు ఒకటే గాన ఆయా జ్ఞానములు ఒకమాటుగాఁ గలుగక క్రమముగాఁ గలుగును.

మూ. ప్రవృత్తిర్వాగ్బుద్ధి శరీరారంభః.

17. సూ. వాక్కు మనస్సు శరీరముల ప్రయత్నము ప్రవృత్తి యనఁ బడును.

మూ. ప్రవర్తనా లక్షణా దోషాః

18. సూ. పుణ్యాపాపములందుఁ బ్రవర్తింపఁజేయు రాగద్వేష మోహములు దోషములు.

జనులు రాగాదులను గుణములుగా గ్రహించినను తాత్త్విక దృష్టినిబట్టి యవి దుఃఖాదులకుఁ గారణము గాన దోషములని చెప్పఁబడెను.

మూ. పునరుత్పత్తిః ప్రేత్యభావః

19. సూ. చచ్చి మఱల బుట్టుట ప్రేత్యభావము.

ప్రేత్య=చనిపోయి, భావము=పుట్టుట అని వ్యుత్పత్తి.

మూ. ప్రవృత్తిదోషజనితోఽర్థః ఫలం

20. సూ. ప్రవృత్తి వలనను దోషమువలనను గలిగిన ప్రయోజనము ఫలము.

ఆ ఫలము సుఖదుఃఖాది రూపముగ నుండునని భావము.

మూ. బాధనా లక్షణం దుఃఖం

21. సూ. పీడారూపమైనది దుఃఖము.

మూ. తదత్యంత విమోక్షోఽపవర్గః

22. సూ. అసలు దుఃఖ మేమాత్రము లేకపోవుట మోక్షము దుఃఖములతోఁగూడిన జన్మము లేకపోవుటయె మోక్షమని భావము.

ఇది ఆత్మాది ప్రమేయ వివేచనము

ఇంక సంశయాది వివేచనము

మూ. సమానానేక ధర్మోపపత్తే ర్విప్రతిపత్తే రుపలబ్ధ్యనుపలబ్ధ్యవ్యవస్థాత శ్చ విమర్శః సంశయః

23. సూ. సమాన ధర్మజ్ఞానమువలను, సజాతీయ విజాతీయరూపమైన యనేక ధర్మజ్ఞానమువలనను విరుద్ధజ్ఞానము కలుగుటవలనను వస్తుజ్ఞానము గలుగుటలో వ్యవస్థ లేకపోవుటవలనను వస్తుజ్ఞానము కలుగకపోవుటలో వ్యవస్థ లేకపోవుటవలనను విశేషధర్మము నపేక్షించుచు విమర్శించు జ్ఞానము సంశయము.

స్తంభమును జూచి పురుషుఁడు అను సంశయము చేయఁబడుచున్నది. ఇట స్తంభమునకుఁ బురుషునికిఁగల స్థూలత్వదీర్ఘత్వాది సమానధర్మముల వలన సంశయము గలుగుచున్నది. కరచరణాది విశేషధర్మము నిశ్చయ జ్ఞానమునకు అపేక్షింపఁబడుచున్నది. పృథివి గంధము గలది గాన నీరు మొదలగు

సజాతీయములకంటెను విజాతీయములగు గుణకర్మలకంటెను విశిష్టమైనది. పృథివియందువలె శబ్దమునందును విభాగజన్యత్వధర్మము (వెదురు మొదలగునవి చీల్చునపుడు పుట్టుట) విశేషముగా నున్నది. శబ్దముకంటె విజాతీయములు పృథివ్యాదులు. సజాతీయములు సామాన్య విశేషసమవాయాదులు వీని జ్ఞానము వలన శబ్దము ద్రవ్యమా గుణమా కర్మయా అను సందేహము గలుగుచున్నది. అది ద్రవ్యాదులు మూడిటిలో ఏది యని నిర్ణయింప విశేషము ఇటలేదు. దానిని అపేక్షించుచున్న యీ విమర్శము సంశయము. ఇది రెండవ రకమైనది. ఆత్మ యున్నదని కొందఱు లేదని కొందఱు. ఇట్టి విరుద్ధజ్ఞానము వలన ఆత్మ యున్నదా లేదా యను సంశయము గలుగుచున్నది. ఇది మూడవ రకము. చెలువు మొదలగు వానియందు సత్యమగు జలజ్ఞానమును ఎండమావులందు. అసత్యమగు జలజ్ఞానమును గలుగుచున్నది. జలమున్నను లేకున్నను జ్ఞానము కలుగుచున్నది. కనుక ఉన్నదే యుపలబ్ధమగునా లేనిది గూడ ఉపలబ్ధమగునా అని సంశయము. ఇట సత్యరూపమగు జ్ఞానము గలుగుటలో వ్యవస్థలేదు. ఇది నాల్గవ రకము. నూయి త్రవ్వంగా నీరు త్వరగాఁ బడనపుడు ఇక్కడ నీరుఉండియుఁ బడుటలేదా లేక అసలు నీరే లేక పడుటలేదా అని వస్తుజ్ఞానము కలుగకపోవుటలో వ్యవస్థ లేకపోవుటచే సంశయము కలుగుచున్నది. ఇది అయిదవ రకము.

ఇది సంశయ వివేచనము

మూ. యమధికృత్య ప్రవర్తతే తత్ప్రయోజనం.

24 సూ దేనికొఱకై జనులు ప్రవర్తింతురో అది ప్రయోజనము.

మూ. లౌకిక పరీక్షకాణాం యస్మిన్నర్థే బుద్ధి సామ్యం స దృష్టాంతః

25. సూ. లౌకికులకు శాస్త్రపరీక్షకులకు దేనియందు బుద్ధి సాదృశ్యము గలుగునో యది దృష్టాంతము.

పుణ్యపాపములు నశించునవి యనినిరూపింపవలసియున్నపుడు లౌకికులచే శాస్త్రజ్ఞులచే నిర్వివాదముగా అంగీకరింపఁబడిన శరీరదృష్టాంతమును దీసికొనుట దృష్టాంత మనఁబడును.

ఇది న్యాయ పూర్వాంగ ప్రకరణము.

మూ. తంత్రాధికరణాభ్యుపగమ సంస్థితిః సిద్ధాంతః

26. సూ. శాస్త్రాధారమునుబట్టి తగిన రీతిగా నిస్సంశయ స్థితిని గలిగించునది సిద్ధాంతము.

మూ. సర్వతంత్ర ప్రతితం త్రాధికరణాభ్యుపగమ సంస్థిత్యర్థాంతరభావాత్.

27. సూ. సర్వతంత్ర సిద్ధాంతము, ప్రతితంత్ర సిద్ధాంతము, అధికరణ సిద్ధాంతము అభ్యుపగమ సిద్ధాంతము అని అది నాల్గువిధయిలు.

మూ. సర్వతం త్రావిరుద్ధ స్తంత్రేఽధి కృతోఽర్థః సర్వ తంత్ర సిద్ధాంతః

28. సూ. సర్వశాస్త్రములకు విరుద్ధముగాకుండ శాస్త్రమునందుఁ జెప్పఁబడినది సర్వతంత్ర సిద్ధాంతము.

ముక్కు మొదలగునవి యింద్రియములని గంధము మొదలగునవి విషయములని నేల మొదలగునవి భూతములని ప్రత్యక్షాది ప్రమాణములచే విషయములను గ్రహింపవలయునని ఈ విధముగా సర్వశాస్త్రము లందు అంగీకరింపబడినవి చెప్పుట సర్వతంత్ర సిద్ధాంతము లన బడును.

మూ. సమాన తంత్ర సిద్ధః పరతం త్రాసిద్ధః ప్రతి తంత్ర సిద్ధాంతః

29. సూ. ఒక శాస్త్రముచేతనే సిద్ధమై యితర శాస్త్రములచే సిద్ధముగాని విషయము ప్రతితంత్ర సిద్ధాంతము.

లేని వస్తువు ఉండదు ఉన్నది పోదు, చేతనలు నిరతిశయమైనవి తత్తత్కారణములగు దేహేంద్రియ మనోవిషయములందు విశేషమున్నది యని సాంఖ్యుల సిద్ధాంతము, అది ఇతర శాస్త్రసిద్ధము గాదు. పురుషకర్మనుబట్టి భూతసృష్టి గలుగును. ప్రవృత్తినిబట్టి కర్మలఁబట్టి దోషములు గలుగునుచేత నలుస్వగుణ విశిష్టములైనవి. అసత్తు పుట్టుచున్నది పుట్టినది నశించుచున్నది. అని వైశేషికుల సిద్ధాంతము. అది ఇతర శాస్త్రసిద్ధము గాదు. ఇది ప్రతి సిద్ధాంత మనఁబడును.

మూ. యత్సిద్ధా వన్య ప్రకరణసిద్ధిః సోఽధికరణ సిద్ధాంతః

30. సూ ఒక విషయమును సిద్ధింపఁజేయుటలో అనుషంగికముగ మఱియొక విషయము సిద్ధించుట యధికరణ సిద్ధాంతము.

దర్శన స్పర్శనాదులచే ఒక విషయమే గ్రహింపఁబడుట వలన దేహేంద్రియములకంటె ఆత్మ భిన్నమైనది యను విషయమును సిద్ధింపఁజేయుటలో అనుషంగముగా ఇంద్రియములనేకములని ఇంద్రియములు స్వస్వనియత విషయము గలవి యని అవి జ్ఞానసాధనములనియు సిద్ధించుచున్నది.

మూ. అపరీక్షి తాభ్యుపగమాత్త ద్విశేష పరీక్షణ మభ్యుపగమసిద్ధాంతః

31. సూ. పరీక్షింపకుండ ఒక విషయమునంగీకరించి దానిని విశేషించి పరీక్షించుట యభ్యుపగమ సిద్ధాంతము.

శబ్దము ద్రవ్యము అది నిత్యమా అనిత్యమా అనుదానిలో శబ్దము ద్రవ్యము అను విషయమును పరీక్షింపకుండ నంగీకరించి దానినిగూర్చి అది నిత్యమా అనిత్యమా యని విశేషించి పరీక్షింపఁబడుచున్నది.

ఇది సిద్ధాంత వివేచనము

అవతారిక:— ఇంక న్యాయావయవముల వివేచనము చేయఁబడుచున్నది.

మూ. ప్రతిజ్ఞా హేతూదాహార ణోపనయ నిగమనా న్యవయవాః

32. సూ. ప్రతిజ్ఞ హేతువు ఉదాహరణము ఉపనయము నిగమనము అనునవి యవయవములు.

అవయవములు=సాధింపఁదలఁచిన వాక్యములోని భాగములు.

మూ. సాధ్య నిర్దేశః ప్రతిజ్ఞా

33. సూ. సాధింపఁదగిన విషయమును నిర్దేశించి చెప్పుట ప్రతిజ్ఞ. శబ్దము అనిత్యము అని శబ్దమందు అనిత్యత్వమును సాధించుటకై చెప్పుట ప్రతిజ్ఞ. పర్వతము నిప్పుగలది. నిప్పు గలది అని సాధింపఁబడుచున్నది. ఇది ప్రతిజ్ఞ.

మూ. ఉదాహారణసాధర్మ్యాత్ సాధ్య సాధనం హేతుః.

34 సూ. ఉదాహరణ సాధర్మ్యమునుబట్టి సాధింపఁదగిన దానిని సాధించుట హేతువు.

ఉదా :- ఉత్పత్తిధర్మముగల దగుటవలన శబ్దము అనిత్యము అను దానిలో ఉత్పత్తి ధర్మముగలదగుటవలన అనునది హేతువు. ఉత్పత్తిధర్మము గలది అనిత్యముగాఁ జూడఁబడుచున్నది. అనునది ఉదాహరణ సాధర్మ్యము. పర్వతము ధూమముగలదగుటవలన నిప్పు గలది. అనుచోట ధూమము గలదగుటవలన అనునది హేతువు. సాధర్మ్యము=సమానధర్మము.

మూ. తథా వైధర్మ్యాత్.

35. సూ ఉదాహరణ వైధర్మ్యమువల్లఁ గూడ సాధింపఁదగిన దానిని సాధించుట హేతువగును.

అనుత్పత్తి ధర్మము గలది నిత్యమగును. ఎట్లనఁగా ఆత్మ. మొ. నిప్పులేని చోట పొగయుండదు. ఎట్లనఁగా చెఱువు. మొ. సాధర్మ్య వైధర్మ్యములనుబట్టి హేతువు రెండు విధములుగా నుండునని భావము. వైధర్మ్యము=విరుద్ధధర్మము.

మూ. సాధర్మ్యాత్ తద్ధర్మభావీ దృష్టాంత ఉదాహరణం.

36. సూ. సాధ్యముతోపాటు సాధర్మ్యముండుటవలన సాధ్యధర్మ భావముగల దృష్టాంతము ఉదాహరణము.

వస్తువు ఉత్పత్తిధర్మము గలది గాన అనిత్యము. ఇట ఉత్పత్తిధర్మము గలదిగాన అనునది హేతువు. అనిత్యత్వము సాధ్యము. ఇట్లే శబ్దముగూడ ఉత్పత్తిధర్మము గలదిగాన ఘటమువలె అనిత్యమైనది. ఇది యుదాహరణము. దీనిని అన్వయదృష్టాంత మందురు. ఇట్లే పొగయున్నచోట నిప్పు గలదు వంటయిల్లువలె. మొ.

మూ. తద్విపర్యయాద్వా విపరీతం.

37. సూ సాధ్యమందలి వైధర్మ్యమునుబట్టి సాధ్యసాధర్మ్యములేని దృష్టాంతము వైధర్మ్యోదాహరణము.

ఉత్పత్తిధర్మము గలదిగాన శబ్దము ఘటమువలె అనిత్యము. ఇది సాధర్మ్య దృష్టాంతము. అనుత్పత్తి ధర్మము గలది నిత్యము ఆత్మవలె. ఆత్మవలె అనుత్పత్తిధర్మము గలది గాదు గాన శబ్దము అనిత్యము. ఇది వైధర్మ్య

దృష్టాంతము. దీనిని వ్యతిరేక దృష్టాంతమందురు. ఇట్లే నిప్పు లేనిచోట పొగ యుండదు చెఱువువలె. మొ.

మూ. ఉదాహరణాపేక్ష స్తథేత్యుపసంహారో, న తథేతి వా సాధ్యస్యోపనయః.

38. సూ ఉదాహరణము నపేక్షించి "అట్లే" అని కాని 'అట్లు గాదు' అని కాని సాధ్యము నుపసంహరించు వాక్యము ఉపనయము.

ఘటము మొదలైన యుత్పత్తి ధర్మముగల ద్రవ్యములు అనిత్యములుగాఁ గనుపట్టుచున్నవి. 'అట్లే' శబ్దము ఉత్పత్తిధర్మము గలది యని సాధ్యము ఉపసంహరింపఁబడుచున్నది ఇంక వైధర్మ్యములో ఆత్మ మొదలగు ద్రవ్యములు అనుత్పత్తిధర్మము గలవి నిత్యములుగాఁ జూపట్టుచున్నవి. కాని శబ్ద 'మట్లు గాదు' అని వైధర్మ్యరూపముగా నుపసంహరింపఁబడుచున్నవి.

మూ. హేత్వపదేశాత్ ప్రతిజ్ఞాయాః పునర్వచనం నిగమనం.

39. సూ. హేతుకథనమువల్లఁ బ్రతిజ్ఞావాక్యమును దిరుగఁజెప్పుట నిగమనము.

నిగమనము తిరుగఁ జెప్పఁబడిన దానిని సమర్థించుట, శబ్దము ఉత్పత్తి ధర్మము గలది గాన అనిత్యము అని చెప్పుట నిగమనమ అని భావము. శబ్దము అనిత్యము అనునది ప్రతిజ్ఞ. ఉత్పత్తిధర్మము గలదిగాన అనునది హేతువు. ఉత్పత్తిధర్మముగల ఘటాదులు అనిత్యమైనట్లు అనునది యుదాహరణము. అట్లే యుత్పత్తిధర్మముగల శబ్దము అనునది యుపనయము. అందువల్ల ఉత్పత్తి ధర్మము గలది గాన శబ్దము అనిత్యము అనునది నిగమనము. వైధర్మ్యములోఁ గూడ (1) శబ్దము అనిత్యము (2) ఉత్పత్తి ధర్మముగలదగుట వలన (3) అనుత్పత్తి ధర్మముగల ఆత్మాది ద్రవ్యములు నిత్యములై గనిపించుచున్నవి (4) శబ్దమట్లు అనుత్పత్తి ధర్మము గలది గాదు (5) అందువలన ఉత్పత్తి ధర్మముగల శబ్దము అనిత్యము. అను దీని ప్రతిజ్ఞాదులను దెలియవలయు.

ఇది న్యాయప్రకరణము

—:(౦):—

మూ. అవిజ్ఞాత తత్త్వేఽర్థే కారణోపపత్తిత స్తత్త్వ జ్ఞానార్థ మూహ స్తర్కః.

40. సూ. వస్తు తత్త్వము తెలియఁబడనపుడు తత్త్వజ్ఞానము కొఱకుఁ గారణోపపత్తి పూర్వకముగ నూహించుట తర్కము.

మూ. విమృశ్య పక్ష ప్రతి పక్షాభ్యామవధారణం నిర్ణయః.

41. సూ. విమర్శించి పక్ష ప్రతిపక్షములఁబట్టి యర్థమును నిశ్చయించుట నిర్ణయము.

సందేహింపఁబడిన సాధ్యము గలది పక్షము. సాధ్యము లేనట్లు నిశ్చయింపఁబడినది ప్రతిపక్షము. ఉదా :- పొగయుండుటవలనఁ బర్వతము నిప్పు గలది వంటయిల్లువలె గాన దానిని పక్షమందురు. నిప్పులేనిచోట పొగలేదు చెఱువువలె. ఇట సాధ్యము లేదు గాన ఇది ప్రతిపక్షము. ఈ రెండిటిని పరిశీలించి యర్థనిర్ణయము చేయుట నిర్ణయము.

ఇది న్యాయోత్తరాంగ ప్రకరణము

ఇది ప్రథమాధ్యాయమున మొదటి యాహ్నికము

---

# ప్రథమాధ్యాయము

## రెండవ యాహ్నికము

మూ. ప్రమాణతర్క సాధనోపాలంభః సిద్ధాంతాఽ విరుద్ధః పంచావయవోపపన్నః పక్ష ప్రతిపక్ష పరిగ్రహో వాదః.

1. సూ. ప్రమాణములచేతను, తర్కముచేతను సత్యవిషయమును స్థాపించి యసత్య విషయమును ప్రతిషేధించుచు సిద్ధాంతమునకు విరుద్ధముగాక పంచావయవములతోఁగూడ పక్ష పతిపక్షములను స్వీకరించునది వాదము.

విషయ విమర్శనము చేయు వాక్యరచనను కథ అందురు. అది వాదము జల్పము వితండ అని మూఁడు విధములు.

మూ. యథోక్తోపపన్న శ్ఛలజాతి నిగ్రహస్థాన సాధనో పాలంభో జల్పః.

2. సూ. ఇదివఱకుఁ జెప్పఁబడిన వాదలక్షణము గలిగి ఛల జాతి నిగ్రహస్థానములచే సత్యవిషయమును స్థాపించుచు అసత్య విషయమును ప్రతి షేధించునది జల్పము.

వాదిచేఁ జెప్పఁబడిన దానికి అర్థాంతరము గల్పించి వాదికి సమ్మతమగు విషయమును దూషించుట ఛలము. వాదిచేఁ జెప్పఁబడిన హేతువును సాధర్మ్య వైధర్మ్యములచే నిషేధించుట జాతి. విపరీతజ్ఞానమును అజ్ఞానమును నిగ్రహస్థాన మనఁబడును.

మూ. సప్రతిపక్షస్థాపనా హీనో వితండా.

3. సూ. ప్రతిపక్షమును స్థాపించునది యగుటచే హీనమైన జల్పము వితండ యనఁబడును.

ఇది కథా లక్షణప్రకరణము

---

**మూ. సవ్యభిచార విరుద్ధ ప్రకరణసమ సాధ్యసమ కాలాతీతా హేత్వాభాసాః.**

4. సూ. సవ్యభిచార, విరుద్ధ, ప్రకరణసమ సాధ్యసమ కాలాతీతము లనునవి హేత్వాభాసములు.

సరియైనవి గాక హేతువులవలెఁ దోఁచువానిని హేత్వాభాసములందురు.

మూ. అనైకాంతికః సవ్యభిచారః.

5. సూ. ఒకదాని యందు మాత్రమె నియతము గాక యుండునది సవ్యభిచారము.

స్పర్శలేనిది గాన శబ్దము నిత్యము స్పర్శగలకుండ అనిత్యము. శబ్దము అట్లు స్పర్శగలది కాదు. అందువలన స్పర్శలేనిది శబ్దము నిత్యము. నిత్యత్వ మును సాధించు "స్పర్శ లేనిదిగాన" అను హేతువు నిత్యమందే గాక అనిత్య మైన బుద్ధియందుఁగూడ నుండుటచేత నిది సవ్యభిచారము. అది సాధారణము అసాధారణము అనుపసంహారి అని మూఁడు విధములు. హేతువు సాధ్యము కాని

దానియందుండుట సాధారణము. ఉదా:- ప్రమేయమగుటవలన పర్వతము నిప్పు గలది. ఇట ప్రమేయత్వము సాధ్యమైన నిప్పులేని చెఱువునందు ఉన్నవి. కాన ఇది సాధారణము. అన్ని సపక్ష విపక్షములందుండక పక్షమందు మాత్రమే యుండుట అసాధారణము. సాధ్యమున్నట్లు నిశ్చయింపఁబడినది సపక్షము. సాధ్యము లేదని నిశ్చయింపఁబడినది విపక్షము. ఉదా:- శబ్దమగుటవలన శబ్దము నిత్యము. శబ్దత్వము సపక్షమైన సమస్త నిత్యవస్తువులందును విపక్షమైన సమస్తానిత్యవస్తువులందును లేనిది. పక్షమందు మాత్రమేయుండును. కాన ఇది అసాధారణము అన్వయదృష్టాంత వ్యతిరేకదృష్టాంతములు రెండును లేనిది అనుపసంహారి ప్రమేయమగుటవలన సర్వము అనిత్యము. ఇట సర్వమును పక్షమే యగుటవలన దృష్టాంతమే లేదు. కాన ఇది అనుపసంహారి.

మూ. సిద్ధాంత మభ్యుపేత్య తద్విరోధీ విరుద్ధః.

6. సూ. సిద్ధాంతీకరించు దాని నాశ్రయించి ప్రవర్తించినదై దానికే విరోధిగా నుండునది విరుద్ధము.

ఉదా:- ఇది హ్రదమగుటవలన నిప్పు గలది. ఇట నిప్పు గలది యను దానిని సిద్ధాంతీకరింపఁ బ్రవర్తించిన "హ్రదమగుటవలన" అనునది సిద్ధాంతీకరింపఁదలఁచిన విషయమునకు విరోధిగానున్నది గాన విరుద్ధము.

మూ. యస్మాత్ప్రకరణ చింతా సా నిర్ణయార్థ మపదిష్టః ప్రకరణ సమః.

7. సూ. ప్రకరణమునకు సంబంధించిన పక్షప్రతిపక్షములఁ బరిశీలించునదై నిర్ణయమునకుఁ బనికిరాని హేతువు ప్రకరణసమము.

నిత్యధర్మము లేకపోవుటవలన శబ్దము అనిత్యము. నిత్యధర్మములు గనిపింపని యనిత్యములగు ఘటాదులువలెే ఇట అనిత్యము సాధింపఁబడుచున్నది. హేతువు గూడ అదే అగుచున్నది. అనిత్యధర్మము లేకపోవుటవలన శబ్దము నిత్యము. అనిత్యధర్మములు గనిపింపని నిత్యములైన యాకాశాదులవలె. ఇక్కడ నిత్యధర్మము లేకపోవుటవలన, అనిత్యధర్మము లేకపోవుటవలన అనెడి హేతువులు నిత్యానిత్యత్వ నిర్ణాయకములుగావు హేతువులు ప్రకరణములగు పక్ష ప్రతిపక్షములతో సమానమైయున్నవి గాన ప్రకరణ సమము.

మూ. సాధ్యా ఽవిశిష్టః సాధ్యత్వాత్సాధ్య సమః.

8. సూ. సాధ్యముకంటె విశేషముగా నుండక సాధ్యమువలె నిదియు సాధింపఁదగియుండుటవలన ఆ హేతువు సాధ్యసము మనఁబడును.

ఉదా:- గతి గలదగుటవలన ఛాయద్రవ్యము. కాంతి యొక్క ఆవరణమే ఛాయ. కాన ఛాయ వేఱు ద్రవ్యము గాదు. అందుచే ఛాయకు ద్రవ్యత్వము సాధింపఁదగి యున్నది. అది ద్రవ్యమైనఁ గదా గతియుండుట. ఛాయకు ద్రవ్యత్వము సాధింపఁదగినట్లు గతియు సాధింపఁదగినదే కాన ఇది సాధ్య సమము. ఇందు హేతువు అదివఱకే సిద్ధమైయుండక సాధింపఁదగి యున్నది. కాన ఇదియే అసిద్ధమని వ్యవహరింపఁబడును. ఇది ఆశ్రయాసిద్ధము స్వరూపా సిద్ధము వ్యాప్యత్వాసిద్ధము. అని మూఁడు విధములు. ఆశ్రయాసిద్ధము :- గగనారవిందము అరవింద మగుటవలన పరిమళము గలది. ఇట పరిమళమునకు ఆశ్రయమైన గగనారవిందము సిద్ధింపలేదు. కానఇది ఆశ్రయాసిద్ధము. స్వరూపా సిద్ధము :- హ్రదము ధూపముగలదగుటవలన ద్రవ్యము. ఇట హ్రదములో హేతువైన ధూపము యొక్క స్వరూపమే సిద్ధించుట లేదుగాన స్వరూపాసిద్ధము. ఉపాధితోఁగూడిన హేతువు వ్యాప్యత్వాసిద్ధము. సాధ్యమందు (సాధింపఁదగిన దానియందు) వ్యాపకమై యుండి సాధనమందు వ్యాపకముగా నుండకపోవునది యుపాధి ఉదా:- పర్వతము నిప్పు గలది గాన పొగ గలది. అనుచోట తడి కట్టెల సంయోగము ఉపాధి ఎక్కడ పొగయున్నదో అక్కడ తడికట్టెల సంయోగము గలదు. కాన సాధ్యమైన పొగయందు తడికట్టెల సంయోగము వ్యాపకమైయున్నది. ఎక్కడ నిప్పు గలదో అక్కడ తడికట్టెల సంయోగము లేదు కాల్చిన యినుపగుండునందు తడికట్టెల సంయోగములేదు. కాన సాధన మయిన నిప్పునందు తడికట్టెల సంయోగము వ్యాపకముగా లేదుకాన ఇదియుపాధి. ఇది యుపాధికలదికాన వ్యాప్యత్వాసిద్ధమైనది.

మూ. కాలాత్య యాపదిష్టః కాలాతీతః.

9. సూ. కాలము నతిక్రమించి చెప్పఁబడిన హేతువు కాలాతీతము.

ఉదా: సంయోగముచేఁ బ్రకటమగుటవలన శబ్దమురూపమువలె నిత్యము. ప్రకటమగుటకుఁ బూర్వముగాని తరువాతఁగాని యున్నరూపము దీపఘటాది సంయోగముచేఁ బ్రకటమైనట్లే అదివఱకే యున్న శబ్దము భేరీదండాది సంయో

గముచే ప్రకటమగుచున్నది. సంయోగముచే ప్రకటమగుటవలన శబ్దము నిత్యము" అనునది సంయోగకాలము నతిక్రమించి చెప్పఁబడినది. దీపఘట సంయోగమున్నపుడు రూపము గ్రహింపఁబడుచున్నది. దీపమునకు ఘటముతో సంయోగము పోయినవెంటనే రూపము గ్రహింపఁబడదు. శబ్దమట్లు గాక భేరీ దండాది సంయోగము పోయినను దూరముగానున్న వానికి భేరీదండాది విభాగ కాలమందు శబ్దము వినఁబడుచున్నది. ఇట శబ్దము ప్రకటనము భేరీదండాది సంయోగకాలము పిదపనే గలుగుచున్నది కాన సంయోగకాలము నతిక్రమించు చున్నది. దీపోదాహరణముతో సాధర్మ్యముగూడ లేదు కాన ఈ హేతువు సాధనముగాదు. కనుక హేత్వాభాసము

ఇది హేత్వాభాస ప్రకరణము

మూ. వచన విఘాతోఽర్థ వికల్పోపపత్త్యాచ్ఛలం.

10. సూ. వాదిచేఁ జెప్పఁబడిన దానికి అర్థాంతరమును గల్పించి వాదికి సమ్మతముగు విషయమును దూషించుట ఛలము.

మూ. తత్త్రివిధం వాక్ఛలం సామాన్యచ్ఛల ముపచారచ్ఛలంచ.

11. సూ. వాక్ఛలము సామాన్యచ్ఛలము ఉపచారచ్ఛలము అని ఛలము మూఁడు విధములు.

మూ. అవిశేషాభిహితేఽర్థే వక్తురభిప్రాయా దర్థాంతకల్పనా వాక్ఛలం.

12. సూ. సామాన్యముగాఁ జెప్పఁబడిన యర్థమందు వక్తయుద్దేశము కంటె మఱియొక యర్థమును గల్పించుట వాక్ఛలము.

ఉదా :- బాలుఁడు నవకంబలుఁడు అను వాక్యములో నవ (క్రొత్త) కంబళము గలవాఁడు అనివాది యనఁగాఁ బ్రతివాది నవపదమునకుఁ దొమ్మిది యను నింకొకర్థమును గ్రహించి బాలునికి ఒక కంబళమే యున్నది గదా తొమ్మిది కంబళ్లెక్కడ అని యర్థమును గల్పించి యాక్షేపించుట వాక్ఛలము. సందర్భాదులు అర్థమును నిర్ణయించును గానఁ దిరుగ వాది తన యర్థమును సమర్థించి యాక్షేపమును బోగొట్టును. ఇట్లే ఈతఁడు హరి అని చెప్పఁగా

విష్ణువుకంటె వాఁడు అను వక్త యొక్క యర్థమును దప్పించి ఈతఁడు హరియైతే తోకయేది అని హరిపదమునకుఁ గ్రోఁతి యర్థమును గ్రహించి యాక్షేపించుట. ము.

మూ. సంభవతోఽర్థ స్యాతి సామాన్యయోగా దసంభూతార్థ కల్పనా సామాన్యచ్ఛలం.

13. సూ. ప్రకృతార్థము నతిక్రమించిన సామాన్యశబ్దము యొక్క సంబంధమునుబట్టి ప్రకృతార్థమునకు సంభవించెడి యర్థమునకుఁ బ్రకృతార్థమునకు సంభవింపని యర్థమును గల్పించుట సామాన్యచ్ఛలము.

ఉదా:- బ్రాహ్మణుఁడు విద్యాశీల సంపన్నుఁడు అని యనఁగా సర్వ బ్రాహ్మణులందు విద్యాశీల సంపద సంభవించినచో బ్రాహ్మణుడైన వ్రాత్యుని యందును విద్యాశీల సంపదయుండునని యాక్షేపించుట సామాన్యచ్ఛలము. వ్రాత్యుఁ డనఁగా ఉపనయనాది సంస్కారహీనుఁడు. ఉపనయనాది సంస్కార రహితుఁడును విద్యాశీలసంపన్నుఁడు గావలసివచ్చు నని యాక్షేపణము. ఈ పొలమున సస్యములు ఫలించు ననఁగా గింజలు చల్లకుండనే మొలచునా? అని యాక్షేపించుట సామాన్యచ్ఛలము.

మూ. ధర్మ వికల్పనిర్దేశేఽర్థ సద్భావ ప్రతిషేధ ఉపచార చ్ఛలం.

14. సూ. శబ్దమునకు అర్థముతోఁగల ధర్మమును వివిధముగఁ గల్పించి చెప్పినపుడు యథాశ్రుతమయిన యర్థమునే చెప్పి యర్థాంతర కల్పనమును నిషేధించుట యుపచారచ్ఛలము.

ఉదా:- మంచములు అఱచుచున్నవి. నిప్పులు కురియుచున్నవి. ఇత్యాదులలో లక్షణాది శక్తులచే మంచములందున్నవారు అని, నిప్పులవలెఁ దీక్ష్ణములైనవి యని యర్థాంతర కల్పనచే నిర్దేశింపఁబడిన పదములకు యథాశ్రుతమైన యర్థమునే చెప్పి మంచము లెట్లు అఱచును నిప్పులెట్లు కురియును అని యాక్షేపించుట యుపచారచ్ఛలము. ఉపచారము అనఁగా లక్షణ. అట్టి లక్షణచే సిద్ధించిన యర్థమును ఆక్షేపించుట ఉపచారచ్ఛల మని భావము.

మూ. వాక్ఛల మేవోపచారచ్ఛలం తదవిశేషాత్.

15. సూ. అర్థాంతర కల్పనలో విశేషము లేకపోవుటవలన వాక్ఛలమును ఉపచారచ్ఛలమును ఒకటియె. ఇది పూర్వపక్షి యాక్షేపణము.

మూ. న తదర్థాంతర భావాత్.

16. సూ. ఆ రెండిటిలో అర్థభేదముండుటవలన అవి రెండును ఒకటియె యనరాదు.

నానార్థక పదములందు వాదికిష్టమైన యర్థమును విడిచి యర్థాంతరమును గల్పించి యాక్షేపించుట వాక్ఛలము లక్షణాదులచే సిద్ధమైన యర్థాంతరమందు ప్రయోగింపఁబడిన పదమునకు స్వతస్సిద్ధమైన యర్థమునె చెప్పి నిషేధించుట యుపచారచ్ఛలము. ఇది యీ రెండిటికి భేదమని భావము.

మూ. అవిశేషేవా కించిత్సాధర్మ్యా దేకచ్ఛల ప్రసంగః

17. సూ. స్వల్పసాధర్మ్యమునుబట్టి యవి రెండు నొక్కటె యన్నచోఁ బైని జెప్పఁబడిన మూఁడు విధములైన చలములుగూడ నొకటె యని చెప్పవలసివచ్చును.

ఇది చల ప్రకరణము

మూ. సాధర్మ్య వైధర్మ్యాభ్యాం ప్రత్యవస్థానం జాతిః

18. సూ. వాదిచేఁ జెప్పఁబడిన హేతువును ఉదాహరణముల సాధర్మ్య వైధర్మ్యములచే దూషించుట జాతి యనబడు "ఆత్మ అనిత్యము" అని నాస్తికుఁడైన వాది తన మతమును నిశ్చయించుటకై యనఁగాఁ బ్రతివాది "ఆకాశమువలె సర్వవ్యాపకముగాన ఆత్మ నిత్యము" అని ఆకాశసాధర్మ్యమునబట్టి వాది మతమును దూషింప దానికి ప్రతియుక్తితోఁచక వాది సర్వవ్యాపకమైన యాకాశముయొక్క సాధర్మ్యమును బట్టి ఆత్మనిత్యమన్నచో చేతనమైన యాకాశముయొక్క వైధర్మ్యమునుబట్టి "ఆత్మ అనిత్యమెందుకుఁ గాదు" అని దూషించుట జాతి యగును. మరలఁ బ్రతివాది అనిత్యములగు ఘటాదులకు లేని సర్వవ్యాపకత్వముండుటచే ఆత్మ నిత్యము. అని ఘటాది వైధర్మ్యము వాది మతమును దూషింపఁగా దీనికిఁ బ్రతియుక్తితోఁచక వాది ఘటవైధర్మ్యమునబట్టి ఆత్మ నిత్యమైనచోఁ బదార్థమైన ఘటముయొక్క సాధర్మ్యమునుబట్టి యనిత్యమని యెందుకుఁ జెప్పరాదని దూషించును. ప్రతివాదియుక్తిని దూషించుటకు జీవము (=పుట్టినది) గాన జాతియని వ్యుత్పత్తి.

మూ. విప్రతి పత్తి రప్రతిపత్తిశ్చ నిగ్రహస్థానం.

19. సూ. విపరీతజ్ఞానమును, వాదిని జయించుటకు మరల వాదము నారంభింపకపోవుటయును నిగ్రహస్థానమనఁబడు. నిగ్రహస్థాన మనఁగాఁ బరాజయప్రాప్తి యని భావము. తన నిగ్రహమునకు స్థానమైనది గాన నిగ్రహస్థానమని వ్యుత్పత్తి.

మూ. తద్వికల్పాజ్జాతి నిగ్రహస్థాన బహుత్వం.

20. సూ. విపరీతజ్ఞానము యొక్కయు అజ్ఞానము యొక్కయు వివిధత్వమునుబట్టి జాతియును నిగ్రహస్థానమును బహువిధములై యుండును.

మాటాడకయుండుట, తెలిసికొనకపోవుట, తెలివి లేకపోవుట, మనస్సునకు నిలుకడలేకపోవుట, వాది చెప్పినదాని నంగీకరించుట, బ్రతిమాలుట ఉపేక్షించుట ఇవి యజ్ఞానములోని రకములు. మిగిలినవి విపరీత జ్ఞానములు అని తెలియునది. ఇవి పంచమాధ్యాయమున వివరింపఁబడును.

ఇది రెండవ యాహ్నికము

మొదటి యధ్యాయము సమాప్తము

—:(०):—

# న్యాయ మీమాంసాదర్శనము

## రెండవ యధ్యాయము

### మొదటి ఆహ్నికము

మూ. సమానానేక ధర్మాధ్యవసాయా దన్యతర ధర్మాద్యవసాయాద్వా న సంశయః.

1. సూ. సమాన ధర్మజ్ఞాన నిశ్చయమువలనఁగాని యనేక ధర్మజ్ఞాన నిశ్చయమువలనఁ గాని ఏదో యొక ధర్మజ్ఞాన నిశ్చయమువలనఁ గాని సంశయము గలుగదు.

ఇది పూర్వపక్ష సూత్రము. ఏవో రెండు వస్తువులున్నవుడు ఏదో యొకదాని నిశ్చయజ్ఞానమున్నపుడు రెండవ దాని జ్ఞానము గలుగును గనుక సంశయమెట్లు గలుగునని పూర్వపక్షిపశ్నము. స్తంభమునకుఁ బురుషునకు సమానధర్మములున్నను స్తంభజ్ఞాన నిశ్చయమున్నపుడు రెండవదైన పురుష ధర్మజ్ఞానమునందెట్లు సంశయము గలుగును అని శంక.

మూ. విప్రతి పత్త్య వ్యవస్థా ధ్యవసాయాచ్చ.

2. సూ. విరుద్ధ జ్ఞాన నిశ్చయమువలనఁ గాని వ్యవస్థలేనట్లు గలిగిన నిశ్చయమువలనఁ గాని సంశయము గలుగదు.

ఇది విరుద్ధజ్ఞానము, ఇందులో వ్యవస్థ లేదు అని తెలిసిన వారికి సంశయము గలుగును గాని అవి తెలియని వారికెట్లు సంశయము గలుగును. నాస్తికులకు ఆత్మలేదని నిశ్చయజ్ఞానము గలదు. వారికింక ఆత్మ విషయములో సంశయమెట్లు గలుగును. ఆస్తికులకు ఆత్మ గలదని నిశ్చయజ్ఞానము గలదు. వారికింక సంశయమెట్లు గలుగుమ. ఈ సూత్రమును తరువాతి 3, 4, 5 సూత్రములును పూర్వపక్షసూత్రములు.

మూ. విప్రతిపత్తే చ సంప్రతిపత్తేః.

3. సూ. విరుద్ధజ్ఞానమందు నిశ్చయజ్ఞానముండుట అది సంశయమునకు హేతువు గాదు.

మూ. అవ్యవస్థాత్మని వ్యవస్థిత త్వాచ్చాఽవ్యవస్థాయాః.

4. సూ. అవ్యవస్థగల వానియందు అవ్యవస్థయే వ్యవస్థగా నుండుట వలన అవ్యవస్థ సంశయమునకు హేతువు గాదు

వ్యవస్థ లేనివానికి (నిశ్చయజ్ఞానము లేనివానికి) దనలోని యవ్యవస్థయె (అనిశ్చయజ్ఞానమె) వ్యవస్థ (నిశ్చయముగా)గాఁ దోఁచుచున్నది గాన వానికింక ఆ యనిశ్చయజ్ఞానము సంశయమునకు హేతువు గాదని శంక.

మూ. తథాత్యంత సంశయ స్తద్ధ సాతత్యోపపత్తేః.

5. సూ. అట్లే యవ్యవస్థ సంశయమునకు హేతువని యన్నచో సమానాదిధర్మము లెప్పుడును ఎడతెగక యుండును గాన నిశ్చయము గలిగి నపుడును సంశయము అత్యంతము గలుగక మానదు.

స్తంభమా పురుషుఁడా అని సంశయము కలిగి దగ్గరకుపోయి స్తంభమనియో పురుషుఁడనియో నిశ్చయించినను సంశయమునకు హేతువులైన సమానధర్మములు వానిని విడిచిపోవు గాన సంశయము మామూలుగానే యుండును గాన సంశయము పోవుటెట్లు అని యాక్షేపణము.

మూ. యథోక్తాధ్యవసా యా దేవ తద్విశేషాపేక్షాత్ సంశయే నాఽసంశయో నాత్యంత సంశయోవా.

6 సూ. నిశ్చయజ్ఞానమును గలిగించు విశేషధర్మములు లేని సమాన ధర్మాదిజ్ఞానమువలన సంశయ విషయమందు సంశయము లేకపోవుటగాని ఎడతెగని సంశయము గాని కలుగదు.

ఇది సిద్ధాంతసూత్రము. ఇది స్తంభము గాదు పురుషుఁడు అని తెలిపెడిక రచరణాదులును చలనాదికియును లేనవుడు సంశయము కలుగక మానదని భావము.

మూ. యత్ర సంశయ స్తత్రై వ ముత్తరోత్తర ప్రసంగః.

7. సూ. సంశయము గలిగినచోట నెల్ల నిట్లే యుత్తరోత్తర పరీక్ష చేయవలయును.

ఇది సంశయ పరీక్షాప్రకరణము

---

మూ. ప్రత్యక్షాదీనా మప్రామాణ్యం త్రైకాల్యాసిద్ధేః.

8. సూ. వస్తు విషయక జ్ఞానమును గలిగించు ప్రత్యక్షాది ప్రమాణములు భూతభవిష్యద్వర్తమానకాలములు మూఁడిటియందు నుండుట శక్యము గాదు గాన అవి ప్రమాణములు గావు. ఇది పూర్వపక్షసూత్రము

మూ. పూర్వం హి ప్రమాణసిద్ధౌ నేంద్రియార్థ సన్నికర్షాత్ ప్రత్యక్షోత్పత్తిః.

9. సూ. ప్రమేయముకంటె మొదటనే ప్రమాణము సిద్ధించునన్నచో ప్రమాణముకంటెఁ బూర్వము ప్రమాణముచేఁ దెలియఁదగు ప్రమేయ విషయములు లేవు గాన ఇంద్రియార్థ సంనికర్షవలనఁ బ్రత్యక్షము గలుగుననుట కుదురదు. ముందు వస్తువు తరువాత దానిని దెలుపు ప్రమాణము ఉన్నఁగాని ఆ వస్తు విషయకజ్ఞానము గలుగదని భావము. ఇదియుఁ బూర్వపక్షసూత్రము.

మూ. పశ్చాత్సిద్ధౌ న ప్రమాణేభ్యః ప్రమేయసిద్ధిః.

10 సూ. ప్రమేయ వస్తువుకంటెఁ దరువాతనె ప్రమాణము సిద్ధించు నన్నచో ప్రమాణములవల్ల, ఆ ప్రమాణములచేఁ దెలియఁదగు ప్రమేయ వస్తువులు సిద్ధింపవు.

ముందే వస్తువులు గలుగునన్నచో ఆ వస్తువులను దెలుపు ప్రమాణములు లేనపుడు ఆ వస్తువులను దెలిసికొనుట కుదురదని భావము. ఇదియుఁ బూర్వపక్ష సూత్రము.

మూ. యుగపత్సిద్ధౌ ప్రత్యర్థ నియతత్వాత్ క్రమవృత్తిత్వా భావో బుద్ధీనాం.

11. సూ. ప్రమాణ ప్రమేయము లొకసారె సిద్ధించునన్నచో తత్తద్విషయక బుద్ధులు ప్రతియర్థమందును నియతమై యుండుటవలన అవి క్రమముగఁ గలుగుట సంభవింపదు. ఇదియుఁ బూర్వపక్షసూత్రము.

మూ. త్రైకాల్యాసిద్ధేః ప్రతిషేధానుపపత్తిః.

12. సూ. ప్రత్యక్షాది ప్రమాణములు మూఁడు కాలములందు సిద్ధింపవు గాన ప్రత్యక్షాది ప్రమాణములకుఁ బ్రామాణ్యము లేదని నిషేధించిన యెడల ఈ నిషేధము గూడ మూఁడు కాలములందు సిద్ధింపక పోవుటవలనఁ బ్రత్యక్షాదులకుఁ బ్రామాణ్యము లేదని నిషేధించుటకు వీలులేదు.

మొదటనె ప్రత్యక్షాదుల ప్రామాణ్యమునకు నిషేధము సిద్ధించునన్నచో నిషేధింపఁదగినదే లేనపుడు నిషేధింపఁబడునది యేది? తరువాతనె నిషేధము సిద్ధించునన్నచో మొదట నిషేధము లేకపోవుటవలన నిషేధింపఁదగినది సిద్ధింపదు. రెండును ఒకసారె సిద్ధించునన్నచో నిషేధింపఁదగిన దాని యస్తిత్వమును అంగీకరించుటచే నిషేధించుటవలనఁ బ్రయోజనమేమి? మూఁడు కాలములలోను ప్రత్యక్షాదుల ప్రామాణ్యమును నిషేధించుటకు వీలులేకపోవుట వలనఁ బ్రత్యక్షాదుల ప్రామాణ్యము సిద్ధించునని భావము. ఇది సిద్ధాంత సూత్రము.

మూ. సర్వప్రమాణ ప్రతిషేధాచ్చ ప్రతిషేధానుపపత్తిః.

13. సూ. ప్రత్యక్షాది ప్రమాణములన్నిటికిని ప్రామాణ్యమును నిషేధించుటవలనను "ప్రత్యక్షాదులకుఁ బ్రామాణ్యము లేదు" అని నిషేధించుట తగదు.

ఏదైన సాధింపవలయు నన్నచో ఏదేని యుదాహరణమును జూపి సాధింపవలయును. ఆ యుదాహరణముగూడఁ బ్రత్యక్షాది ప్రమాణసిద్ధమె యగును. అన్ని ప్రమాణములను నిషేధించుటచేఁ బ్రత్యక్షాది సిద్ధమైన యుదాహరణములే యుండవు. అవే లేకపోయినపుడు ఇంక సాధించుటయు నిషేధించుటయు ఎట్లు గుదురును. కాన ఈ నిషేధము తగదని భావము.

మూ. తత్ప్రామాణ్యే వాన సర్వప్రమాణ ప్రతిషేధః.

14. సూ. ప్రత్యక్షాదులకుఁ బ్రామాణ్యమును నిషేధించుటకుఁ జూపఁబడిన యుదాహరణము ప్రమాణమన్నచో ఈ ప్రత్యక్షాది ప్రమాణము లన్నిటినిగూడఁ బ్రతినిషేధించుట తగదు

మూ. త్రైకాల్యా ప్రతిషేధశ్చ శబ్దాదాతోద్య సిద్ధివత్తత్సిద్ధే

15. సూ. ధ్వనినిబట్టి తత్పూర్వసిద్ధములగు వాద్యవిశేషాదులు సిద్ధించునట్లు ప్రత్యక్షాది ప్రమాణములనుబట్టి తత్పూర్వసిద్ధములగు ప్రమేయములు సిద్ధించుచుండుటవలన "త్రికాలములందు సిద్ధించకపోవుటవలనఁ బ్రత్యక్షాదులకుఁ బ్రామాణ్యము లేదు" అని నిషేధించుట తగదు.

వాద్యాదులు మ్రోయించిన కొలఁదిసేపటికి వాని ధ్వని వినఁబడును. ఆ ధ్వనినిబట్టి తత్పూర్వకాలసిద్ధములగు వాద్యవిశేషాదులు ఊహింపఁబడును. అట్లే ప్రమాణములనుబట్టి పూర్వసిద్ధములగు ప్రమేయములు ఊహింపఁబడునని భావము.

మూ. ప్రమేయా చ తులా ప్రామాణ్యవత్

16. సూ. త్రాసుయొక్క ప్రామాణ్యమువలెఁ బ్రమేయత్వమును సిద్ధించును.

బరువును దెలుపు సాధనమైన త్రాసు ప్రమాణము. దీనికి విషయమైన బరువుగల బంగారము మొదలగునవి ప్రమేయములు. ఆ తూచఁబడిన బంగారమునుబట్టి త్రాసు యొక్క మధ్యభాగము నిశ్చయించఁబడును. పిదప త్రాసు యొక్క మధ్యభాగము తెలియుటలో ఆ బంగారము మొదలగునవి ప్రమాణములగును. త్రాసు యొక్క మధ్యభాగము ప్రమేయమగును. ఇట్లే తెలిసికొనఁదగినది గాన ఆత్మ ప్రమేయము. జ్ఞానము గలిగించుటలో స్వతంత్రమైనది గాన ఆత్మ ప్రమాణము. మొ.

అవతారిక :- ప్రత్యక్షాదులు ఇతర ప్రమాణముచే సిద్ధించునా ప్రమాణము లేకుండనె సిద్ధించునా పరీక్షింపఁబడుచున్నది.

మూ. ప్రమాణతః సిద్ధేః ప్రమాణానాం ప్రమాణాంతర సిద్ధి ప్రసంగః.

17. సూ. ప్రమాణాంతరముచేతఁ బ్రత్యక్షాది ప్రమాణములు సిద్ధించునని స్వీకరించినచోఁ బ్రత్యక్షాదులకంటె నింకొక ప్రమాణము గూడఁ గలదని యంగీకరించవలసి వచ్చును.

ఆ ప్రమాణము ఇంకొక ప్రమాణముచేత సిద్ధించుననవలసి వచ్చి దానికింకొక ప్రమాణము దీనికింకొక ప్రమాణము అని యిట్లు అవ్యవస్థాదోషము సంభవించును. ఇది పూర్వపక్షసూత్రము.

మూ. తద్వినివృత్తేర్వా ప్రమాణసిద్ధివత్ ప్రమేయసిద్ధిః.

18. సూ. ప్రమాణాంతరము లేకుండనె ప్రత్యక్షాది ప్రమాణము॥ సిద్ధించుచున్నచో అట్లె ప్రమేయములును సిద్ధించును. ఇదియుఁ బూర్వపక్ష సూత్రము.

మూ. న, ప్రదీప ప్రకాశ సిద్ధివత్ తత్సిద్ధేః.

19. సూ. దీపపు వెలుఁగువలెఁ బ్రత్యక్షాది ప్రమాణములు సిద్ధించును గానఁ బ్రమాణాంతరముల నంగీకరింపవలసి వచ్చునని గాని యితర ప్రమాణము లేకుండనె ప్రమాణములవలెఁ బ్రమేయములును సిద్ధించునని గాని యనరాదు.

ఇది సిద్ధాంతసూత్రము. దీపపు వెలుఁగు చీఁకటిలోఁ బదార్థములను బ్రకాశింపఁజేయుచుఁ గన్నులకు సహకారి యగును. కాన దీపపు వెలుఁగు కూడ బ్రత్యక్ష ప్రమాణమె. కన్నులచే దీపపు వెలుఁగును దెలిసికొందుము. ఇటులు ఒక ప్రత్యక్ష ప్రమాణము మఱొక ప్రత్యక్షముచే గ్రహింపఁబడును. బాహ్యవస్తు జ్ఞానమునుబట్టి యింద్రియశక్తి, ఆ యింద్రియములకు బాహ్యవస్తులకుఁ గల సంబంధము ఊహింపఁబడుచున్నది. ఇట్లు అనుమానముచేఁ బ్రత్యక్షజ్ఞానములు సిద్ధించుచున్నవి. ఈ విధముగఁ బ్రత్యక్షాదులు నాలుగింటిలో ఏదో యొకటి యింకొకదానికి సహకారి యగును. కాన ఈ నాలుగింటికంటె వేఱొక ప్రమాణమును అంగీకరించుట గాని ప్రమాణాంతరము లేకుండ స్వతస్సిద్ధముగ ప్రమాణ ప్రమేయసిద్ధి కలుగుటగాని జరుగదని భావము.

ఇది ప్రమాణ సామాన్య పరీక్షాప్రకరణము

—:(o):—

మూ. ప్రత్యక్ష లక్షణానుపపత్తి సమగ్రవచనాత్.

20. సూ. ప్రత్యక్ష లక్షణము సమగ్రముగాఁ జెప్పకపోవుటవలనఁ బ్రత్యక్షలక్షణము ఉపపన్నమైనది గాదు.

ఆత్మ మనస్సన్నికర్షము లేనిచోఁ బ్రత్యక్షము గలుగదు కాన లక్షణములో ఆత్మ మన స్సన్నికర్షజన్యమని కూడఁ జేర్పవలయునని భావము. ఇదే ముందు సూత్రములోఁ జెప్పఁబడుచున్నది.

మూ. నాత్మ మనసోః సన్నికర్షాభావే ప్రత్యక్షోత్పత్తిః.

21. సూ. ఆత్మ మనస్సుల సన్నికర్షము లేనిచోఁ బ్రత్యక్షము గలుగదు.

మూ. దిగ్దేశకాలాకాశేష్వప్యేవం ప్రసంగః

22. సూ. ఇట్లే దిక్కులు దేశము కాలము ఆకాశము వీనియొక్క సంబంధము లేనిదే ప్రత్యక్షము గలుగదు.

ఇందుచే లక్షణములో ఆత్మ మన స్సన్నికర్షజన్యమనియు దిగ్దేశాది సంబంధజన్యమనియుఁ జేర్పవలె నని భావము. పైమూఁడు సూత్రములు పూర్వ పక్షసూత్రములు.

మూ. జ్ఞానలింగత్వాదాత్మనో నావరోధః.

23. సూ. జ్ఞానము ఆత్మకు సూచకముగానఁ బ్రత్యక్ష లక్షణములో ఆత్మ సంగ్రహింపఁబడక పోలేదు.

ఆత్మసంయోగములేనిదే అసలు ఏవిధమైన జ్ఞానము గలుగదు. కాన ఆత్మ సంగ్రహింపఁబడినట్లే యగును. అందుచే స్పష్టముగా తెలియఁబడుచున్నందున ఆత్మస్సంయోగజన్యమని లక్షణములోఁ జెప్పఁబడలేదని భావము. దిగాదులు ప్రత్యక్షములకుఁ గారణమనుటలో ప్రమాణము లేదనియుఁ దెలియునది.

మూ. తదయౌగపద్యలింగత్వాచ్చ న మనసః.

24. సూ. ఒకమాటుగా అనేక జ్ఞానములు పుట్టకపోవుట మనస్సున్న దనుటలో సూచకముగాన లక్షణములో ఆత్మ సంగ్రహింపఁబడక పోలేదు.

ఆత్మకు మనస్సుతో మనస్సుకు ఇంద్రియములతోను సంనికర్షమున్ననే గాని ఏవిధమైన జ్ఞానమును గలుగదు గాన మనస్సన్నికర్షజన్య మని లక్షణములోఁ జెప్పకపోయినను స్పష్టముగఁ దెలియనే తెలియుచున్నది. కాన సంయోగ మనునది సంగ్రహింపఁబడినట్లే యగును. కాన లక్షణములోఁ జెప్పవలసినపని లేదని భావము.

మూ. ప్రత్యక్షనిమిత్తత్వాచ్చేంద్రియార్థయోః సన్నికర్షస్య పృథగ్వచనం.

25. సూ. ప్రత్యక్షాది సర్వప్రమాణములకు ఆత్మ మన స్సన్నికర్షము ఇంద్రియార్థసన్నికర్షము ప్రత్యక్షమునకు మాత్రమే నిమిత్తము

అందుచేత ప్రత్యక్షలక్షణములో నింద్రియార్థ సన్నికర్షము ప్రత్యక్షమునకు హేతువని మాత్రమె వేఱుగఁ జెప్పఁబడెను.

మూ. సుప్తవ్యాసక్త మనసాం చేంద్రియార్థయోః సన్నికర్ష నిమిత్తత్వాత్.

26. సూ. నిద్రించిన వారికిని ఇతర విషయములందుఁ దగులొ్కనిన మనసుగల వారికిని జ్ఞానము గలుగుటలో ఇంద్రియార్థ సన్నికర్షమే ప్రధాన నిమిత్తమగుటచేత ఇంద్రియార్థ సన్నికర్షజన్య మనియె గాని ఆత్మమనస్సన్నికర్షజన్యమని కూడఁ బ్రత్యక్షలక్షణములోఁ జేర్పఁబడలేదు.

నిద్రించువానికిని విషయాంతరమును ధ్యానించువానికిని హఠాత్తుగాఁ గలిగిన ధ్వని మొదలగునవి మేలొ్కల్పి ప్రస్తుత విషయమందుఁ బ్రవృత్తిగల వానిని గాఁజేయును. అప్పుడు ముఖ్యముగ ఇంద్రియములె పనిచేయును. కాని ఆత్మ ప్రయత్నపూర్వకముగా తెలిసికొనఁగోరి మనస్సును ప్రేరేపింపదు. మనస్సు ఇంద్రియములతో ఈ పని చేయుమని నియోగింపదు. ఇట్లు నియోగింప నక్కరలేకుండనే ఆయా శబ్దాదులను ఇంద్రియములు గ్రహించును. కాన లక్షణములో ఇంద్రియార్థ సన్నికర్షజన్యమని చెప్పఁబడెనని భావము.

మూ. తైశ్చాపదేశో జ్ఞానవిశేషాణాం.

27. సూ. ఆయా యింద్రియముల కాయా విషయములతో సన్నికర్షమునుబట్టి యా యా జ్ఞానవిశేషముల వ్యవహారమును గలుగుచున్నది కానఁ బ్రత్యక్షములో నింద్రియార్థ సన్నికర్షయే ముఖ్యము. ముక్కుచే వాసన చూచుట, కంటిచేఁ జూచుట, నాలుకచే రుచి చూచుట మొదలగు జ్ఞానవిశేషములు గలుగుచున్నవి. ముక్కుచే వాసన చూచుట మొదలగు వానిని ఘ్రాణప్రత్యక్షము చాక్షుషప్రత్యక్షమని రాసనప్రత్యక్షము ఇత్యాది వ్యవహారములును గలుగుచున్నవి. కాన ఇంద్రియార్థసన్నికర్షయె ముఖ్యమని భావము.

మూ. వ్యాహతత్వా దహేతుః.

28. సూ. ఆత్మ మనస్సన్నికర్షము లేనిచో ఇంద్రియములు విషయములను గ్రహింపలేవు గాన ఇంద్రియార్థసన్నికర్షము ప్రత్యక్షజ్ఞానమునకు హేతువు గాదు. ఇది పూర్వపక్షసూత్రము.

మూ. నార్థ విశేషప్రాబల్యాత్.

29. సూ. ఇంద్రియార్థసన్నికర్షము ముఖ్యమగుటవలన అదియె ప్రధానమని తెలుపుటకె యింద్రియార్థసన్నికర్షజన్యమని చెప్పఁబడెను గాని ఆత్మమనస్సన్నికర్షయుండదని చెప్పుటకుఁ గాదు కానఁ బైనిజెప్పిన దోషము లేదు.

మూ. ప్రత్యక్ష మనుమాన మేకదేశ గ్రహణా దుపలబ్ధేః.

30. సూ. అవయవిలోని యొక యవయవభాగమునుబట్టి సంపూర్ణజ్ఞానము గలుగుచున్నది గానఁ బ్రత్యక్ష మనుమానమె యగును.

పొగచే నిప్పును అనుమానించినట్లు ప్రత్యక్షసిద్ధమైన వృక్షములోని యొకభాగమయిన మొదలును జూచి మిగిలిన వృక్షమంతటిని ఊహించి తెలిసి కొనవచ్చును గాన ఇది యనుమాన ప్రమాణములోనే గతార్థమగునని పూర్వపక్షము.

మూ. న, ప్రత్యక్షేణ యావత్ తావదప్యుపలంభాత్.

31. సూ. ప్రత్యక్షముచే నేదో కొంతభాగమైనను దెలియఁబడుటవలన నిది యనుమానములో గతార్థమగు ననరాదు. వృక్షములో ఏక దేశజ్ఞానము గూడఁ బ్రత్యక్షముచేతఁ గాక మఱియొకదానిచే సిద్ధింపదు గానఁ బ్రత్యక్షమెట్లును అవసరమె. ప్రత్యక్షముచేతనె సమస్తవృక్షమును దెలియుటచే మూలభాగమును ప్రత్యక్షముచేతను తరువాతి భాగమును భాగములును అనుమానముచేతను గ్రహించి జ్ఞానగౌరవమును పొందుట వ్యర్థమని భావము.

మూ. నచైకదేశోపలబ్ధి రవయవి సద్భావాత్.

32. సూ. అదియును గాక అవయవము ప్రత్యక్షమగు కాలమందును అవయవి యుండుటవలన చక్షుస్సంయోగాదులకుఁ బ్రత్యక్ష మద్దగింపఁబడదు గానఁ బ్రత్యక్ష మనుమాన మనరాదు.

ఇది ప్రత్యక్ష పరీక్షాప్రకరణము

—:(o):—

మూ. సాధ్యత్వాదవయవిని సందేహః.

33. సూ. అవయవములకంటె వేఱుగా అవయవి యున్నదని సాధింపఁదగియుండుటవలన అవయవములకంటె వేఱుగా అవయవి యనునది యున్నదా యను సందేహము గలుగుచున్నది.

ఒకటే సాధనమును సాధ్యమును గాదు. అవయవియైన వృక్ష మిట సాధింపఁదగిన దగుటవలన ఆ సాధింప దగిన దాని విషయములో మరల నది సాధనముగా నుండరాదు. కాన ఈ హేతువు సరియగు హేతువుగాదు. అందుచే అవయవి యందునిశ్చయజ్ఞానము గలుగుటలేదు అని పూర్వపక్షము.

మూ. సర్వాగ్రహణ మవయవ్యసిద్ధేః.

34. సూ. అవయవములకంటె వేఱుగా అవయవి సిద్ధింపకపోయినచో సర్వపదార్థములను గ్రహించుటకు వీలుపడదు.

అవయవములకన్న వేఱుగా అవయవి యుండదు అని కొందఱు మతము. దానికిది ఖండనము అణువులు అతీంద్రియములు గానఁ బరమాణువులు కూడిన కంటికిఁ గనిపింపదు. అవయవి లేదన్నచో అణువుల సముదాయ రూపమైన ద్రవ్యాదులు గ్రహింపఁబడక పోవలసివచ్చును. ఈ కుండ నల్లనిది, ఒకటి, పెద్దది, పట్టుకొనఁబడినది అని వ్యవహరింపఁబడుచున్నది. ఈ వ్యవహారమును బట్టియు ఘటాదులు గ్రహణాది విషయములగుటనుబట్టియు అవయవి వేఱుగా నున్నట్లు తెలియుచున్నదని భావము.

మూ. ధారణాకర్షణోపపత్తేశ్చ.

35. సూ. ద్రవ్యాదుల ధారణము ఆకర్షణము ను ఉపపన్నమగుట వలన అవయవములకన్న అవయవి వేఱుగా నున్నది.

మూ. సేనా వన వత్ గ్రహణ మితి చేన్నాతీంద్రియత్వా దణూనాం.

36 సూ. దూరమందున్న సేనను వనమును విడిగా అశ్వరథ ఘటాదికముగను శాఖాలతా వృక్షాదికముగఁ గాక సమూహముగా గ్రహించునట్లు గ్రహింపవచ్చునన్నచో అవయవములైన యణువులు అతీంద్రియ విషయములు

గానఁ బ్రత్యక్షము గాకపోవలసివచ్చును అందుచే అవయవములకంటె అవయవి వేఱయినది కాదనరాదు.

ఇది అవయవి పరీక్షాప్రకరణము

—:(o):—

మూ. రోధోపఘాత సాదృశ్యేభ్యో వ్యభిచారా దనుమాన మప్రమాణం.

37. సూ. గట్టువేయుటచే నదినిండుట, గూటి కపాయము గలుగుటచే జీమలు గుడ్లను దీసికొనిపోవుచుండుట, సదృశధ్వనినిబట్టి నెమలి కూఁత మొదలగు వర్షానుమాన కారణములు వ్యభిచరించుటవలన అనుమానము ప్రమాణము గాదు.

నది నిండుటచేత వర్షము కురిసినదనెడి యనుమానములో నది నిండుటకు వర్షము కురియుటవలననె గాక నది క్రింద గట్టువేయుటవలనఁ గూడ నది నిండవచ్చును గాన వర్షము కురిసినదనెడి యనుమానము నియతము గాదు. కాన ఈ యనుమానము ప్రమాణము గాదని భావము. ఇట్లే చీమలు గుడ్లను దీసికొని పోవుటకు వర్షమువలననే గాక చీమల గూటికేదైన నపాయము వచ్చినచో అవి తమ గుడ్లను దీసికొనిపోవుటయు సంభవింపవచ్చును. అందువలన వర్షమువల్లనే చీమలట్లు చేయుచున్నవనుటకు వీలులేదు. కాన నీ యనుమానమును అప్రమాణమని భావము. నెమలివలెనె నెవరైనఁ గూసినచో ఆ కూతనుబట్టి మేఘము ననుమానించుట కుదురదుగాన అదియు ప్రమాణము గాదు. కాన అనుమానము వస్తునిర్ణయము చేయుటలోఁ బ్రమాణము గాదని యాక్షేపము.

మూ. నైకదేశ త్రాస సాదృశ్యేభ్యోఽర్థాంతరభావాత్,

38. సూ. కారణైక దేశములగు కేవల జలవృద్ధికంటెను పిపీలికా భయముకంటెను. సమానధ్వనికంటెను ఇతరమైన యర్థవిశేషములు సరియగు హేతువులందుండుట వలన అనుమానము అప్రమాణ మనరాదు.

గట్టువేసినపుడు కేవల జలవృద్ధి మాత్రమే యుండునుగాని తృణకాష్ఠములు నురుగు ప్రవాహవేగమును ఉండవు కానఁ గేవల జలసమృద్ధినిబటి వర్షానుమానము చేయుట తగదు. అటే అన్నిచోట్ల గుడ్లను దీసికొనిపోవు. చీమల

గుంపునుబట్టి వర్షానుమానము చేయఁదగును గాని కేవల మొక్కచోట కంగారు పడిన కొంచెము చీమలచే వర్షానుమానము చేయరాదు విశేషపరిజ్ఞానము లేకపో వుటవల్ల సదృశధ్వనివల్ల నెమలి కేక యనుభ్రమ గలుగును గాని విశేషపరి జ్ఞానమున్నచోట అట్లు భ్రమకలుగదు. కాన సరియగు కారణములను జెప్పలేని వానిదే యీ దోషము. కాన అనుమానము ప్రమాణమైనదే గాని యప్రమాణ మైనది గాదని భావము.

ఇది అనుమానపరీక్షా ప్రకరణము

మూ. వర్తమానాభావః పతతః పతిత పతితవ్య కాలోపపత్తేః.

39. సూ. ఫలము పడుచున్నపుడు కనిపించు పడినచోటునుబట్టి భూతకాలమును పడఁదగినచోటునుబట్టి భవిష్యత్కాలమును మాత్రమె గోచరించు చున్నది కాని పడుచున్నచోటు కనిపింపకపోవుటచే వర్తమానకాల మనునది లేదు.

ఇది పూర్వపక్షసూత్రము. ఫలము పడినట్టియుఁ బడఁబోవునట్టియు: ప్రదేశము మాత్రము గనిపించును. పడుచున్న ప్రదేశము గనిపించుటలేదు గాన మూఁడవదగు వర్తమానము లేదు అని శంక.

మూ. తయోరప్యభావో వర్తమానాభావే తదపేక్షత్వాత్,

40. సూ. వర్తమానకాలము లేదన్నచో వర్తమానకాలము నాధారము చేసికొని ప్రవర్తిల్లినవగుటవల్ల భూతభవిష్యత్కాలములును లేకపోవలసివచ్చును.

కాలమను మనునది ప్రదేశమునుబట్టి గాక క్రియనబట్టి ప్రవర్తిల్లును. పతనక్రియ ముగినచో అది పడిన కాలము అనగా భూతకాలమగును. పతన క్రియ యింక బయలుదేఱ నన్నచో అది పడఁదగిన కాలము భవిష్యత్కాల మగును. ఆ ద్రవ్యమందు పతనకాలమే లేనిచో నింక ముగిసిన -ముగియఁబోవు కాలములెట్లు సిద్ధించును.

మూ. నాతీతానాగతయో రితరేతరయో రితరేతరాపేక్షా సిద్ధిః.

41. సూ వర్తమానకాలము లేకుండఁగనె భూతభవిష్యత్కాలము లొకదానినిబట్టి యొకటి సిద్ధించునన్నచో అన్యోన్యాశ్రయ దోషము గలుగును గాన అట్లనరాదు.

భవిష్యత్కాలములో వస్తుసిద్ధిలేదు. భూతకాలములో వస్తుసిద్ధి నశించును. కనుక దేనినిబట్టి ఏది సిద్ధించును. సిద్ధమైన వస్తు వింకొకవస్తువును సిద్ధింపఁ జేయును. కాని భూతభవిష్యద్వస్తువులు సిద్ధము గావివే. కాన దేనిచే దేనిని సిద్ధింపఁ జేయును. కాన వర్తమానము నొప్పితీరవలయునని భావము హ్రస్వ దీర్ఘములు మెఱుకపల్లములు నీడవెలుగులు మొదలగు వానియందుపలె నిట విశేష హేతువులు లేకపోవుటవలన ఒకదానినిబట్టి యొకటి సిద్ధింపవని భావము.

మూ. వర్తమానాభావే సర్వాగ్రహణం ప్రత్యక్షానుపపత్తేః.

42. సూ. వర్తమానకాలము లేనపుడు వస్తుప్రత్యక్షమే కుదురదు కాన సర్వపదార్థములును గ్రహింపఁబడక పోవలసివచ్చును.

ఇంద్రియములకు పదార్థములు ప్రత్యక్షమగుట వర్తమాన విషయము. అందువలన వర్తమానము లేనపుడు ఏదియు గ్రహింపఁబడదు. అట్టి ప్రత్యక్షమే కుదురనపుడు ఇతర జ్ఞానములును సంభవింపవని భావము.

మూ. కృతతా కర్తవ్యతోపపత్తే స్తూభయథా గ్రహణం.

43. సూ వర్తమాన కాలికమగు ఘటాదులకు భూతభవిష్యత్కాలిక వ్యవహార ముపపన్నమగుట వలన వర్తమానమునకు రెండు విధముల గ్రహణము గలుగును.

వర్తమానకాలమందలి ఘటవిషయములో ఘటము నల్లఁగా నుండెను ఎఱ్ఱనిది కాఁగలదు అను భూతభవిష్యత్కాలిక వ్యవహారము గ్రహింపవచ్చును. వచ్చుచున్నాను వండుచున్నాను ఇత్యాది వర్తమానరూపములలో వర్తమానకాల సమీపజన్యములగు భూతభవిష్యత్కా లోభయ మైన యర్థమును ప్రతీయ మానమగుచుండును. వండుచున్నాను అనఁగా పొయ్యిమీఁద కుండపెట్టుట మొదలుకొని వండిన పదార్థము క్రిందకు దింపుటవఱకుఁ గలుగు క్రియా బాహుళ్యము తోఁచునని భావము.

ఇది వర్తమానపరీక్షాప్రకరణము

—:(౦):—

మూ. అత్యంత ప్రాయైక దేశ సాధర్మ్యా దుపమానాసిద్ధిః.

44. సూ. అత్యంత సాధర్మ్యమునుబట్టియు, బహుళసాధర్మ్యమును బట్టియు, ఏక దేశసాధర్మ్యమునుబట్టియు ఉపమానము ప్రవర్తిల్లదు.

అత్యంతసాధర్మ్య :- గోవువలె గోవు ఉండదు. బహుళసాధర్మ్య :- గోవు మహిషమువలె నుండును. ఏకదేశ:-ఆవగింజవలె మేరు పర్వతముండును. ఇత్యాదులనుబట్టి యుపమానము ప్రవర్తిల్లదని భావము.

మూ. ప్రసిద్ధ సాధర్మ్యాదుపమానసిద్ధే ర్యథోక్త దోషానుపపత్తిః.

45. సూ. ప్రసిద్ధ సాధర్మ్యమునుబట్టి యుపమానము సిద్ధించుటవలనఁ బైనిజెప్పిన దోషము పట్టదు.

మూ. ప్రత్యక్షే ణాఽ ప్రత్యక్షసిద్ధేః.

46. సూ. ప్రత్యక్షమగు దానిచేతఁ బ్రత్యక్షముగాని వస్తువు సిద్ధించుట వలన ఉపమానమును వేఱుగా నింకొక ప్రమాణముగఁ జెప్ప నవసరము లెదు.

ప్రత్యక్షమగు పొగచేత నిప్పును గ్రహించినట్లు ప్రత్యక్షమగు గోవుచేత అప్రత్యక్షమగు గవయ మృగమును గ్రహింపవచ్చును గాన అనుమానముతోనే గతార్థమగును గాన ఉపమానప్రమాణము అనవసరమని పూర్వపక్షము.

మూ. నాఽ ప్రత్యక్షే గవయే ప్రమాణార్థ ముపమానస్య పశ్యామ ఇతి.

47. సూ. గవయ మృగము ప్రత్యక్షము గానప్పుడు ఉపమానమును ప్రమాణముగాఁ జెప్పఁవలసిన ప్రయోజనము కనిపింపదు.

నిప్పు గనిపింపనప్పుడే పొగచే నిప్పు ననుమానింతుము కాని నిప్పు గనిపించినచో అనుమానమునకే యవసరము లేదు. ఇక్కడ అట్లుగాక గవయ మృగమును జూసినప్పుడు "గోవువలె గవయమృగముండును" అనెడి యాప్త వాక్యమునుబట్టి యుపమానమున ఇదిగదా గవయమృగము అని స్మరింతుము గాని గవయమృగమే కనిపింపనిచో ఉపమానమునే ప్రమాణముగాఁ జెప్పనవసరము లేదు. వ్యాప్తిజ్ఞానము లేనందువల్లను ప్రత్యక్షము గాని గవయమృగమందు అనుమానముతోఁగూడిన నిశ్చయ జ్ఞానము గూడఁ జూదమని భావము.

మూ. తథే త్యుపసంహారాదుపమానసిద్ధే ర్నా౽ విశేషః.

48. సూ. అట్లే యని వాక్యమును ముగించుటవల్ల ఉపమానము సిద్ధించుచున్నది గాన రెండిటికి అభేదము లేదు.

గోవు ఎట్లున్నదో అట్లే గవయమృగమును అను జ్ఞానమువల్ల ఉపమానము సిద్ధించుచున్నది గాన ఉపమానమును అనుమానమును వేఱైనవే గాని రెండును ఒక్కటిగావని భావము. అట్లేయని చెప్పుటవల్ల ఉపమానము దృష్టాంతరూపమైనది. దృష్టాంతము అనుమానమునకుఁ గారణము గానఁ గారణరూపమయిన యుపమానమును గార్యరూపమయిన యనుమానమును ఒకటి గానేరవని భావము

ఇది ఉపమాన ప్రామాణ్య పరీక్షాప్రకరణము.

---

మూ. శబ్దో౽నుమాన మర్థస్యానుపలబ్ధే రను మేయత్వాత్

49. సూ. అర్థము ప్రత్యక్షముగా లభింపక శబ్దముచే అనుమానింపఁదగి యుండుటవలన శబ్దప్రమాణము అనుమానములో అంతర్భవించును.

ఇది పూర్వపక్షసూత్రము.

మూ. ఉపలబ్ధే రద్విప్రవృత్తిత్వాత్.

50. సూ. అర్థజ్ఞానము రెండువిధములుగ లేకుండుటవలన శబ్దప్రమాణము అనుమానములోనె యంతర్భవించును.

ఇదియుఁ బూర్వపక్షసూత్రము, శబ్దప్రమాణమును వేఱుగా నంగీకరించి నప్పుడు శబ్దప్రమాణమువల్ల ఒకవిధమైన యర్థజ్ఞానమును అనుమాన ప్రమాణము వల్ల మఱియొక విధమైన యర్థజ్ఞానమును గలుగక యొక్కవిధముగనె గలుగుట వలన రెండిటికి భేదము లేదని భావము.

మూ. సంబంధాచ్చ.

51. సూ. అనుమాన ప్రమాణములో సాధనసాధ్యములగు ధూమాగ్నులకు నియతసంబంధమున్నట్లే యిక్కడను శబ్దార్థములకు నియత సంబంధముండుటవలనను శబ్దప్రమాణము అనుమానములో నంతర్భవించును.

ఇదియుఁ బూర్వపక్షసూత్రమె.

మూ. ఆప్తోపదేశ సామర్థ్యా చ్ఛబ్దా దర్థే సంపత్యయః.

52 సూ. ఆప్తోపదేశమందలి యాకాంక్షా యోగ్యతాది సామర్థ్యముచేత శబ్దమువల్ల అర్థజ్ఞానము గలుగును గాన నిది యనుమానములో అంతర్భవింపదు.

వ్యాప్తి నపేక్షింపని యాకాంక్షా యోగ్యతాది జ్ఞానమువల్ల అర్థప్రత్యయము గలుగునని భావము. అనుమానములో వ్యాప్తిజ్ఞానమున్నఁ గాని అర్థప్రత్యయము గలుగదు. కాన అర్థజ్ఞానము రెండువిధములుగ లేదని చెప్పరాదు కనుక శబ్దప్రమాణమును అనుమానప్రమాణమును భిన్నములే. ఎక్కడెక్కడ పొగ యుండునో యక్కడక్కడ నిప్పు ఉండు ననుసాహచర్య నియమము వ్యాప్తి. ఒకపదమునకు ఏ పదములేనిచో అన్వయము గుదురదో యా పదము కలిగి యుండుట యాకాంక్ష. ఉదా:- గోవు గుఱ్ఱము ఏనుఁగు. ఇందు ఆకాంక్ష లేదు. అర్థమునకు బాధలేకపోవుట యోగ్యత. ఉదా:-అగ్నిచేఁదడుపుచున్నాఁడు. ఇట అగ్నిచేఁ దడపుట యను నర్థములో బాధ కలదు కాన యోగ్యతలేదు. ఆది పదముచే సన్నిధి. పదములను గాల వ్యవధానము లేకుండఁబలుకుట సన్నిధి. 'గోవు' అని చెప్పి మఱికొంత సేపటికి 'తీసికొనిరమ్ము' అని పలికినచో వ్యవధానము గలదు కాన సన్నిధి లేదు. ఇవి యర్థజ్ఞానమున కుపయోగించును.

మూ. పూరణ ప్రదాహ పాట నానుపలబ్ధేశ్చ సంబంధాభావః

53. సూ. అన్నము అని యనఁగా కడుపు నిండుట, అగ్నియని యనఁగా కాలుట, కత్తి యని యనఁగా తెగుట మొదలగునవి గలుగకపోవుట వలన ధూమాగ్నులకువలె శబ్దార్థములకు సంబంధము లేదు. కాన శబ్దప్రమాణము అనుమానములో అంతర్భవించు ననరాదు

శబ్దమున్నచోట అన్నాది వస్తువులకు అన్నాది వస్తువులున్నచోట అన్నాది శబ్దములకు నియతసంబంధము లేదు గాన శబ్దము అనుమానము ఒకటే గావు. అట్లన్నచో అన్నపదము పలుకఁగా కడుపు నిండవలయును. అన్నరాశి యున్నచోట అన్నపదము ఉండవలయును. అన్నాదిపదములు నోటియందును అన్నాదులు ఇంటియందును గలుగును. కాన నియతసంబంధము లేదు గాన నిది కుదురదని భావము.

మూ. శబ్దార్థ వ్యవస్థానా దప్రతిషేధః.

54. సూ. శబ్దార్థజ్ఞానము ఆ యా జనులు పరస్పరము గావించుకొన్న యేర్పాటునుబట్టి గలుగునది యగుటవలన ధూమాగ్నులకువలె శబ్దార్థములకు స్వాభావికమగు సంబంధమును లేదు.

నిప్పునకు పొగకు దేశకాలములనబట్టి వాటి సంబంధముగాని గుణము గాని మాఱవు. శబ్దార్థములకట్లు గాక మనుష్యులు తాము దేశకాలములనుబట్టి యేర్పఱచుకొన్న దానినిబట్టి మార్పునొందుచుండును. కాన శబ్దశాస్త్రములు వాని యర్థాదులను బోధింపవలసి వచ్చెను.

మూ. న సామయికత్వా చ్ఛబ్దార్థ సంప్రత్యయస్య,

55. సూ. శబ్దార్థముల జ్ఞానమునకు ఈ శబ్దమున కీయర్థమును జెప్పవలయునని అభిధానాభిదేయ నియముండుటవలన పై దోషము పట్టదు.

మూ. జాతి విశేషేచానియమాత్.

56. సూ. ఆ యా జాతి విశేషములందు ఈ శబ్దముల కీయర్థమేయను నియమము లేకపోవుటవలన శబ్దమునుబట్టి యర్థజ్ఞానము తత్తజ్జన సమయ సిద్ధమేగాని స్వాభావికము గాదు.

ఒక శబ్దమునే ఋషులు ఒక యర్థమందు ఆర్యులు ఇంకొక యర్థమునందు పామరులు వేఱొక యర్థమందు వాడుచున్నారు. వారివారి పరిజ్ఞానమునుబట్టి భిన్నార్థకత్వము గలుగుచున్నది. శబ్దార్థసంబంధము స్వాభావికమైనచో అందఱ కొక్క విధముగానే తోఁచును. కాన ధూమాగ్నులకువలె శబ్దార్థములకు స్వాభావికసంబంధమును జెప్పి యనుమానములో శబ్దప్రమాణము అంతర్భ వించుననుట తగదని భావము.

ఇది శబ్దసామాన్య పరీక్షాప్రకరణము.

---

మూ. తదప్రామాణ్య మనృత వ్యాఘాత పునరుక్త దోషేభ్యః.

57. సూ. అసత్యము, పరస్పరదోషము, పునరుక్తి యను దోషము లుండుటవలన అదృష్టార్థకమగు వేదవాక్యము ప్రమాణము గాదు.

" పుత్రకామః పుత్రేష్ట్యా యజేత " (పుత్రులను గోరువాఁడు పుత్రేష్టి యను యజ్ఞము చేయవలెను) అని వేదమునఁ జెప్పఁబడెను. మఱి యీ

యాగము చేయఁబడినను కొందఱకుఁ బుత్రులు గలుగుటలేదు. కాన ఈ వేద వాక్యము అసత్యమైనది. "ఉదితే హోతవ్యం అనుదితే హోతవ్యం. సమయాధ్యుషితే హోతవ్యం" సూర్యుఁ డుదయింపఁగా హోమము చేయవలయును. సూర్యుఁడు ఉదయింపక మునుపు హోమము చేయవలెను సమయము దాటినను హోమము చేయవలెను" అని యొకచోటఁ జెప్పి మఱొకచోట "శ్యావోఽస్యాహుతి మభ్యవహరతి య ఉదితేజుహోతి శబలోఽస్యాహుతి మభ్యవ హరతి యోఽనుదితే జుహోతి శావశబలా వస్యాహుతి మభ్యవహరతో యః సమ యాధ్యుషితే జుహోతి" (ఉదయించిన పిదప హోమము చేసినచో శ్యావము ఆ యాహుతిని దినును ఉదయింపకముందె హోమము చేసినచో శబలము ఆ యాహుతిని దినును సమయాతిక్రమణ మొనర్చినచో శ్యావశబలములు ఆ యాహుతిని దినును. అని మఱియొకచోట సూర్యోదయాదుల హోమము చేసినచో అది దుష్టమగును అని తిరుగఁజెప్పుటచే నివి పరస్పర విరుద్ధముగ నున్నవి. "త్రిః ప్రథమామన్వాహ త్రిరుత్తమాం" (మొదటి బుక్కునే మూఁడుసార్లు పలికెను చివరిదానినే మూఁడుసార్లు పలికెను) అని చెప్పినదే తిరుగఁజెప్పుటచేఁ బునరుక్త దోషము. ఈ దోషములనుబట్టి వేదవాక్యములు ప్రమాణములుగావని యాక్షేపణము.

మూ. న కర్మకర్తృసాధన వైగుణ్యాత్.

58. సూ. కర్మ కర్త సాధనములందున్న దోషములవల్ల ఆ ఫలములు సిద్ధించుటలేదు గాన అదృష్టార్థక వేదవాక్యములకు అసత్యదోషము లేదు.

యథా విధిగాఁ జేయఁబడినచోఁ గర్మాదులవల్ల ఫలితములు గలుగునని భావము.

మూ. అభ్యుపేత్య కాలభేదే దోషవచనాత్.

59. సూ. ఒక కాలమందు హోమము చేయ సంకల్పించి మఱియొక కాలమందుఁ జేయుటలో దోషము చెప్పఁబడినదె గాని విధించిన హోమమును నిషేధించుటకు జెప్పఁబడలేదు కానఁ బరస్పర విరోధము లేదు.

ఒక సమయమునఁ జేయఁదలఁచి యట్లు చేయక మఱియొక కాలమున హోమము చేసినచో అట్లగునని యర్థము గ్రహింపవలయు నని భావము.

మూ. అనువాదోపపత్తేశ్చ.

60. సూ. అనువాదములుగ వానిని గ్రహింప వీలుపడుటవలన అదృష్టార్థక వేదవాక్యములకుఁ బునరుక్తదోషము లేదు.

సార్థకములగు పునరుక్తములను అనువాదము లందురు. నిరర్థకములగు పునరుక్తులు దోషయుక్తములు గాన వర్జనీయములు. పదునొకండు సామిధేనులలో మొదటి సామిధేనిని మూఁడుసార్లు చివరి సామిధేనిని మూఁడుసార్లు పలికినచో అవి ఆరు అగును. మొదటిది చివరిది గాక మధ్య నున్నవి తొమ్మిది మొత్తము పదునైదు అగుచున్నవి. అవి పదునైదగుట యిక్కడ సార్థకము గాన అనువాదములగును. కాన దోషము లేదు. "ఇమ మహం భ్రాతృవ్యం పంచద శావరేణ వాగ్వజ్రేణ బాధే, యోఽస్మాన్ ద్వేష్టి యంచ వయం ద్విష్మః" ఎవరు మమ్ము ద్వేషింతురో ఎవనిని మేము ద్వేషింతుమో అట్టి యీ భ్రాతృవ్యుని నేను పదునైదుతోఁగూడిన వాగ్వజ్రముచేత బాధింతును అనుచోఁ బదునైదు చెప్పఁబడెను.

మూ. వాక్య విభాగస్య చార్థ గ్రహణాత్.

61. సూ. అనువాదముగ విభజింపఁబడిన వాక్యమునకు లోకమున శిష్టులు ప్రయోజన మంగీకరించుటవలన వేదమునఁగూడ అనువాదరూపమైన శబ్దము ప్రమాణమేయగు.

లోకమున "వెళ్లు, వెళ్లు" అని దార్ఢ్యమునకై చెప్పఁబడినచో పునరుక్త దోషము గానట్లే వేదమునఁగూడ నొక ప్రయోజనమునకై చెప్పఁబడిన పునరుక్తి దోషము గాదని భావము.

మూ. విధ్యర్థవాద వచన వినియోగాత్.

62. సూ. విధివాక్యములు అర్థవాదవాక్యములు అనువాదవాక్యములు అని వేదవాక్యములు మూఁడు విధములు.

మూ. విధి ర్విధాయకః.

63. సూ. ఒకదానిని శాసించు వాక్యము విధివాక్యము.

"అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః" స్వర్గమును గోరువాఁడు అగ్నిహోత్రమును హోమము చేయవలెను "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" స్వాధ్యాయము చదువఁదగినది ఇత్యాదులు విధివాక్యములు.

మూ. స్తుతిర్నిందా పరకృతిః పురాకల్ప ఇత్యర్థవాదః.

64. సూ. స్తుతి, నింద, పరకృతి పురాకల్పము అని యర్థవాదము నాలుగు విధములుగా నుండును.

విధ్యర్థమును గూర్చి చెప్పునది యర్థవాదమని వ్యుత్పత్తి. సాక్షాత్తు విధ్యర్థమును ప్రశంసించు వాక్యము స్తుతి. ఉదా:- సర్వజితా వై దేవాః సర్వమజయన్ సర్వస్యాప్త్యై సర్వస్యజిత్యై, సర్వమే వైతేనాప్నోతి సర్వం జయతి" దేవతలు సర్వమును జయించువారు సర్వమును పొందుటకై అన్నిటిని జయించుటకై సర్వమును జయించిరి. దానిని దెలియుటచే దీనిచే సర్వమును బొందును సర్వమును జయించును. మొ. అనిష్టబోధనము ద్వారా విధ్యర్థమునఁ బ్రవర్తించునది నింద. ఉదా:- "ఏష వావ ప్రథమోయజ్ఞో యజ్ఞానాం యజ్జ్యోతిష్టోమో య ఏతే నానిష్ట్వాఽన్యేన యజతే స గర్తే పతత్యయమేవైత జ్జీర్యతే ప్రవామీయతే" జ్యోతిష్టోమ మనెడి యీ యజ్ఞము యజ్ఞములలో మొదటిది. ఈ యజ్ఞముచే యజ్ఞము చేయక మఱియొక యజ్ఞము నెవఁడు చేయునో వాఁడు గర్తమునఁ బడును. ఇతఁడే జీర్ణుడగును ప్రమీయుఁడగును. మొ. పురుష విశేషుని యందలి పరస్పర విరోధము పరకృతి. "హుత్వా వపా మేవాగ్రేఽభిఘారయంత్యథ పృషదాజ్యంతదుహ చరకాధ్వర్యవః పృషదాజ్య మేవాగ్రేఽభిఘారయంత్యగ్నేః ప్రాణాః పృషదాజ్యమి త్యభిదధతి" ముందు వపనే హోమము చేసి పిదప పృషదాజ్యమను అభిఘారము చేయుదురని చెప్పి మరల చరకాధ్వర్యులు పృషదాజ్యము అగ్నికి ప్రాణములు గాన ముందు పృషదాజ్యము నభిఘారము చేయుదని పలుకుదురు. మొ. ఇతిహాసము సమాచరింపఁబడిన రీతిగా కీర్తించునది పురాకల్పము. "తస్మాద్వా ఏతేన పురాబ్రహ్మణా బహిష్పవమాన సామ స్తోమ మస్తౌషన్ యజ్ఞం ప్రతనవామహే" కనుక పూర్వము ఈ వేదమంత్రముచే బహిష్పవమానసామ స్తోమమును స్తోత్రము చేసిరి యజ్ఞమును విస్తరింపఁజేయుదుము గాక. మొ.

మూ. విధి విహితస్యానువచనమనువాదః.

65. సూ. విధిని విహితమును అనుసరించి చెప్పుట యనువాదము.

విధ్యనువాదము శబ్దవిషయకము. విహితానువాదము అర్థవిషయకము.

మూ. నానువాద పునరుక్తయో ర్విశేషః శబ్దాభ్యాసోప పత్తేః.

66. సూ. ఉక్తార్థముగల శబ్దము మరల ప్రయోగింపఁబడుచుండుట వలన అనువాద పునరుక్తములలో విశేషము లేదు.

ఇది పూర్వపక్షసూత్రము.

మూ. శీఘ్రత గమనోపదేశవ దభ్యాసాన్నాఽవిశేషః.

67. సూ. మిగుల త్వరగా వెళ్లుటకు "వెళ్లు వెళ్లు" మని మరల మరల చెప్పినట్లు విశేషార్థమును జెప్పుటకు మరలఁ జెప్పుటవలనఁ బునరుక్తికి అనువాదమునకు విశేషము లేదని చెప్పరాదు.

సార్థమగునపుడు అర్థవాదము, నిరర్థకమగునపుడు పునరుక్తదోషమని భావము.

మూ. మంత్రా యుర్వేద ప్రామాణ్యవచ్చ తత్ప్రామాణ్య మాప్తప్రామాణ్యాత్.

68. సూ. ఆప్తులచేఁ జెప్పఁబడిన మంత్రములు ఆయుర్వేదమును ప్రమాణములైనట్లే యాప్తుఁడగు వేదకర్త యందలి ప్రామాణ్యమునుబట్టి వేద వాక్యములును బ్రమాణములె యగును.

ఇది శబ్దవిశేష పరీక్షాప్రకరణము
ఇది శ్రీ గౌతమమహర్షి చే రచింపఁబడి
చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపబడిన న్యాయమీమాంసా దర్శనమునందు
మొదటి యధ్యాయము.

—:(o):—

# న్యాయ మీమాంసాదర్శనము

## ద్వితీయాధ్యాయము

### రెండవ యాహ్నికము

మూ. న చతుష్ట్వ మైతిహ్యార్థాపత్తి సంభవా భావ ప్రామాణ్యాత్.

1. సూ. ఐతిహ్యము, అర్థాపత్తి, సంభవము, అభావము అనునవియుఁ ప్రమాణములగుటవలనఁ ప్రమాణములు నాలుగే గావు.

"ఇతి హ ఊచుః" ఇట్లని యందురు అని వక్తను స్పష్టముగాఁ జెప్పక పరంపరగాఁ జెప్పుకొనఁబడు ప్రవాదము ఐతిహ్యము. ఉదా:- ఈ వటవృక్షమందు దయ్యమున్నది. మొ. చెప్పఁబడిన యర్థమునుబట్టి యింకొక యర్థము వచ్చుట యర్థాపత్తి ఉదా:- మేఘములు లేనిచో వర్షము కురియదు అని చెప్పఁగా దానినిబట్టి మేఘము లున్నచో వర్షము గురియునను మఱియొక యర్థము వచ్చినది. దేవదత్తుఁడు పగలు తినఁడు కాని బలముగా నున్నాఁడు. అనఁగా రాత్రి తినును అని మఱియొక యర్థము వచ్చినది. మొ. అవినాభావ మైన యర్థమును గ్రహింపఁగా దానితోపాటు ఇంకొక యర్థము అవినాభావముగ(తప్పని సరిగ) సంభవించుట సంభవము. ఉదా:- గ్రామములో వేయిమంది యున్నారనఁగా నూఱుమంది గూడ ఉన్నారని చెప్పకుండనే యర్థము వచ్చుచున్నది. లేదనెడి జ్ఞానముచేత నింకొకదాని యస్తిత్వమును గల్పించుట యభావము. ముంగిస లేదు అనుజ్ఞానముచేత ముంగిసకు విరోధియగు సర్పమున్నదని యర్థము గల్పించుట. వీనినిబట్టి ఐతిహ్యాదులగు ప్రమాణములు ఇంకను ఉండఁగా ప్రత్యక్షము అనుమానము, ఉపమానము శాబ్దము అని ప్రమాణములు నాలుగే యనరాదని ఆక్షేపణము.

మూ. శబ్ద ఐతిహ్యా నర్థాంతరభావా దను మానేఽర్థా పత్తి సంభవ భావా నర్థాంతర భావాఽచ్చాప్రతిషేధః.

2. సూ. శబ్దప్రమాణమందు ఐతిహ్యమును, అనుమాన ప్రమాణమందు అర్థాపత్తి సంభవము అభావములును అంతర్భవించుటవలన "ప్రమాణములు నాలుగే గావు అని నిషేధింపరాదు.

ఆప్తునిచేఁ జెప్పఁబడినపుడే ఇతిహ్యము నమ్మఁదగిన దగును. కాన అది శబ్దప్రమాణమున అంతర్భవించును. దృష్టములగు కారణములచే అదృష్టములగు వానిని వ్యాప్తిజ్ఞానముచే నూహించుటయే యనుమానప్రమాణము గాన అర్థాపత్త్యాదులు అనుమానప్రమాణములో అంతర్భవించునని భావము.

మూ. అర్థాపత్తి రప్రమాణ మనైకంతి కత్వాత్.

3. సూ. అనైకాంతికమగుట వలన అర్థాపత్తి ప్రమాణము గాదు.

సాధ్యమునందే నియతము గాక మిగిలినచోటఁ గూడ నుండునది అనైకాంతికము. మేఘములేనిచో వర్షము గురియదు అనఁగా మేఘములుండఁగా వర్షము గురియును అని యర్థము వచ్చుచున్నది అని యర్థాపత్తి కుదాహరణము చెప్పఁబడినది. ఒకప్పుడు మేఘములున్నను వర్షము గురియుటలేదు గాన ఇది అప్రమాణమని పూర్వపక్షము చేయఁబడుచున్నది.

మూ. అనర్థాపత్తా వర్థాపత్త్యభిమానాత్.

4. సూ. అర్థాపత్తిగాని దానియందు అర్థాపత్తి యని భ్రమపడుటవలన అట్లు దోఁచుచున్నదేగాని నిజమునకు అర్థాపత్తికి అనైకాంతికత్వదోషము లేదు.

మేఘములు లేనపుడు వర్షము కురియదు అనుదానిచే మేఘము లున్నచో వర్షము గురియునని యర్థాపత్తి గలుగుచున్నది. కాని యెచ్చట వర్షమునుబట్టి మేఘములున్నవను జ్ఞానము సమ్మతము ఎచ్చట మేఘముచే వృష్టిగలుగును. అని జ్ఞాన మూహింపఁబడునో అచ్చట అర్థాపత్తిగానిదానియందు అర్థాపత్తి భ్రమ కలుగుచున్నది. ఇట వ్యాప్తి సరిగాలేకపోవుటవలన అట్లు గలుగుచున్నది. ఇట మేఘము కారణము వర్షము కార్యము. కారణములేనిచోఁ గార్యము గలుగదు అనఁగాఁ గారణమున్నపుడు గార్యము పుట్టునని యర్థము వచ్చుచున్నది. మఱి యాకారణములకు వాయువు మొదలగు ప్రతిబంధకములున్నచో ఆ వర్షకార్యము గలుగదు. కాన అది కారణదోషముగాని యర్థాపత్తిదోషము గాదు. "ఎక్కడఁ బ్రతిబంధకములేని మేఘముండునో యక్కడ వర్షము గురియునని మాత్రమే

వ్యాప్తిని గ్రహింపవలయును. కాని మేఘమున్నచో నెల్లవర్షము గురియుననుటలో సరియైన యర్థాపత్తి లేదు. అది భ్రమ మాత్రమే. ఇట్లయినచో వ్యాప్తిభ్రమ యున్నచో అనుమానమె సిద్ధింపదు. కాన అదియు అప్రమాణమె కావలసి వచ్చును. దుష్టకారణమును గ్రహించి యా దోషమును అర్థాపత్తియందు ఆరోపించి దానికి అప్రమాణత చెప్పరాదని భావము.

మూ. ప్రతిషేధాఽప్రామాణ్యం చానైకాంతికత్వాత్.

5. సూ. "అనైకాంతికమగుటవలన అర్థాపత్తిప్రమాణము గాదు" అను నిషేధము గూడ అనైకాంతికమగుటవలన ప్రమాణము గాదు.

"అనైకాంతికమగుట వలన అర్థాపత్తిప్రమాణము గాదు" అను నిషేధముచేత అర్థాపత్తికిఁ బ్రామాణ్యమె నిషేధింపఁబడుచున్నది గాని అసలు అర్థాపత్తి యననది లేనేలేదని నిషేధింపఁబడుటలేదు. అందుచే అర్థాపత్తిని అంతను నిషేధింపక తదేక దేశమును మాత్రమె నిషేధించుటవలన ఈ నిషేధములో అనైకాంతిక దోషము పట్టినది గాన ఈ నిషేధము ప్రమాణము గాదని భావము.

మూ. తత్రాప్రామాణ్యే వా నార్థాపత్త్య ప్రామాణ్యం.

6. సూ. అనైకాంతిక దోషమున్నప్పటికిని స్వవిషయమున సాధక మగుటవలన ఆ హేతువు ప్రమాణమని యన్నచో అర్థాపత్తియును స్వవిషయ మునఁ బ్రమాణమే యగును.

అర్థాపత్తికి విషయము కార్యమున్నపుడు కారణముండి తీరుననియెగాని ప్రతిబంధకమున్నపుడు గూడఁ గార్యము పుట్టుననిగాదు. కాన అనుమానములో అర్థాపత్తి యంతర్భవించునని భావము.

మూ. నాభావప్రామాణ్యం ప్రమేయాసిద్ధేః.

7. సూ. అభావమువల్లఁ బ్రమేయమేదియు సిద్ధింపదు గాన అభావ మనునది ప్రమాణము గాదు.

ఏదియు లేకపోవుటయె యభావము. ఏదైన నున్నచో దానివల్ల ఏదైన సిద్ధించును గాని లేనిదానివల్ల నేదియు సిద్ధింపదు గాన అది ప్రమాణము గాదని యాక్షేపణ.

మూ. లక్షితేష్వ లక్షణ లక్షితత్వాదలక్షితానాం తత్ప్రమేయ సిద్ధేః.

8. సూ. లక్షణము చెప్పఁబడిన ఘటాది విషయములందు ఘటాది లక్షణములు పట్టని వస్త్రాదివిషయములు ఘటాది లక్షణములచే లక్షింప బడక పోవుటవలన ఆ వస్త్రాదులు ప్రమేయములగును గాన అభావము ప్రమాణము గాదని చెప్పరాదు.

ఇది సిద్ధాంతసూత్రము. ఘటమునకు లక్షణము చెప్పఁబడినపుడు ఘటలక్షణము పట్టని వస్త్రాదులు ఘటలక్షణముతో లక్షింపఁబడకపోవుటవలన అభావమునకుఁ బ్రమేయములగును గాన అది ప్రమాణముగా నంగీకరింపఁబడె నని భావము. అనీల పటమును దీసికొనిరమ్ము అన్నపుడు నీల భిన్నపటము అభావమునకుఁ బ్రమేయమగునని తెలియునది.

మూ. అసత్యర్థే నాభావఇతిచే న్నాన్యలక్షణోపపత్తేః.

9. సూ. లక్షణము పట్టనివానియందు అభావలక్షణము ఉపపన్నమగుట వలన ఉండిలేకున్నపుడే గాని యసలే వస్తువు లేనపుడు అభావము గుదురదన రాదు.

లక్షణము పట్టనపుడు లక్షణము చెప్పఁబడని వస్తువులను అభావప్రమాణముచేఁ దెలియనగునని భావము. ఘటమునకు లక్షణము చెప్పఁగా ఘటలక్షణము పట్టని వస్త్రాదులను అభావమునకు ఉదాహరణముగా గ్రహింపనగు నని భావము.

మూ. తత్సిద్ధేరలక్షితేష్వహేతుః.

10. సూ. లక్షణము చెప్పఁబడిన వస్తువులకు ఇతర వ్యావర్తకత్వము సిద్ధించుచున్నది కాని లక్షణము చెప్పఁబడని వస్తువులందు అభావమునకు వ్యావర్తకత్వము లేకపోవుటవలన అది వ్యావర్తకమునకు హేతువు గాదు.

ఇది పూర్వపక్షసూత్రము. అభావమునకు లక్షణము చెప్పుట కుదరదు కనుక స్వరూపము లేనిదాని కితర వ్యావర్తకత్వము లేదని భావము నూలు నేయఁబడినది వస్త్రము అనుదానిలో నూలుతో నేయఁబడిన అనులక్షణము నూలుతో నేయఁబడని ఘటాదులకు వ్యావర్తకమగును. కాని నూలుతో నేయఁ

బడని అన్నపుడు అభావములో లక్షణము లేకపోవుటవలన అభావము వ్యావర్త కము కాకపోవుటవలన అది వ్యావర్తక హేతువుగాదని భావము.

మూ. న లక్షణావస్థితాపేక్షాసిద్ధేః.

11. సూ. ప్రతియోగివస్తు లక్షణముయొక్క యునికినిబట్టి యభావము సిద్ధించుటవలన అభావము హేతువుగాదని చెప్పరాదు.

చెప్పఁబడిన లక్షణములు లేవని చెప్పుటలేదు. కాని కొన్నిటికి లక్షణములు గలవు. కొన్నిటికి లేవు. వేనికి లక్షణము లేవో అవి యభావము గ్రహింపఁ బడును. వస్త్రమునకు లక్షణము చెప్పఁగా వస్త్రమునకు ప్రతియోగియయిన ఘటాదులకు లక్షణము ఉండునుగదా వానినిబట్టి యభావము సిద్ధించునని భావము.

మూ. ప్రాగుత్పత్తే రభావోపపత్తేశ్చ

12 సూ. వస్తువు ఉత్పన్నమగుటకుఁ బూర్వము ఆ వస్తువుయొక్క అభావముండుట యుపపన్నమగుటవల్లను అభావమునకు ప్రమేయము సిద్ధించు చున్నది.

కుండ తయారు కాఁబోవుచున్నది అనుచోట తయారగుటకు ముందు ఆ కుండయొక్క లేకపోవుట (అభావము) అందఱకు ప్రత్యక్షమగుట యందఱ యనుభవములో నున్నది. కాన అభావవిషయము సిద్ధించుచున్నదని భావము. దీనిని ప్రాగభావమందురు. అభావము ప్రాగభావము ప్రధ్వంసాభావము అత్యంతాభావము అన్యోన్యాభావమని నాలుగు విధములు. ఆది లేక అంతము గలది ప్రాగభావము. కార్యముత్పన్నమగుటకుఁ బూర్వ మున్న యభావము ప్రాగభావము. ఆది గలిగి అంతము లేనిది ప్రధ్వంసాభావము, కార్యముత్పన్నమైన పిదపఁగల యభావము. మూఁడు కాలములందు సంసర్గము లేనిది యత్యంతాభావము ఉదా:- భూతలము ఘటము లేదు. పరస్పర తాదాత్మ్య సంబంధము లేనిది అన్యోన్యాభావము. ఉదా:- ఘటము పటము గాదు. ప్రాగభావము ప్రధ్వంసాదుల కులపలక్షణము. ఇట్లు సిద్ధించిన యభావము అనుమానములో అంతర్భవించును. కాన ప్రమాణములు నాలుగే యని భావము.

ఇది ప్రమాణ చతుష్ట్వప్రకరణము

అవతారిక:- ఆకాశమునకు గుణమైన శబ్దము వ్యాపకమైనది నిత్యము అభివ్యక్తియే ధర్మము గాఁగలది అని మీమాంసకులు. గంధాది సహవృత్తియై ద్రవ్యములందుండి యభివ్యక్తియె ధర్మము గాఁగలది గంధాదులవలె నున్నది అని సాంఖ్యులు. ఆకాశగుణమైన శబ్దము ఉత్పత్తి నాశనధర్మము గలది బుద్ధి వలె అని వైశేషికులు. మహాభూతమును సంక్షోభమువలనఁ బుట్టిన శబ్దము అనాశ్రితమైనది ఉత్పత్తి వినాశధర్మము గలది అని బౌద్ధులు. అని శబ్దమును గూర్చి యనేక భావములుండుటచే విమర్శింపఁబడుచున్నది.

మూ. ఆదిమత్త్వా దైంద్రియకత్వాత్ కృతకవదుపచారాచ్చ.

13. సూ. సంయోగ విభాగాది కారణములవలనఁ బుట్టినదగుటవలనను ఇంద్రియములకుఁ బ్రత్యక్షమగుటవలనను, కార్యములైన ఘటాదులవలె తీవ్రము మధ్యము మందము నని వ్యవహరింపఁబడుటవలనను శబ్దము అనిత్యమైనది.

మూ. నఘటాఽభావసామాన్య నిత్యత్వా న్నిత్యే ష్వనిత్య వదుపచారాచ్చ.

14. సూ. ఘటాభావము సకారణమైనదైనను నిత్యముగా నుండుటచే "కారణములవలనఁ బుట్టినదగుటవలనను" అనునదియు, ఇంద్రియ ప్రత్యక్షమైన ఘటత్వాది సామాన్యము నిత్యమగుటచే "ఇంద్రియములకుఁ బ్రత్యక్షమగుటవలనను" అనునదియు, ఘటాకాశము పుట్టినది. ఆత్మసుఖము గలది మొదలగు నిత్యవస్తువులందు అనిత్యవ్యవహారము గనిపించుటవల్ల 'కార్యములైన ఘటాదులవలె వ్యవహరింపఁబడుటవలన' అనునదియు సరియైన హేతువులు గావు కాన శబ్దము అనిత్యమని యనరాదు.

ఘటాభావమునకు మరల అభావములేదు గాన నిత్యము. పైసూత్రములో శబ్దము అనిత్యము అని సాధించు హేతువులు శబ్దనిత్యత్వమును సాధించునవిగా నుండుటవలన వానినిబట్టి శబ్దానిత్యత్వమును సాధించుట తగదని పూర్వపక్ష యాక్షేపణ.

మూ. తత్త్వభాక్తయోర్నానాత్వ విభాగా దవ్యభిచారః.

15. సూ. పారమార్థిక నిత్యత్వమునకును ఔపచారిక నిత్యత్వమునకును భేదముండుటవలన ఘటాభావము పారమార్థిక నిత్యముగాక యౌపచారిక నిత్య

మగుటవల్ల నిందు చెప్పఁబడిన నిత్యపదమునకుఁ బారమార్థిక నిత్యత్వమె వివక్షితము గాన అభావము నిత్యము గాకపోవుటచేత కారణములవలనఁ బుట్టిన దగుటవలన" అను కారణము వ్యభిచరింపదు.

ఇది మొదటి దోషమునకు ఖండనము. ఘటాభావమునకు అభావము లేకున్నను ఉత్పత్తి గలదు గాన అది యనిత్యమే యని భావము. పారమార్థిక నిత్యము=మూఁడు కాలములందును బాధింపఁబడనిది. ఔపచారిక నిత్యత్వము= ఆరోపిత నిత్యత్వము.

మూ. సంతానానుమాన విశేషణాత్.

16. సూ. "ఇంద్రియములకుఁ బ్రత్యక్షమగుటవలనను" అను హేతువుకో 'సామాన్యము గలిగి యుండి యింద్రియములకుఁ బ్రత్యక్షమగుట వలనను' అని విశేషణయుక్తముగాఁ జెప్పుటచే దోషము లేదు.

ఘటత్వమనెడి సామాన్యములో ఘటత్వత్వమనెడి యింకొక సామాన్యము లేదు. శబ్దములో అట్లుగాక శబ్దత్వమనెడి సామాన్యము గలదు. అది యింద్రియ గ్రాహ్యము గాన అనిత్యమే యని భావము. ఇది రెండవ దోషమునకు ఖండనము.

మూ. కారణద్రవ్యస్య ప్రదేశశబ్దే నాభిధానాత్ నిత్యేష్వప్య వ్యభిచారః.

17. సూ. కారణమైన ద్రవ్యము ప్రదేశ శబ్దముతోఁ గలిపి చెప్పఁబడినదే గాని కేవలాకాశము చెప్పఁబడలెదు కాన "నిత్యములం దనిత్యవ్యవహారము గనిపించుచున్నది" అను వ్యభిచారదోషము నిత్యమైన ఆకాశమునందుఁ బట్టదు

ఇందు ఆకాశము అనిత్యమని చెప్పఁబడుట లేదు. ఘటప్రదేశమందలి యాకాశము అనిత్యమైనదని చెప్పఁబడుచున్నది. కాన కారణద్రవ్యమగు ఘటమును గూర్చి చెప్పఁబడుచున్నదే గాని యాకాశమును గూర్చినది చెప్పఁబడుట లేదు గాన దోషము లేదని భావము.

మూ. ప్రాగుచ్చారణా దనుపలబ్ధేరావరణాద్యనుపలబ్ధేశ్చ.

18. సూ. ఉచ్చారణమునకుఁ బూర్వము ఉపలబ్ధము గాకపోవుటవల్లను, పోనీ ప్రకటమగుటకుఁ బ్రతిబంధకములైన యావరణాదు లున్నవేమో యన్న నవి యుపలబ్ధము గాకపోవుటవల్లను శబ్దము నిత్యము గాదు.

మూ. తదనుపలబ్ధే రనుపలంభా దావరణోపపత్తిః.

19. సూ. ఆ వరణాదులు లేవను సంగతియుఁ గనిపింపకపోవుటవలన ఆ వరణాదులుండుట యుపపన్నమగుచున్నది.

ఒక వస్తువు లేదను సంగతి నిర్ధారణగాఁ దెలియకపోయినచో ఆ వస్తు వున్నట్లు అగునని భావము.

మూ. అనుపలంభా దప్యనుపలబ్ధి సద్భావా న్నావరణానుపపత్తి రనుపలంభాత్.

20. సూ. ఆవరణాదులు లేవను సంగతి స్పష్టముగఁ గనిపింపక పోయినను ఎట్లు ఆవరణాదులు లేవని యంగీకరించితిమో యట్లే ఆవరణాదు లున్నట్లు స్పష్టముగఁ గనిపింపకపోయినను ఆవరణాదులు లేవని యనరాదు.

ఆవరణముండుట వలన గ్రహింపఁబడుట లేదుగాని శబ్దములేక కాదని భావము.

మూ. అనుపలంభాత్మకత్వా దనుపలబ్ధే రహేతుః.

21. సూ. అనుపలంభాత్మకమగుటవలన అనుపలబ్ధి సరియైన హేతువు గాదు.

ఉపలభ్యమానమగునది యుండును. ఉపలభ్యము గానిది యుండదు. అందుచే ఉపలభ్యమగు స్వభావములేనిది అసలులేనిదే యగును. ఆవరణ మున్నచో అది యుపలభ్యమగుట లేదు గానఁ గనిపించుటలేదు. అందుచే ఆవరణానుపలబ్ధి హేతువు గాదు. అందుచే పైని జెప్పినది యుక్తము గాదని భావము.

మూ. అస్పర్శత్వాత్.

22. సూ. స్పర్శ లేనిదగుటవలన ఆకాశము వలె శబ్దము నిత్యము. ఇది శబ్దము నిత్యమని వాదించువాని పూర్వ పక్షము.

మూ. న కర్మానిత్యత్వాత్.

23. సూ. స్పర్శ లేని కర్మ నిత్యము గాకపోవుట వలన 'స్పర్శ ౧ కర్మ నిత్యము గాకపోవుట వలన' అను కారణము నిత్యత్వమును ంచునది గాదు.

సాధ్యమందు నియతము గాకపోవుటచే హేతువు అనైకాంతిక మగునని భావము.

మూ. నాణునిత్యత్వాత్.

24. సూ. అనైకాంతికమగు హేతువును గూడ సాధ్య సాధకమగు నన్నచో రూపవత్త్వాదులు గల పరమాణువులును గాకపోవలసి వచ్చును. కాని పరమాణువులు సత్యము లగుటచే ఈ హేతువు సాధ్య సాధకముగాదు.

రూపవత్త్వాదులను బట్టి పరమాణులు అనిత్యములని యనుమానము ఆపాదింపవలసి వచ్చును. అనైకాంతికము సాధ్యసాధకము గాదు గాన అనైకాంతికమగు స్పర్శ రాహిత్యము గూడ శబ్దనిత్యత్వ సాధకము గాదని భావము.

మూ. సంప్రదానాత్.

25. సూ. గురువు శిష్యునికి విద్య నుపదేశము ద్వారా ఇచ్చుట వలన విద్యా స్వరూపమగు శబ్దము నిత్యము.

అది వఱకు లేనిచో గురువు ఉపదేశించుట గుదరదు గాన శబ్దము నిత్యము అని శంక. " తావత్కాలంస్థిరం చైనంక పశ్చాన్నాశయిష్యతి " అంతటి కాలమువఱకు స్థిరముగా నున్న దాని నెవఁడు నశింపఁ జేయఁగలఁడు అను న్యాయమును బట్టి శబ్దము నిత్యమని యాక్షేపము.

మూ. తదంతరా లానుపలబ్ధే రహేతుః.

26. సూ. శబ్దము నిత్యమే యగుచో శిష్యుని రాకకుఁ దరువాతను గురువు చెప్పుటకు ముందు నుధ్యగా శబ్దము ఉపలభ్యము గావలసివచ్చును అట్లు గాకపోవుట వల్ల గురూపదేశము శబ్ద నిత్యత్వ సాధక హేతువు గాదు.

ఇది సిద్ధాంతసూత్రము.

మూ. అధ్యాపనా దప్రతిషేధః.

27. సూ. శబ్దము అనిత్యమైనచో గురు శిష్యుల మధ్య అదివఱకు లేని శబ్దమును ఇచ్చుట కుదురదు గాన పై నిషేధము యుక్తము గాదు.

ఇది పూర్వపక్ష సూత్రము.

మూ. ఉభయోః పక్షయోరన్యతరస్యాధ్యాపనాదప్రతిషేధః

28. సూ. 'శబ్దము నిత్యము' 'శబ్దము అనిత్యము' అను పక్షములు రెండింటిలోను ఏ పక్షమందైనను అధ్యాపనము చేయుట సమానము గాన అధ్యాపనము శబ్ద నిత్యత్వ సాధకము గాదు.

ఇది సిద్ధాంత సూత్రము. 'శబ్దము నిత్యము' అనువాది అదివఱకున్న శబ్దమునే గురువు శిష్యుని కిచ్చుచున్నాఁడు గాన శబ్దము నిత్యమనెను. శబ్దము అనిత్యమను ప్రతివాది గురుశిష్యుల మధ్య అదివఱకు శబ్దము లేదు. కాన అనిత్యమనెను. ఈ యిరువురి మతములో అధ్యాపనము గలదు. ఆ యధ్యాపన మనఁగా నేమి. గురువుదగ్గర నుంచి శబ్దము ఒక వస్తువలె శిష్యుని దగ్గఱకుఁ బోవుటయా లేక నాట్యోపదేశము వలె గ్రహింబడిన దానిని అనుకరించుటయా అధ్యాపన మనఁగా గురువు పలికిన దాని ననుసరించి పలుకుటయే గాని గురువు యొక్క యధ్యాపనమందున్న శబ్దమును ఒక వస్తువ వలె శిష్యుని యదీనమగుట కాదు. శబ్దమును అనేకుల కిచ్చుటయుఁ గుదురదు. కనుక దాన రూపము గాని యధ్యాపనము శబ్ద నిత్యత్వమును సాధింపదని భావము.

మూ. అభ్యాసాత్.

29. సూ. మాటిమాటికి అభ్యసింపఁబడుటవలన శబ్దము నిత్యము.

ఇందు మఱియొక హేతువుచే శబ్దము నిత్యము అని శంకింపఁబడుచున్నది. స్థిరమైనవస్తువు మాటిమాటికి అభ్యసింపఁబడును. ఎట్లు పదిసార్లు రూపమును జూచుచున్నాఁడో అట్లే పదిసార్లు అనువాదమును జదువుచున్నాఁడు అని యభ్యాసమును బట్టి శబ్దము నిత్యమని భావము.

మూ. నాన్యత్వేఽప్యభ్యాసస్యోపచారాత్.

30. సూ. నిత్యముల కంటే నితరములను గూడ అభ్యసించుట సంభవించుచున్నది గాన శబ్దము నిత్యమనరాదు. రెండుసార్లు పఠింపుము, రెండుసార్లు హోమము చేయుము, రెండుసార్లు భుజించుచున్నాఁడు మొదలగు నిత్యముల కంటె నితరమైనవి గూడ అభ్యసింపఁబడుచున్నవి. గాన శబ్ద నిత్యము గాదని భావము.

మూ. అన్యదన్యస్మాదనన్యత్వాదనన్యదిత్యన్యతాఽభావః

31. సూ. ఇతరమైన దానికంటె నితరమైన దనఁగాఁ దకకంటె అభిన్నమైనదే యగును అపుడు అది యితరమె గాదు అందుచే నితరమైనదే యుండదు. ఏ వస్తువు ఇతరమైన దానికంటె నితరమైనది అని చెప్పఁబడునో అది తనకంటే అభిన్నమే యగును. కాన పై సూత్రమునఁ జెప్పఁబడిన ఇతరములన్నవి సిద్ధింపవు దానినిఁబట్టి నిత్యత్వ ఖండన చేయరాదని భావము.

మూ. తదభావే నా స్త్యనన్యతా తయోరితరేతరాపేక్షసిద్ధేః.

32. సూ. అన్యము అనన్యము అనునవి యొకదాని నపేక్షించి యొకటి సిద్ధించుటవలన "అన్యమైనదె లేపన్నచో అనన్యమైనదియు నుండదు.

సిద్ధాంతసూత్రము. అన్యము అనన్యము అనునవి సాపేక్షికము అని భావము.

మూ. వినాశకారణానుపలబ్ధేః.

33. సూ. శబ్దమును నశింపఁజేయు కారణము లభింపనందువల్ల శబ్దము నిత్యమైనది.

ఘటాదులను నశింపఁజేయు దండాదులు లభించుచున్నవి. అట్లు శబ్దమును నశింపజేయుకారణము లభింపకపోవుటచే శబ్దము నిత్యమని మరల శంకింపఁబడుచున్నది.

మూ. అశ్రవణ కారణానుపలబ్ధేః సతత శ్రవణ ప్రసంగః.

34. సూ. శబ్దము నిత్యమన్నచో శబ్దమును వినిపింపకుండఁజేయు కారణములు ప్రత్యక్షముగా లభింపకపోవుటవలన నెల్లపుడును శబ్దము వినఁబడుచునే యుండవలసి వచ్చును.

మూ. ఉపలభ్యమానే చానుపలబ్ధే రసత్త్వా దనపదేశః.

35. సూ. పూర్వ పూర్వశబ్దమునకు ఉత్తరోత్తర శబ్దము వినాశకారణముగ అనుమానాదులచే ఉపలబ్ధమగుచుండఁగనుపలబ్ధము కాకపోవుటయుండదు కాన శబ్దనిత్యత్వ హేతువు సాధకమైనది గాదు.

సంయోగ విభాగముల నుండిపుట్టిన శబ్దము నుండి శబ్దము పుట్టుచున్నది. తరువాత శబ్దము పుట్టఁగా మొదటి శబ్దము నశించుచున్నది. ఇట్లు మొదటిది నశించుట తర్వాతది పుట్టుట జరుగుచున్నది గాన శబ్దమును నశింపఁజేయు హేతువు గలదని భావము.

మూ. పాణినిమిత్త ప్రశ్లేషా చ్ఛబ్దాభావే నానుపలబ్ధిః.

36. సూ గంట మొదలగునవి వాయింపఁబడిన పిదప ఆ గంటమీఁదఁ జేయి యుంచుటవలన శబ్ద ప్రవాహము ముగియగా దీనినిబట్టి అడ్డు గలిగించు ద్రవ్యముచే శబ్దమును గలిగించు కారణమయిన సంస్కారము ఆపఁబడుచున్నదని యనుమానింపఁబడుచున్నది కాన శబ్దవినాశకారణము ఉపలబ్దమగుట లేదనరాదు.

మూ. వినాశకారణానుపలబ్ధే శ్చావస్థానే తన్నిత్యత్వప్రసంగః.

37. సూ. వినాశమునకుఁ గారణము లభింపకపోవుటవలనను ఆ వస్తువుండును ఆ వస్తువున్నప్పుడు అది నిత్యము గా వలసివచ్చును.

ఈ సూత్రమునకు వృత్తికారుఁడు వ్యాఖ్య చేయలేదు గాన ఇది సూత్రము గాదని యందురు. భాష్యకర్త మాత్రము వ్యాఖ్యానించెను. ఈ శబ్దము యొక్క విన్నఁబడుట లన్నియు శబ్ద ప్రకటనలె గాన వానికి వినాశము ఉపపాదింపఁ బడుట లేదు. కాన అవి నిత్యము. రూపాది గుణముల వలె శబ్దమును వస్తువు లందే యుండును అది సంయోగాదులను బట్టి యభివ్యక్త మగునే గాని పుట్టదు. అని సాంఖ్యులమతము. దీనిని బట్టి గంటను వాయించినపుడు శబ్దత అభివ్యక్త మగుచున్నది కాని పుట్టుట లేదు. గంటను వాయించిన పిదప దానిపైఁ జేయి యుంచఁగా ఘంటానాద ప్రవాహము అభివ్యక్తమగుట మానినది. కాన శబ్దము నిత్యమని శంక.

అవతారిక :- రూపాదుల వలె శబ్దమును ఘంటాది వస్తువు లందే యుండును. కాన శబ్దము ఆకాశ గుణము గాదు. ఘంటాదులందు శబ్దము వ్యక్త మగును. అను సాంఖ్యమతము ఈ క్రింది సూత్రముచే ఖండింపఁబడుచున్నది.

మూ. అస్పర్శత్వా దప్రతిషేధః.

38. సూ. ఘంటాది వస్తువులకు శ్రోత్రేంద్రియముతో స్పర్శ లేకపోవుట వలన శబ్దము ఆకాశమందున్నదె కాన "శబ్దము ఆకాశగుణము గాదు" అని నిషేధపరాదు. ఇంద్రియము వస్తువులతో స్పర్శగలిగినపుడు యా యా జ్ఞానములు గలుగును. శ్రోత్రేంద్రియము మాత్ర మట్లు గాదు. గోడ మొదలగువానితో వ్యవధానమున్నను శబ్దమును గ్రహించును. దీనిబట్టి శబ్దము ప్రవాహ రూపముగా వచ్చునని తెలియుచున్నది. శబ్దము నుండి శబ్దము ఆ శబ్దము నుండి మరల

శబ్దము ఎడతెగక ధారగా వచ్చుటకు ఆకాశమె గారణమగుచున్నది కాన శబ్దము స్పర్శ లేక వ్యాపించు ద్రవ్యము నాశ్రయించి యుండును. గాన శబ్దము ఆకాశ గుణమె గాని వస్తువు నాశ్రయించునది గాదని భావము. అందుచే శబ్దము పుట్టునదియె గాని వస్తువు లందు అభివ్యక్తమగునది గాదు. కాన శబ్దము నిత్యమనుట తగదని భావము.

మూ. విభక్త్యంతరోపపత్తేశ్చ సమాసే.

39. సూ. రూపాదుల సముదాయము గల వస్తువు నందు శబ్దము బహుశ్రుతులు గలది గను ఏకశ్రుతిలో గూడ తారమందాది ధ్వనులు గలది గను ఉండుట యుపపన్న మగుటవలనను అది యాకాశ గుణమై పుట్టుచున్నదే గాని ప్రతి ద్రవ్యమందును రూపాదులతోఁ గలిసియుండి యభివ్యక్తమగుట లేదు. వీణ మొదలగువానిలో రూపము గంధము స్పర్శము మొదలగునవి యొకటే విధము గను పట్టుచున్నవి. శబ్ద మట్లు గాక వివిధ శ్రుతులలో భిన్న భిన్న ధ్వనులు గలదిగఁ బుట్టుచున్నది. ఒకే శ్రుతిలో తారము మధ్యము మందము మొదలగు ధ్వనులు గలదిగను బుట్టుచున్నది. శబ్దము పుట్టుచున్నదను పక్షమున ఇవి యన్నియు సరిపోవుచున్నవి. కాని శబ్దము అభివ్యక్త మగుచున్నదను పక్షమున ఇవి సుసరవు. కాన శబ్దము అభివ్యక్తగుచున్నదని చెప్పి నిత్యమని చెప్ప రావని భావము

ఇది

శబ్దానిత్యత్వ ప్రకరణము.

మూ. వికారాదేశోపదేశాత్ సంశయః.

40 సూ. వ్యాకరణాదులు సంధి మొదలగు చోట్ల వికారములను ఆదేశములను ఉపదేశించుట వల్ల శబ్దము పరిణామము చెందునదియా కాదా అను సంశయము గలుగుచున్నది. సూర్యోదయము మొదలగు చోట్ల (సూర్య+ఉదయము) అకార ఉకారములు తమ రూపమును వీడి ఓత్వ వికారమును పొందుచున్నవని కొందఱును, అకార ఉకారములను దగ్గరగా పలుకునపుడు ఓకారమును ఆ రెండిటికి ఆదేశములుగాఁ ప్రయోగింపవలయునని కొందఱును తలఁచుచున్నారు. మఱియు ‘ వచ్చు ’ అను క్రియ వ్యతిరేకార్థములో ’ రాకుండుట ‘ అని ’ రా ‘ అని మాఱుచున్నదని కొందరు వచ్చు అనుదానికి ‘ రా ’ అనునది ఆదేశముగ

వచ్చుచున్నదని కొందఱు తలఁచుచున్నారు. కాన శబ్దములు పరిణామము గలవా కావా అను సంశయము కలుగుచున్నది. పరిణామ మనఁగా స్వరూపము నశించి నను నశింపకున్నను మఱియొక ద్రవ్య రూపమును బొందుట. పాలు మొదలగు నవి తమ రూపము నశింపఁగా పెరుగుగా మాఱుచున్నవి. దారము మొదలగు నవి తమ రూపము నశింపక పోవఁగా వస్త్ర రూపమును బొందుచున్నవి.

మూ. ప్రకృతి వివృద్ధౌ వికారవివృద్ధేః.

41. సూ. శబ్దము పరిణామమును జెందుచున్నచోఁ బ్రకృతిలోని వర్ణ ములు వృద్ధి చెందినపుడు వాని వికారములు గూడ వృద్ధి పొందవలసివచ్చును.

హరి+ఆనందము=హర్యానందము అనుచో అకారము యకారముగ వికా రము చెందినదన్నప్పుడు ఆ వికారము యకారము ఆకారమును బట్టి హ్రస్వము గను, పార్వతీ + ఆనందము = పార్వత్యానందము అనుచో ఈ కారమును బట్టి యకారము దీర్ఘముగను గావలసి వచ్చును. ఇది యనుభవ విరుద్ధము. ఆదేశ పక్షములో హ్రస్వమునకును దీర్ఘమునకును యకారమె యాదేశముగ వచ్చునన్న పుడు ఈ యిబ్బంది లేదు. కాన ఆదేశపక్షమె శ్రేష్ఠమని భావము.

మూ. న్యూనసమాధికోపలబ్ధే ర్వికారాణా మహేతుః.

42. సూ. ప్రకృతి కంటె వాని వికారములు తక్కువగను సమముగను అధికముగను ఉపపన్నమగుట వల్ల నిది సరియైన హేతువు గాదు.

దూది కంటె దాని వికారమగు దారము తక్కువ పరిమాణములో నుండును. బంగారము నుండి తయారైన కడియములు మొదలైనవి సమముగ నుండును చిన్నదగు మఱ్ఱిగింజ నుండి బయలుదేఱిన మఱ్ఱిచెట్టు చాల పెద్దదై యుండును. చిన్న మఱ్ఱి గింజకంటెఁ బెద్దగ కొబ్బరికాయ నుండి పుట్టిన కొబ్బరి చెట్టు మఱ్ఱిచెట్టు కంటెఁ జిన్నది. ఇట్లు ప్రకృతి వికారములు భిన్న భిన్నముగ నున్నవి. కాన వర్ణ వికారములును భిన్న భిన్నములుగ నుండ వచ్చును. కానఁ బైనిజెప్పిన యాక్షేపము సరియైనదని యాక్షేపణము.

మూ. నాఽతుల్యప్రకృతీనాం వికారవికల్పాత్.

43. సూ. భిన్నప్రకృతులుగల ద్రవ్యముల వికారములు విలక్షణముగా వలన ఇందు దూది మొదలగు ద్రవ్యవికారములను ఉదాహరణముగా రాదు.

మూ. ద్రవ్యవికారే వైషమ్యవ ద్వర్ణవికార వికల్పః.

44. సూ. ద్రవ్యత్వ ధర్మమునుబట్టి దూది మొదలగునవి తుల్యమైనను వాని వికారములందు వైషమ్యము గలుగునట్లు వర్ణత్వధర్మమునుబట్టి ఇకార ఈకారాది వర్ణములు తుల్యమైనను వాని వికారములందు వైషమ్యము గలుగును.

కాన హ్రస్వదీర్ఘాదులకు యకారము సమముగ వచ్చుట అనుపపన్నము గాదని భావము.

మూ. న వికారధర్మానుపపత్తేః.

45. సూ. వికారధర్మములు ఉపపన్నములు గాకపోవుటవలన ద్రవ్య వికారములతో వర్ణవికారములకు తుల్యత్వము లేదు.

మట్టిగాని బంగారముగాని వికారము పొందునపుడు పూర్వరూపము మాఱి క్రొత్తరూపము ఏర్పడును. అయినను అది మట్టిగా గాని బంగారముగా గాని యుండును. వర్ణవికారము లట్లుగాదు. ఇ ఈ లు యకారముగా మాఱిన పిదప అవి యకారముగనే యుండునుగాని ఇ ఈలుగా నుండదు. కాన వికార ధర్మము లుపపన్నములు గావు గాన ఇకారమునకు యకారము వికారము గాదు.

మూ. వికారప్రాప్తానా మపురాపత్తేః.

46. సూ. వికారమును బొందినవి తిరుగఁ బ్రకృతిని బొందుటలేదు గాన వర్ణములకు వికారము కుదురదు.

పాలు పెరుగుగా వికారము పొంది పిదప ఆ పెరుగు పాలుగా మారదు. సూర్యోదయము అనుచోట అఉలు ఓకారరూపమును పొంది తిరుగ అర్థము చెప్పుట మొదలగుచోట్ల సూర్య ఉదయము అని ప్రకృతిరూపము పొందు చున్నవి. వికారవాదములో తిరుగఁ బ్రకృతిని బొందుట కుదరదని భావము.

మూ. సువర్ణాదీనాం పునరాపత్తే రహేతుః.

47. సూ. బంగారము మొదలగునవి వికారము పొందినను తిరిగి ప్రకృతిరూపమును బొందుచున్నవి గాన పై హేతువు సరియైనది గాదు.

బంగారము కుండలమై కరగించివేసినచో ముద్దగై మరల కరగించినచో బంగారమగుచున్నది ఇట్లే సూర్యోదయము మొదలగు వర్ణవికారములందును సరిపోవునని సమాధానము.

మూ. న తద్వికారాణాం సువర్ణభావాऽవ్యతిరేకాత్.

48. సూ బంగారపు వికారములు బంగారముకంటె వ్యతిరేకమైనవి గాకపోవుటవలన నిట బంగారము యొక్క యుదాహరణము చెప్పరాదు. బంగారము మురుగు మొదలైనవిగా మారినను బంగారము గుణమును విడచుట లేదు. అట్లుగాక మురుగుగా మారినపుడు బంగారు గుణమును విడిచినచో అది యుదాహరణమగును. అందుచే ఈ యుదాహరణములు సరియైనవి గావు సూర్యోదయము మొదలగుచోట్ల అక్షరముల గుణమును విడిచి మరల అక్షరరూపమును బొందుచున్నవి కాన వికారవాదము సమ్మతము గాదని భావము.

మూ. నిత్యత్వేऽ వికారా దనిత్యత్వే చానవస్థానాత్.

49. సూ. వర్ణములు నిత్యమని యంగీకరించిన పక్షమున వానికి వికారము గలుగదు గాన స్వరూపముతో నుండుటయును, అనిత్యములని యంగీకరించినపక్షమున అవి చిరకాలము నిలిచియుండకపోవుటయు సంభవింప వలసివచ్చును గాన వికారమతము గుదురదు.

నిత్యపక్షమున అక్షరలు వికారమును మాఱక యట్లే యుండును. అనిత్య పక్షమున అక్షరలుగాని వికాని సూర్య అన్నపుడు ఉదయము అనునది గాని నిలుకడ లేకయుండును ఏవి ప్రకృతులో ఏవి వికృతులో తెలియదు గాన వికారము గలుగుట కుదురదని భావము.

మూ. నిత్యానా మతీంద్రియత్వా త్తద్ధర్మ వికల్పాచ్చ వర్ణ వికారాణా మప్రతిషేధః.

50. సూ. నిత్యములు అతీంద్రియములగుటవలనను వాని ధర్మములు నానా విధములగుటవలనను నిత్యవర్ణములు వికారము చెందవని ప్రతిషేధించుట తగదు.

ఆకాశాదులు అతీంద్రియములుగ నున్నవి. నిత్యములైన గోత్వాది జాతులు ఇంద్రియగోచరములుగను నున్నవి. అందుచే నిత్యములు గూడ అనేక ధర్మములుగ నున్నవి. వర్ణములు ఇంద్రియగ్రాహ్యములు. కనుక నిత్యములైనను అనేక ధర్మములు గనిపించుచుండుటచే వర్ణములు వికారము చెందవచ్చును భావము.

మూ. అనవస్థాయిత్వే చ వర్ణోపలబ్ధివత్ తద్వికారోపపత్తిః.

51. సూ. వర్ణములు అనిత్యములు అన్నపుడు అవి చిరకాలము నిలిచియుండక పోవుట సంభవించినను వర్ణములెట్లు ఉపలబ్ధమగుచున్నవో యట్లే వాని వికారములు ఉపపన్నములగును గాన వికారమతము సమ్మతమె.

మూ. వికారధర్మిత్వే నిత్యత్వా భావాత్ కాలాంతరే వికారోపపత్తే చ్చాప్రతిషేధః.

52. సూ. వర్ణములు వికారము పొందు ధర్మము గలవి యనియన్నపుడు వానికి నిత్యత్వము సంభవింపక పోవుటవలనను, విశదీసి చెప్పినపుడే గాక సంధికాలము నందును వికారములు గలుగుటను బట్టి నిత్యత్వాఽనిత్యత్వ పక్షములందు 'వికారవాదము సమ్మత'మని యాదేశవాదమును ప్రతిషేధించుట తగదు.

మూ. ప్రకృత్యనియమాద్వర్ణ వికారాణాం.

53. సూ. ప్రకృతిసిద్ధముగా వర్ణవికారములలో ఈ వర్ణము ప్రకృతి ఈ వర్ణము వికారము అని నియమము లేకపోవుటవలన వికారమతము సమ్మతము రాదు.

పాలు పెరుగుగా మాఱుట ప్రకృతిలో నియమము. కాని పెరుగు పాలుగా మాత్రము మారదు. ఇందు అట్లుగాక మధ్వరి అనుచోట మధు + అరి అని ఉకారము వకారముగా మారినది ఉక్తి అనుచోట (వచ్ ధాతువునకు తిప్రత్యయము చేరినపుడు) వకారము ఉకారముగా మాఱినది. మధ్వరి అనుచోట వకారమునకు ఉకారము ప్రకృతి. ఉక్తి అనుచోట ఉకారమునకు వకారము ప్రకృతి. ఈ వికారములలో ప్రకృతి వికృతి భావము నియమముగా లేదు గాన వికారవాదము సమ్మతము గాదని భావము.

మూ. అనియమే నియమా న్నానియమః.

54 సూ. ఆ నియమము లేకపోవుటలో నియమముండుటవలన ప్రకృతి వికృతిభావములో నియమము లేదు అనరాదు.

ఆయా విషయములందు నియమము లేకపోవుటగూడ నియమముగా ఉన్నదని ఛలవాది శంక.

మూ. నియమానియమ విరోధా దనియమే నియమా చ్చాప్రతిషేధః.

55. సూ. నియమానియమములు పరస్పరము విరుద్ధములు గాన అనియమములో నియమమున్నదని ప్రతిషేధము చెప్పుట యుక్తము గాదు.

ఇది సమాధానసూత్రము. అనియమమనఁగా నియమము లేకపోవుట. ఆ నియమము లేకపోవుటలో నియమముండుట అసంభవము గానఁ బైనిజెప్పిన నిషేధము తగదని భావము.

మూ. గుణాంత రాపత్త్యుపమర్ద హ్రాస వృద్ధి లేశ శ్లేషేభ్యస్తు వికారోపపత్తేర్వర్ణ వికారాః.

56. సూ. గుణాంతరము గలుగుట, రూపాంతరము గలుగుట, దీర్ఘము హ్రస్వమగుట, హ్రస్వము దీర్ఘమగుట, అల్పమగుట, ఆగమము వచ్చుట. ఈ కారణములవల్ల మరల వర్ణములలో వికారము గలుగుట యుపపన్న మగుటవలన వర్ణములకు వికారములు గలుగునని వ్యవహారము గలుగుచున్నది.

భాష ప్రవాహరూపమైనది. దానిని మాటాడు వారిలోను దానిలో రచనలు చేయు వారిలోనుగల జ్ఞానాజ్ఞానాదికారణములనుబట్టి దాని రూపములు మారుచుండును. దానికి వ్యాకరణ కర్తలు ప్రకృతి ప్రత్యయములను గల్పించి సంధి మొదలగుచోట వానికి వికారములను ఆగమాదేశములను విధించి యొక క్రమ పద్ధతి ఏర్పఱచి బోధింతురు. దానినిబట్టి యీ మార్పులకు వికారమని వ్యవహారము గలుగుచున్నది కాని వాటికిఁ బరిణామమునుబట్టి గాని కార్యకారణ భావముబట్టి గాని వికారము గలుగుట గాదని తెలియవలయును గుణాంతరమనఁగా ఉదాత్త వర్ణమును అనుదాత్తముగాఁ బలుకుట. రూపాంతరము "అస్" క్రియకు "భూ" అను రూపాంతరము గలుగుట. ఇట్లే వచ్చు క్రియకు భవిష్యదార్థములో రాఁగలఁడు అను రూపాంతరము. మొ. దీర్ఘము హ్రస్వమగుటకుదా:- చేకూలు, చేకులు. హ్రస్వము దీర్ఘమగుటకుదా:- అన్నదమ్ములు అన్నాదమ్ములు. మొ. అల్పమగుటకుదా:- గృహములోపల, గృహములో, సందియము సందెము. మొ. ఆగమము వచ్చుటకుదా:- చేయఁగలఁడు. మొ.

ఇది శబ్దపరిణామప్రకరణము.

—:(౦):—

మూ॥ తే విభక్త్యంతాః పదం.

57. సూ॥ ఆవర్ణములకు విభక్తులు చివర నున్నపుడు పదములనబడు. విభక్తులు నామ విభక్తులు క్రియా విభక్తులు అని రెండు విధములు.

నామ విభక్తులు :- రాముఁడు, వనము, గోవు మొ॥

క్రియా విభక్తులు :- వచ్చెను, వచ్చిరి, మొ॥ అపుడు అక్కడ మొదలగు నవ్యయములలో విభక్తులు లోపించెను గాన అవియు విభక్త్యంతపదములే.

మూ. తదర్థే వ్యక్త్యాకృతి జాతిసన్నిధావుపచారాత్సంశయః.

58. సూ. ఆ పదముల యొక్క యర్థములో వ్యక్తియు, ఆకృతియు జాతియుఁ గలిసి యున్నపుడు ఆ మూడింటి జ్ఞానము గలుగుట వల్ల ఆ పదార్థమునకు నీ మూడిఁటిలో నేది యర్థము లేక యన్నియునా యని సంశయము గలుగుచున్నది.

గోవు అని పలుకఁగా గో వ్యక్తియు. గోవు యొక్క యాకృతియు గోత్వజాతియుః దెలియుచున్నవి. గోపదమున కిందులో నేది యర్థము చెప్పవలయును లేక యన్నియునా అని సంశయము గలుగుచున్నదని భావము.

మూ. యాశబ్దసమూహత్యాగపరిగ్రహ సంఖ్యా వృద్ధ్యపచయ వర్ణ సమాసానుబంధానాం వ్యక్తా వుపచారా ద్వ్యక్తిః.

59. సూ॥ యచ్ఛబ్దము సమూహము త్యాగము పరిగ్రహము సంఖ్య వృద్ధి అపచయము వర్ణము సమాసము అనుబంధము ఇవి యన్నియు వ్యక్తి యొక్క యర్థములోనే వ్యవహరింపఁబడుటవలనఁ బదమునకు వ్యక్తియే యర్థము గాని జాత్యాదులు గావు.

యచ్ఛబ్దము ఏ,ఆ, తచ్ఛబ్దాదుల కుపలక్షణము. ఏ గోవు నిలుచుచున్నది ఏ గోవు పోవుచున్నది ఆ గోవు వెళ్ళుచున్నది. ఇత్యాదులతో జాత్యాదులను అర్థము చెప్పుట సందర్భింపదు. జాతి యభేదరూపమైనది. ద్రవ్యరూపమైనది. సమూహము :- గోవుల సమూహము పోవుచున్నది. త్యాగము :- గోవును ఇచ్చుచున్నాఁడు. పరిగ్రహము :- గోవును పరిగ్రహించుచున్నాఁడు. సంఖ్య:- పది గోవులు. వృద్ధి:- గోవు పెరుగుచున్నది. అపచయము:-గోవు నీరసించినది. వర్ణము:-గోవు తెల్లనిది. సమాసము:-గోక్షారము. అనుబంధమనఁగా సరూపమైన

సంతానమును గనుట. గోవు ఈనినది. పైవానిలో జాత్యాదులు అర్థము చెప్పరాదు. జాత్యాదులకు రూపము గలుగదు గాన నిలుచుండుట మొదలగు వ్యవహారము సంభవింపదు గాన వ్యక్తియె యర్థముగాని జాత్యాదులు అర్థము గావని భావము.

మూ. న తదనవస్థానాత్.

६०. సూ. జాతిని విడిచి ద్రవ్యము వేఱుగనుండదు గాన పదమునకు వ్యక్తి యర్థము చెప్పరాదు.

పైని జెప్పిన యుదాహరణములలో గోవు అనఁగా గోత్వజాతి లేకుండ గోవు ఉండదు అని యాక్షేపణము.

మూ. సహచరణ స్థాన తాదర్థ్య వృత్త మానధారణ సామీప్య యోగసాధ నాధిపత్యేభ్యో బ్రాహ్మణమంచ కటరాజ సక్తు చందన గంగా శాటకాన్న పురుషేష్వతద్భావేఽపి తదుపచారః.

६१. సూ. సంయోగవిశేష, స్థాన, తాదర్థ్య వృత్తిమాన ధారణసామీప్య యోగసాధనాధిపత్యములనుబట్టి బ్రాహ్మణ మంచ కట రాజ సక్తుచందన గంగా శాట కాన్న పురుషులందు ఆ పదములచేత వివక్షితార్థము శక్యము గాక పోయినను ఆ పదవ్యవహారము గలుగుచున్నది.

సంయోగవిశేషమునుబట్టి ఉదా:- కఱ్ఱకు భోజనము పెట్టుము. ఇక్కడ సంయోగవిశేషమునుబట్టి కఱ్ఱకల బ్రాహ్మణుఁడు కఱ్ఱపదముచేత వ్యవహరింపఁబడుచున్నాఁడు. స్థానముబట్టి:-మంచములు ఏడ్చుచున్నవి ఇట మంచములనఁగా మంచములందున్న వారు చెప్పఁబడుచున్నారు. తాదర్థ్యము=దానికొఱకు అని యర్థము. ఉదా:- చాప అల్లుచున్నాఁడు. చాపకొఱకు ఉపయోగపడు తుంగగడ్డి యల్లఁబడుచుండఁగా ఇట్టు చెప్పఁబడుచున్నది. వృత్తమునుబట్టి:- రాజు యముఁడు. ఇట యమునివంటి వాఁడని వృత్తము చెప్పఁబడుచున్నది. మానము:- కుంచెఁడు పిండి (సక్తువు=పిండి) కుంచము కొలఁతగల పిండి యర్థము. ధారణ:- తులాచందనము. తులయందుఁ దూఁచఁబడిన చందనమని యర్థము. సామీప్యము:- గంగయందు గొల్లపల్లె గలదు. గంగ సమీపమునఁ గలదని యర్థము. యోగము=సంబంధము:- నలుపుచీర నలుపురంగుగల చీర

యర్థము సాధనము:- అన్నము ప్రాణము. ప్రాణసాధనమని యర్థము. అధిపత్యము:- ఇతని కులము రాజే. ఇతని కులాధిపతి రాజు. గంగా పదమునుబట్టి లక్షణచే గంగాతీరము అర్థమైనట్లు గోపదమునకు గోత్వజాతి సహిత గోవ్యక్తి యని యర్థము చెప్పవలయునని భావము.

మూ. ఆకృతి స్తద పేక్షత్వాత్ స త్త్వవ్యవస్థానసిద్ధేః.

62. సూ. ప్రాణివ్యవస్థ యాకృతినిబట్టి సిద్ధించును గానఁ బదమునకు ఆకృతి యర్థము.

మూ. వ్యక్త్యాకృతి యుక్తేఽప్య ప్రసంగాత్ ప్రోక్షణాదీనాం మృద్గవ కేజాతిః.

63. సూ. వ్యక్తియొక్క యాకృతిగల మట్టి యావు బొమ్మయందు ప్రోక్షణాదులకుఁ బ్రసంగము లేకపోవుటనుబట్టి పదమునకు జాతి యర్థము.

గోవును ప్రోక్షింపుము, గోవును దీసికొనిరమ్ము ఇత్యాదులందు గోపదమునకు ఆకృతి యర్థము చెప్పినచో గోవుయొక్క యాకారముగల బొమ్మ యని యర్థము చెప్పుట యసందర్భము గాన జాతి యని యర్థము చెప్పవలయును. అట్లుగానిచో గోరూపముగల బొమ్మలకు ప్రోక్షణాదులు చెప్పవలసి వచ్చునని యాక్షేపణము.

మూ. నా కృతి వ్యక్త్య పేక్షత్వాత్ జాత్యభివ్యక్తేః.

64 సూ. జాతి ప్రకటమగుటకు ఆకృతి వ్యక్తుల యపేక్షయుండుట వలన ఆకృతియు వ్యక్తియు గ్రహింపఁబడకుండఁ బ్రత్యక్షముగా జాతి గ్రహింపబడదు గానఁ బదమునకు జాతి యర్థము గాదు.

మూ. వ్యక్త్యాకృతి జాతయస్తు పదార్థః.

65. సూ. వ్యక్తియు ఆకృతియు జాతియుఁ గూడ పదమున కర్థములే.

ఆయా సమయములందుఁ బ్రయోగమునుబట్టి మూఁడును జెప్పవచ్చునని భావము.

మూ. వ్యక్తిర్గుణ విశేషాశ్రయోమూర్తిః.

66. సూ. గుణవిశేషముల కాశ్రయమైన మూర్తి గలది వ్యక్తి యనఁబడు.

మూ. ఆకృతిర్జాతి లింగాఖ్యా.

67. సూ. జాతి సూచకమగు లింగములను జెప్పునది యాకృతి యనఁబడును.

మూ. సమానప్రసవాత్మికా జాతిః.

68. సూ. సమానాకారబుద్ధిని గలిగించు స్వరూపము జాతి యనఁబడును.

శబ్దశక్తి పరీక్షాప్రకరణము

విభాగ పరీక్షాద్వారకమైన సాంగప్రమాణ పరీక్షణము అను

—: ద్వితీయాధ్యాయములో ద్వితీయాహ్నికము :—

ఇది

శ్రీ గౌతమహర్షిచే రచింపఁబడి

చర్లగణపతిశాస్త్రిచే అనువదింపఁ బడిన

న్యాయమీమాంసా దర్శనమందు రెండవ అధ్యాయము

—(०)—

# న్యాయ మీమాంసాదర్శనము

## తృతీయాధ్యాయము

### మొదటి యాహ్నికము

మూ. దర్శనస్పర్శనాభ్యామేకార్థ గ్రహణాత్.

1. సూ. దర్శన స్పర్శనములు రెండింటిచేతను ఒక విషయమె గ్రహింపఁబడుచుండుటవలన ఆత్మ యింద్రియములకంటె భిన్నమైనది యొక్కటె.

నేత్రేంద్రియముచే దేనిని నేను చూచితినో దానినె స్పర్శేంద్రియముచే స్పృశించితిని అను ననుభవమునుబట్టి ఆ యింద్రియములచేతఁ దెలియఁబడు వానిని దెలిసికొనెడి యాత్మ ఇంద్రియములకంటె వేఱుగా నున్నదని భావము.

మూ. న విషయవ్యవస్థానాత్.

2. సూ. కన్ను చర్మము మొదలైన యింద్రియములకు ఒక్కొక విషయము మాత్రమె ప్రత్యక్షమగుట నియమితమైయుండుటవలన దేహేంద్రియ సంఘాతముకంటె ఆత్మ వేఱుగాదు

ఇది పూర్వపక్షసూత్రము. కంటికి రూపముయొక్క విషయము మాత్రమె ప్రత్యక్షమగును. చర్మేంద్రియమునకు స్పర్శ మాత్రమె ప్రత్యక్షమగును. కంటికి స్పర్శ ప్రత్యక్షము గాదు చర్మేంద్రియమునకు రూపము ప్రత్యక్షము గాదు. ఇట్లే మిగిలిన యింద్రియముల సంగతియును. కాన అయా యింద్రియ సంఘాత రూపమైన యాత్మకే తత్తద్విషయములు ప్రత్యక్షమగుచున్నవని భావము.

మూ. తద్వ్యవస్థానాదేవాత్మసద్భావాదప్రతిషేధః.

3. సూ. కన్ను మొదలైన యింద్రియములు వానికి సంబంధించిన విషయములను మాత్రమె గ్రహించుట నియమితమగుటవలననే, సర్వవిషయములను గ్రహించునట్టి యాత్మ యొకటి యుండుట యంగీకరింపక తప్పకపోవుట వలన, "ఇంద్రియ సంఘాతముకంటె నాత్మ వేఱుకాదు" అని చెప్పరాదు.

కన్ను రూపమునె గ్రహించును. ఇతరమును గ్రహింపదు. చెవి శబ్దమును మాత్రమె గ్రహించును. ఇతరమును గ్రహింపదు. నాలుక రసమును మాత్రమె గ్రహించును. ఇతరమును గ్రహింపదు. ముక్కు వాసనను మాత్రమె గ్రహించును ఇతరమును గ్రహింపదు. త్వక్కు స్పర్శను మాత్రమె గ్రహించును. ఇతరమును గ్రహింపదు. అన్నిటిని గ్రహించునది ఆత్మ అని భావము.

ఇది ఇంద్రియ భేదప్రకరణము.

—:(o):—

మూ. శరీరదాహే పాతకాభావాత్.

4. సూ. శరీరమె ఆత్మ యన్నచో తన శరీరము నశింపఁగా నింక పాపాదుల ననుభవించునది యేదియు నుండదు గానఁ దానుజేసిన ప్రాణి హింసాదులవలనఁ గలుగు పాపము గలుగక పోవలసివచ్చును గనుక దేహాదుల కంటె ఆత్మ వేఱైనది.

మూ. తదభావః సాత్మకదాహేఽపి తన్నిత్యత్వాత్.

5. సూ. ఆత్మ దేహాదులకంటె వేఱైనది యన్నపుడును ఆత్మ నిత్యమైనదే గాన ఆత్మతోఁగూడిన శరీరము నశించినప్పుడును ఆత్మ నశింపదు కనుకఁ బాపము గలుగదు.

నిత్యమయిన యాత్మను హింసింపలేఁడు గానఁ బాపము గలుగదు. హింసింపఁబడుచో ఆత్మ నిత్యముగాదని భావము.

మూ. న కార్యాశ్రయకర్తృవధాత్.

6. సూ. ఆత్మ నిత్యమైనను దేహేంద్రియ బుద్ధి సంఘాతముతోఁగూడి కర్తయైన యాత్మకు బాధ కలుగుటవలనఁ బాపము కలుగక మానదు.

ఇది దేహ భేదప్రకరణము

—:(o):—

మూ. సవ్యదృష్టస్యేతరేణ ప్రత్యభిజ్ఞానాత్.

7. సూ ఎడమ కంటితోఁ జూడఁబడిన దానిని రెండవ కుడికన్ను గుర్తుపట్టుటవలన ఇంద్రియములకంటె ఆత్మ వేఱని సిద్ధించుచున్నది.

ఒక సేవకుఁడు తన యజమానునికిఁ దాను జూచిన వస్తువును గూర్చి చెప్పఁగా ఇంకొక సేవకుఁడు గూడ వచ్చి తాను జూచిన దానిని జెప్పఁగా యజమానుఁడు మొదటివాఁడు చెప్పినది రెండవ వాఁడు చెప్పినది ఒకటే యని తెలిసికొనును. యజమానుఁడు మూఁడవ వాఁడు వేఱుగా ఉన్నాఁడు గాన ఆ యిద్దఱు చెప్పినది గ్రహించెను. అట్లే ఎడమకన్ను చూచినది కుడికన్ను చూచినది ఒకటే యని తెలిసికొనుటకు ఆత్మ యనునది వేఱెయుండనిచోఁ దెలియదు గాన ఆత్మ వేఱుగా నున్నదని భావము.

మూ. నైకస్మిన్నాసాస్థి వ్యవహితే ద్విత్వాభిమానాత్.

8. సూ. ముక్కు యొక్క యెముక వ్యవధానముగా నుండుటనుబట్టి యొక్క కంటినె రెండు కన్నులని భ్రమపడుటచే అట్లు చెప్పఁబడినది కాని కన్ను ఒకటే కాన "గుర్తుపట్టుటనుబట్టి యాత్మ వేఱుగానున్న" దనరాదు,

మూ. ఏక వినాశే ద్వితీయావినాశా న్నైకత్వం.

9. సూ. ఒక కన్ను నశింపఁగా రెండవ కన్ను నశింపకపోవుటవలన "కన్ను ఒకటేగాని రెండు గావు" అనరాదు.

కంటి యింద్రియము ఒకటేయైనచో ఒక కన్ను పోఁగా రెండవ కన్ను కూడ పోయి గ్రుడ్డితనము కలిగియుండెడిదే. అట్లు కలుగకపోవుటవలనఁ గన్ను ఒకటే అనరాదని భావము

మూ. అవయవ నాశేఽవ్యవయవ్యుపలబ్ధే రహేతుః

10. సూ. అవయవము నశించినను అవయవి యుపలబ్ధమగుటవలన నేత్రేంద్రియము యొక్క యవయవమైన ఒక కన్ను నశించినను అవయవియైన యింకొక కన్ను ఉండును గానఁ బైనిజెప్పిన హేతువు సరియైనదికాదు. కొమ్మలు నరకినను అవయవియగు వృక్షము నశింపనట్లు ఒక కన్నుపోయినను అవయవియగు నేత్రేంద్రియము పోలేదు గాన గుడ్డితనము గలుగదు అని భావము. కన్ను ఒకటే గాన "రెండు కన్నులనియు ఒకటి చూచినది యింకొకటి చూచి గుర్తుపట్టుటవలన ఆత్మ వేఱుగా నున్న"దని చెప్పరాదని భావము.

మూ. దృష్టాంత విరోధా దప్రతిషేధః

11. సూ. దృష్టాంత విరోధముండుటవలన ఒకటి యవయవి రెండవది యవయవము అని చెప్పి దీనినిబట్టి "కన్నులు రెండు అనియు" దానినిబట్టి "ఒకటి చూచినది రెండవది గుర్తుపట్టుటవలన ఆత్మ వేఱుగా నున్నది" అను దానిని ప్రతిషేధించుట తగదు.

చెట్టు అవయవి కొమ్మలు అవయవములు అని చెప్పి అవయవములైన కొమ్మలు నరకినను అవయవియైన చెట్టు నశించుటలేదు అని దృష్టాంతము చెప్పఁబడుచున్నది. చెట్టువలెనే ఒక కన్ను అవయవి అనియు రెండవ కన్ను అవయవము అని చెప్పఁబడుచున్నది. కాని యిక్కడ దృష్టాంతము కుదురుట లేదు. చెట్టునకు శాఖలు అవయవమైనట్లు ఆత్మకు కన్నులు రెండు అవయవము లన్నచో దృష్టాంతము కుదురును. ఒక కొమ్మకు ఇంకొక కొమ్మ అవయవము. కానట్లు ఒక కంటికి ఇంకొక కన్ను అవయవము కానేరదు. అట్లుగాక చిన్నకొమ్మ పెద్దకొమ్మకు అవయవమన్నచో ఇట కన్నులలో ఒకటి చిన్నది ఒకటి పెద్దిది అన్నది లేదు. కాన ఏది యవయవియో ఏది యవయవమో తెలియదు. కాన దృష్టాంతము విరోధించుటవలన "కన్నులు రెండు గావు ఒకటే" యను దానిని బట్టి "ఆత్మ వేఱుగా లేదు" అను దానిని నిషేధించుట తగదని భావము.

మూ. ఇంద్రియాంతర వికారాత్.

12. సూ. ఒక యింద్రియముచే గ్రహింపఁబడిన విషయమునుబట్టి వేఱొక యింద్రియమునకుఁ దద్విషయ వికారము గలుగుటవలన వానిని గ్రహించిన యాత్మ యింద్రియములకంటె వేఱైనది.

నాలుకచే ఒక పండును రుచి చూచి తిందుము. ఆ రుచితోపాటు గలిగిన పండు వాసనను ఇంకొకపుడు ముక్కు గ్రహించును. ఆ వాసననుబట్టి నాలుక యూటలూరును. అందుచే నాలుకచే గ్రహింపఁబడిన విషయమును ముక్కు వాసననుబట్టి గ్రహించుట అది ఆత్మకు అవగతమగుట వీనినిబట్టి ఆత్మ యింద్రియముకంటె వేఱుగా నున్నదని తెలియుచున్నది.

మూ. న స్మృతేః స్మర్తవ్య విషయత్వాత్.

13. సూ. పూర్వానుభూత విషయము స్మరింపఁదగి యుండుటయె స్మృతికి విషయమగుటవలన ఇంద్రియాంతర వికారము ఆ స్మృతివలననె గలిగినది కాని ఆత్మ వలనఁ గలిగినది కాదు.

ఏది చూడఁబడునో అదియె స్మరింపఁబడును కాని ఏది కంటిచేఁ జూడఁబడునో అది నాలుకచే రుచి చూడఁబడదు. కాన స్మృతివలననె గాని యాత్మవలన నట్లు గలుగుటలేదని పూర్వపక్షము.

మూ తదాత్మ గుణ సద్భావా దప్రతిషేధః

14. సూ. ఆ స్మృతియె యాత్మ గుణముగా నుండుటవలన "అది ఆత్మ వలనఁ గలిగినది కాదు" అని ప్రతిషేధింపరాదు.

మూ. అపరిసంఖ్యానా చ్చ స్మృతి విషయస్య.

15. సూ. స్మృతికి విషయములు అనంతమగుటవలనను ఇంద్రియముల కంటె ఆత్మ భిన్నమైనది.

ఆ యనంత విషయములను ఇంద్రియములు స్మరింపలేవు ఆ యింద్రియములకంటె వేఱుగా ఆత్మ యుండుటవలననే స్మృతి గలుగుచున్నదని భావము. పూర్వసూత్రమే స్మృతి ఆత్మ గుణమని చెప్పుటవలన ఇది నూతనార్థము గాదని యిది భాష్యపంక్తి కాని సూత్రము గాదని యందురు.

ఇది చక్షురద్వైత ప్రకరణము

—:(o):—

మూ. నాత్మప్రతి పత్తిహేతూనాం మనసి సంభవాత్.

16. సూ. ఆత్మ యున్నదని తెలుపు హేతువులు మనస్సునందు సంభవించుటవలన దేహాది సంఘాతముకంటె ఆత్మ వేఱుగాదు.

మనస్సు సర్వవిషయములను గ్రహించునది గాన మనస్సు వలననే సర్వవిషయములు గ్రహింప బడుచుండఁగా నింక ఆత్మను వేఱుగా గ్రహింప నవసరము లేదని భావము.

మూ. జ్ఞాతుర్జ్ఞాన సాధనోపపత్తేః సంజ్ఞా భేదమాత్రం

17. సూ. జ్ఞాతకు జ్ఞానసాధనము లుండుట యుపపన్నములగుటవలన ఆత్మజ్ఞాతయు మనస్సు జ్ఞానసాధనము నగును.

లోకములో కర్తకు సాధనము లున్నట్లు ఇందుకు జ్ఞాతకు జ్ఞానసాధనము లుండవలయును. జ్ఞాతయు జ్ఞానసాధనమును ఒకటిగా నుండనేరవు. కాన రెండిటినీ అంగీకరింపవలయును. మనస్సే జ్ఞాత అన్నచో దానికి సాధన మొకటి యుండవలయును. మనస్సే జ్ఞాతయని జ్ఞానసాధనము ఆత్మయని అన్నచో నామ భేదమాత్రమే గాని విశేషము లేదు కాన జ్ఞాత ఆత్మయు మనస్సు సాధనము నగునని భావము.

మూ. నియమశ్చ నిరనుమానః

18. సూ. రూపాదులను గ్రహించు చక్షురాదులైన యింద్రియములు మాత్రము గలవు గాని సర్వవిషయములను గ్రహించు మనస్సు అను సాధనము లేదను నియమము అప్రమాణమైనది. కాన మనస్సు సాధనమును ఆత్మ జ్ఞాతయు నగును.

కంటిచే గంధము గ్రహింపఁబడదు గాన దానిని గ్రహించు ముక్కు అవసరము. కంటిచేతను ముక్కుచేతను రుచి గ్రహింపఁబడదు. కాన నాలుక దానిని గ్రహించునది యవసరము. ఇట్లే మిగిలిన వాని యందును, కన్ను మొదలయిన యింద్రియములచే సుఖదుఃఖాదులు గ్రహింపఁబడవు. కనుక వానిని గ్రహించు మనస్సు అవసరము. రూపాదులను గ్రహించునవి యింద్రియములు. రూపాదులవలనఁ గలుగు సుఖదుఃఖాదులను గ్రహించునది మనస్సు. మనస్సు అణువు. ఆత్మ గొప్పది అని వివేకము.

ఇది మనోభేద ప్రకరణము

—:(๐):—

మూ. పూర్వాభ్యస్త స్మృత్యనుబంధాజ్జాతస్య హర్షభయ శోక సంప్రతి పత్తేః

19. సూ. పుట్టిన శిశువునకుఁ బూర్వజన్మయందు అభ్యసింపఁబడిన స్మృతి సంబంధమునుబట్టి సంతోషము భయము శోకమును గలుగుట యుపపన్న మగుటవలన ఆత్మ యనాదియు నిత్యమనై యున్నది.

అనుభవింపఁబడక యభ్యసించుటకు వీలులేదు గాన సంతోషాదులను అనుభవించెడి యాత్మ గతాగాత జన్మలందు నిత్యముగా నున్నది. పూర్వ

జన్మమందు ఆత్మ యున్నది. కాన తత్పూర్వ జన్మమందును ఆత్మ యున్నది. పూర్వ పూర్వ జన్మలలో ఆత్మ యుండుటవలన అది యనాది యనియు అనాదియైన దానికి నాశము లేదు గాన నిత్యమనియు సిద్ధించుచున్నదని భావము.

మూ. పద్మాదిషు ప్రబోధ సమ్మీళన వికార వత్తద్వికారః

20. సూ. అనిత్యములగు తామరపువ్వు మొదలగు వానియందు వికాసము ముకుళించుట రూపమైన వికారము గలుగునట్లు శిశువునకు సంతోషాది వికారములు గలుగుచుండును గాన ఆత్మ యనిత్యము.

మూ. నోష్ణ శీత వర్షాకాల నిమిత్తత్వాత్ పంచాత్మక వికారాణాం.

21. సూ. పాంచ భౌతికములగు తామరపువ్వు మొదలగు వాని వికారములకు వేడి చలి వర్షాకాలములు కారణములుగా నున్నట్లు శిశువుల సంతోషాదులకుఁ బూర్వ జన్మానుభవ స్మృతి తక్క మఱియొక కారణము సంభవింపకపోవుట వలన ఆత్మ నిత్యమని చెప్పవలయును గానఁ బైనిజెప్పిన యనిత్య సాధక హేతువు యుక్తము గాదు

మూ. ప్రేత్యాహారా భ్యాస కృతాత్ స్తన్యాభి లాషాత్.

22. సూ. పూర్వ శరీరమును వదలి మఱియొక శరీరమును పొంది యాఁకలి బాధ గలవాఁడై ఆ బాధను దీర్చుకొనుటకై పూర్వజన్మమందలి యాహారాభ్యాసమును దలఁచుకొని తరువాతి జన్మలో స్తన్యపానమును గోరును ఆ కోరిక గలిగియుండుటనుబట్టి ఆత్మ నిత్యమైనది,

ఏ యాత్మ పూర్వజన్మలో అభ్యసించినదో యా యాత్మయే యిపుడును అభ్యసింపఁబడిన దానిని జేయుటచే ఆ యాత్మ క్రింది జన్మలలోనిదే గాన ఆత్మ నిత్యమైనదని భావము.

మూ. అయసోఽయస్కాంతాభి గమనవత్ తదుపసర్పణం.

23. సూ. అభ్యాసము లేకయె ఇనుము సూదంటు రాతిని సమీపించునట్లు బాలుఁడు ఆహారాభ్యాసము లేకయె స్తన్యపానమును గోరుచున్నాఁడు గాన ఆత్మ నిత్యమనరాదు.

మూ. నాన్యత్ర ప్రవృ త్త్య భావాత్.

24. సూ. సూదంటు రాయి యినుమును దక్క మఱొకదానిని ఆకర్షింపదు ఇనుమును మఱియొక దానిని దగ్గరకుఁ బోవదు కాఁబట్టి యినుమునకు సూదంటు రాతికి ఒక నియతసంబంధము గలదు అట్లే స్తన్యపానాభిలాషకును పూర్వాహారాభ్యాస స్మృతికిని నియతసంబంధము గలదు. కాన ఆత్మ నిత్యమైనది.

మూ. వీతరాగ జన్మదర్శనాత్.

25. సూ. వీతరాగులకు జన్మ గనిపింపకపోవుటవలనఁ బూర్వజన్మమందుఁగల శరీరమున అనుభవించిన రాగముయొక్క స్మృతిచేత ఈ జన్మయందును రాగాదులు పొందుచుండుటవలన ఆత్మ నిత్యమైన దని చెప్పవలయును.

పూర్వసూత్రములో స్తన్యాభిలాషను గూర్చి చెప్పఁబడినది. ఇందులోఁ బక్షుల ధాన్యకణాది భక్షణాభిలాష సాధారణమైన రాగమును గూర్చి చెప్పఁబడినది గానఁ బునరుక్తి లేదు. ఇట్లు పూర్వ పూర్వ జన్మలందలి రాగాదులు ఉత్తరోత్తర జన్మలందలి రాగాదులకుఁ గారణము గాన ఆత్మ యనాదిగా నున్నదని భావము.

మూ. సద్గుణ ద్రవ్యోత్పత్తి వత్తదుత్పత్తిం.

26. సూ. ఘటాది ద్రవ్యములు స్వతస్సిద్ధముగ రూపాది గుణములతోఁ బుట్టినట్లు ఆత్మకు స్వతస్సిద్ధముగ రాగము పుట్టుచున్నది గాన ఈ హేతువు ఆత్మ నిత్యమను దానిని సాధింపదు.

మూ. న, సంకల్ప నిమిత్తత్వాద్రాగాదీనాం.

27. సూ. రాగాదులకుఁ బూర్వజన్మమందు అనుభవించిన సంకల్పములే కారణములు కాని మఱొక కారణములు కుదురవు గాన ఆత్మ నిత్యమె.

ఘటాదులకుఁ దత్కారణ పరమాణుగత గుణములు కారణములైనట్లు సంకల్పములు కారణమని భావము.

ఇది అనాది నిధనప్రకరణము

—:(o).—

మూ. పార్థివం గుణాంత రోపలబ్ధేః

28. సూ. గంధము నీలాది రూపములు కాఠిన్యాది గుణములు ఉపలబ్ధ మగుచుండుటవలన శరీరము పృధివీ వికారయుక్తము.

పృథివీ వికారములు శరీరమందు అధికముగా నుండుటనుబట్టి యట్లు చెప్పఁబడినది. కాన నితర భూతములు గూడ నుండునని తెలియునది. ఇతర లోకములందు జలశరీరములు తైజసశరీరములు వాయవ్య శరీరములు నుండు నని గ్రహి-పవలయును.

మూ. పార్థివాప్య తైజసం తద్గుణో పలబ్ధేః

29. సూ. పృథివీ జలతేజోగుణములు ఉపలబ్ధమగుటవలన శరీరము పృథివీ జలతేజోవికార యుక్తమైనది.

మూ. నిశ్వాసోచ్ఛ్వాసోపలబ్ధేశ్చాతుర్భౌతికం.

30. సూ. నిశ్వాసోచ్ఛ్వాసములు గూడ నుపలబ్ధమగుట వలన శరీరము పృథివీజల తేజోవాయు వికారయుక్తము.

మూ. గంధక్లేద పాకవ్యూహావకాశ దానేభ్యః పాంచ భౌతికం.

31. సూ. గంధము, తడి, అన్నాదులు జీర్ణమగుట నిశ్వాసాదులు, అవకాశమిచ్చుట అనెడి యీ గుణములనుబట్టి శరీరము పృథివీ జలతేజో వాయ్వాకాశ రూప పాంచభౌతికమైనది.

29, 30, 31 సూత్రములు ఇతర మత ప్రదర్శకములు.

మూ. శ్రుతి ప్రామాణ్యాచ్చ.

32. సూ. శ్రుతిప్రామాణ్యమునుబట్టియు శరీరము పృథివీ వికార యుక్తమైనది.

"సూర్యంతే చక్షుర్గచ్ఛతాత్"— "పృథివీంతే శరీరం" నీ నేత్రము అధిదేవతయైన సూర్యుని బొందుఁగాక— నీ శరీరము అధిదేవతయైన పృథివిని బొందుఁగాక ఇత్యాది శ్రుతులనుబట్టి శరీరము పృథివీవికారయుక్త మని భావము.

ఇది బాహుళ్యమునుబట్టి చెప్పఁబడినది మఱియుఁ బృథివీ పరమాణువులే శరీరారంభకములగును. ఇతర భూతములు సహాయకములు మాత్రమె అని భావము.

ఇది శరీర పరీక్షా ప్రకరణము.

—:(o):—

మూ. కృష్ణ సారే సత్యుపలంభాత్ వ్యతిరిచ్య చోపలంభాత్సంశయః

33. సూ. కంటిలో నల్లగ్రుడ్డు ఉన్నపుడె ఘటపటాది విషయములు గనఁబడుటవలనను, నల్లగ్రుడ్డును దాటి దూరముగ నున్న ఘటపటాధి విషయములు గనఁబడుటవలనను నేత్రేంద్రియ మనఁగా నల్లగ్రుడ్డా లేక నల్లగ్రుడ్డుగాని తైజస పదార్థమా యని సంశయము గలుగుచున్నది.

నల్లగ్రుడ్డు ఉండఁగా ఘటపటాది విషయములు తోఁచుటవలన నల్లగ్రుడ్డే యింద్రియమని బౌద్ధులు. విషయములను జేరి కనిపింపఁ జేయుటవలన నల్లగ్రుడ్డు గాక తదితరమని నైయాయికాదులు. ఇంద్రియములు అభౌతికములు అహంకారికములని సాంఖ్యులు భౌతికములవి కొందఱు అని భిన్నమతములుండుటచేఁ బరిశీలింపఁబడుచున్నది.

మూ. మహాదణుగ్రహణాత్.

34. సూ. మహత్పదార్థమును అణుపదార్థమును గ్రహించుచుండుటవలన నల్లగ్రుడ్డు నేత్రేంద్రియము గాదు.

ఇట మహత్పదార్థమనఁగా మహత్తరము మహత్తమముగూడ గ్రహింపఁబడును. అట్లే అణువనఁగా అణుతరము అణుతమముగూడ. నేత్రేంద్రియమనఁగా నల్లగ్రుడ్డె అన్నచో నల్లగ్రుడ్డు ఎంత యున్నదో యంతమాత్రమునె గ్రహింపవలసి యుండును. మిగులఁ జిన్నవానిని మిగులఁ బెద్దవానిని గ్రహించుటవలన భౌతికమైన నల్లగ్రుడ్డు నేత్రేంద్రియము గాదని యాక్షేపణము. ఇందు సాంఖ్యమతముచే బౌద్ధమతము ఖండింపఁబడినది.

మూ. రశ్మ్యర్థ సన్నికర్ష విశేషాత్ తద్గ్రహణం.

35. సూ. నేత్రకాంతికిని బదార్థమునకునుగల సంనికర్ష విశేషమువల్ల ఆ నేత్రేంద్రియము మహత్తును అణువును గ్రహించును.

దీపకాంతికిని బదార్థమునకునుగల సంనికర్షమునుబట్టి వస్తువు గ్రహింపఁబడునట్లు గ్రహింపఁబడునని భావము. దీపకాంతివలె నేత్రకాంతి గూడ గోడ మొదలగునవి యడ్డుగా నున్నపుడు వస్తువులను గ్రహింపలేదు.

మూ. త దనుపలబ్ధే రహేతుః

36. సూ. నల్లగ్రుడ్డుకంటె నితరమైనదే నేత్రేంద్రియమన్నచో అట్టి దానికిఁ గాంతి యుపలబ్ధము గాకపోవుటవల్ల మహత్తును అణువును గ్రహించుటలో అది హేతువు గాదు.

మూ. నానుమీయమానస్య ప్రత్యక్షతోఽనుపలబ్ధి రభావ హేతుః

37. సూ. రూపము గనిపించుటకు ముఖ్యకారణముగా అనుమానింపఁబడుచున్న కన్ను ప్రత్యక్షముగాఁ బైకిఁ గనిపింపకపోవుట అసలె ఆ రూపమును గ్రహించెడి యింద్రియమె లేదనుటకు హేతువు గాదు.

చంద్రునిలోని యవతలి భాగమును భూమి క్రింది భాగమును గనిపింపనంత మాత్రముచేత అవి లేదని చెప్పరానట్లే యిందును జెప్పరాదని భావము.

మూ. ద్రవ్యగుణ ధర్మ భేదా చ్చోపలబ్ధినియమః

38. సూ. ద్రవ్యగుణముల ధర్మములలోఁగల భేదమునుబట్టి ప్రత్యక్షము గలుగుటలో నియమము గలదు.

మహత్త్వాదికము ద్రవ్యములోఁగల ధర్మవిశేషము. పైకిఁ బ్రకటమగుట గుణముయొక్క ధర్మము. పైకిఁ బ్రకటమగు మహత్త్వాదిక మున్నపుడు వస్తువు ప్రత్యక్షమగును. అది లేనిచోఁ బ్రత్యక్షము గాదు. ఈ నియమము ఇందు లేకపోవుటవలన నేత్రేంద్రియము ప్రత్యక్షమగుట లేదు. కాని లేక కాదని భావము.

మూ. అనేక ద్రవ్య సమవాయాత్ రూప విశేషాచ్చ రూపోపలబ్ధిః

39. సూ. అనేక ద్రవ్య సమవాయమువల్లను రూపవిశేషముండుటవల్లను రూపము గనిపించుచున్నది.

నేత్రకాంతి పైకిఁ బ్రకటమగునట్టిది గాదు. కానఁ బ్రత్యక్షమగుటలేదని భావము.

మూ. కర్మకారిత శ్చేంద్రియాణాం వ్యూహః పురుషార్థతంత్రః

40. సూ. కర్మల కధీనమైన యింద్రియ రచన యాత్మయొక్క క్రియుపభోగములకు సాధనమైనది.

మూ. అవ్యభిచారాచ్చ ప్రతిఘాతో భౌతికధర్మః

41. సూ. వ్యభిచారము లేకపోవుటవలన ఆవరణమున్నపుడు ఇంద్రియములకు ద్రవ్యవిశేషములందు అడ్డు గలుగుట భౌతిక వస్తువుల ధర్మము.

ఆవరణమున్నపుడెల్ల భౌతికవస్తువుల యడ్డు గలుగును. అభౌతిక వస్తువులకు అడ్డు గలుగదు,

మూ. మధ్యందినోల్కాప్రకాశానుపలబ్ధివ త్తదనుపలబ్ధిః

42. సూర్యుని ప్రకాశములో మధ్యాహ్నమందుఁ బడిన యుల్కలకాంతి వలె నేత్రకాంతి పైకిఁ గనిపించు రూపము లేని దగుటవలనఁ బ్రత్యక్షమగుటలేదు.

ఉల్కలు=రాత్రియందు వెలుఁగుచుఁబడునవి. ఇవి పగలును బడునుగాని సూర్యప్రకాశములోఁ గనిపింపవు.

మూ. న. రాత్రా వప్యనుపలబ్ధేః

43. సూ. ఉల్కల కాంతి సూర్యప్రకాశములోఁ గనిపింపనట్లు మట్టిబెడ్డ కుండ మొదలగు వాని కాంతి కూడ సూర్యప్రకాశములోఁ గనిపించుటలేదు గాన వానికిని గాంతి గలదన్నచో - రాత్రియందుఁ గూడఁ గనిపింపకపోవుట వలన మట్టి బెడ్డ కుండ మొదలగు వానికిఁ గాంతి కలదనరాదు.

ఉల్కలకాంతి రాత్రి గనిపించును గానఁ బగలు సూర్యప్రకాశమునఁ గనిపింపకపోయినను వానికిఁ గాంతి యున్నదని భావము.

మూ. బాహ్య ప్రవేశానుగ్రహో ద్విషయోపలబ్ధేరనభివ్యక్తితోఽనుపలబ్ధిః

44. సూ. విషయములు సూర్యాదుల బాహ్యప్రకాశము యొక్క యనుగ్రహముచే ఉపలబ్ధమగుచున్నవి గనుక నిట విషయములవలె నేత్రకాంతి యును పైకిఁ గనిపించు రూపము గలది గాకపోవుటవలన ఉపలబ్ధమగుటలేదు గాని యావరణాదులచేఁ దిరస్కరింపఁబడి మాత్రము గాదు.

మూ. అభివ్యక్తే చాభిభవాత్.

45. సూ. పైకిఁ గనిపించు రూపము ప్రకటమగుటలోఁ గూడ ఆవరణాదులచేఁ దిరస్కరింపఁబడుటవలనఁ బ్రత్యక్షమగుటలేదు గాని నేత్రకాంతి పైకిఁ గనిపించు రూపము గలది కాకపోవుటచేఁ గనిపించుటలేదు కాన స్వవిషయ ప్రకటనలోఁగూడ సూర్యాదిబాహ్యప్రకాశము నపేక్షించుచున్నది.

మూ. నక్తం చరనయనరశ్మిదర్శనాచ్చ.

46. సూ. రాత్రి సంచరించు జంతువుల కనుగ్రుడ్డులలోఁ గాంతి కనిపించుటవలనను నేత్రకాంతి లేదనరాదు.

నేత్రకాంతి లేనిచో ఎలుక దోమ పిల్లి మొదలగు వానికి వస్తువులు గనిపింపకపోవలసి వచ్చునని భావము.

మూ. అప్రాప్యగ్రహణం కాచాభ్ర పటల స్ఫటికాంతరితోప లబ్ధేః

47. సూ. గాజు మబ్బుతెర స్ఫటికములచే వ్యవధాన మున్నను వస్తువు గనిపించుటవల్లఁ గన్ను వస్తువులను పొందకయె యింద్రియార్థ సంనికర్షము లేకయె వస్తువును గ్రహించుచున్న దనవలయును.

దీనినిబట్టి యింద్రియార్థసంనికర్షము వస్తుగ్రహణమునకు హేతువు గాదని యాక్షేపణము. ఇంద్రియములు వస్తువులను బొందకయె వస్తువులను గ్రహించునవి యగునని యాశంక.

మూ. నకుడ్యాంతరి తాను పలబ్ధే రప్రతి షేధః

48. సూ. గోడచే వ్యవధానముగల వస్తువులు గంటికిఁ గనిపింపక పోవుటవలనను గోడ వ్యవధానము లేనివి గనిపించుటవలనను "ఇంద్రియార్థ సంనికర్షము వస్తుగ్రహణములో హేతువు గాదు" అని నిషేధించుట యుక్తము గాదు.

వస్తువులను బొందకయే యింద్రియములు వస్తువులను గ్రహించునని యగునన్నచో గోడ మొదలగు వానిచే వ్యవధానమున్న వస్తులను గ్రహించునని చెప్పవలసివచ్చును. అది ప్రత్యక్ష విరుద్ధమైన సంగతి గదాయని భావము.

మూ. అప్రతిఘాతాత్ సన్నికర్షోపపత్తిః

49. సూ. గాజు మొదలగు స్వచ్ఛద్రవ్యములవల్ల ఇంద్రియములకుఁ దద్విషయములకుఁ బ్రతిబంధము గలుగకపోవుటచేత నింద్రియ తద్విషయములకు సంనికర్షము గలుగుట యుపపన్నమగుచున్నది.

వస్తువులను బొందియే యింద్రియములు విషయములను గ్రహించు నన్నచో గోడ మొదలగు వ్యవధానములచే విషయములు గ్రహింపఁబడనట్లు గాజు మొదలైనవి వ్యవధానమేగా నున్నపుడును విషయములు గ్రహింపఁబడవు అను నాక్షేపమునకు ఇందు సమాధానము చెప్పఁబడినది.

మూ. ఆదిత్యరశ్మేః స్ఫటికాంతరితేఽపదాహ్యేఽవిఘా తాత్.

50. సూ. దహింపఁదగిన వస్తువులను దహించుటలో సూర్యరశ్మికిఁ బ్రతిబంధము లేనట్లు స్ఫటికాదులచే వ్యవధానమున్నను నేత్ర రశ్మికిని ప్రతి బంధము గలుగదు.

భూతద్దముచే వ్యవధానమున్నను దూది సూర్యరశ్మిచేఁ గాల్చఁబడును. కుండ మొదలగు వానిలోని నీరు సూర్యరశ్మిచే వెచ్చఁబడును. అగ్ని మొదలగు నవి యిట దృష్టాంతములగును. అగ్నికి పాత్రలు వ్యవధానమున్నను నీరు కాగుట ఉడుకుట మొదలగునవి జరగును.

మూ. నేతరేతరధర్మ ప్రసంగాత్.

51. సూ. సూర్యరశ్మికివలె నేత్రరశ్మికిని వ్యవధానమున్నను బ్రతిబంధము లేదన్నచో ఎపుడు ప్రతిబంధము గలుగునో ఎప్పుడు గలుగదో తెలియక

పోవుటవలన స్ఫటికాదులకు గోడ మొదలగు వాని ధర్మములును గోడ మొదలగు వానికి స్ఫటికాదుల ధర్మములును గలుగవలసివచ్చును. అపుడు గోడ మొదలగువాని ధర్మములు స్ఫటికాదులకుఁ గలిగి వస్తుసంనికర్షమునఁ బ్రతిబంధకము గలుగుటయును గోడ మొదలగునవి యడ్డుగా నున్నను వస్తువులకుఁ బ్రతిబంధకము లేకపోవుటయును గలుగును.

మూ. ఆదర్శోదకయోః ప్రసాద స్వాభావ్యా ద్రూపోపలబ్ధివ త్తదుపలబ్ధిః

52. సూ. అద్దము జలమును స్వభావసిద్ధముగా నిర్మలము లగుటవలన వానియందు రూపము ఉపలబ్ధమగునట్లు స్వభావముగా స్వచ్ఛములగు స్ఫటికాదులచే వ్యవధానమున్నను స్వభావసిద్ధముగ వస్తువు ఉపలబ్ధమగుచున్నది. గోడ మొదలగునవి యట్టివి గావు గాన స్ఫటికాదుల ధర్మము గోడ మొదలగు వానికిఁ గలుగదు.

మూ. దృష్టానుమితానాం నియోగప్రతిషే ధానుప పత్తిః.

53. సూ. దృష్టములగు పదార్థముల విషయములందును అనుమాన ప్రమాణముచే సిద్ధములగు పదార్థముల విషయములందును "ఇట్లుండుము, ఇట్లుండరాదు" అని విధి నిషేధములు ఉపపన్నములు గావుగదా.

వ్యవధానమున్నపుడు ఉపలబ్ధము గాకపోవుటచే గోడ మొదలగు వానిచేఁ బ్రతిబంధము గలుగుచున్నదనియు వ్యవధానమున్నపుడు గాజు మొదలగు వానిచేఁ బ్రతిబంధము గలుగుటలేదనియు స్వభావసిద్ధములైన వస్తుధర్మములను బట్టి తెలియనగునని భావము.

ఇది ఇంద్రియ పరీక్షాప్రకరణము

—:(o):—

మూ. స్థానాన్యత్వే నానాత్వాదవ యవి నానాస్థానత్వాచ్చ సంశయః

54. సూ. భిన్న భిన్నస్థానములందున్న వస్తువులను వేఱు వేఱుగాఁ జూచుటవల్లను భిన్న భిన్నావయవములందున్న యవయవి యొకటిగాఁ జూడఁ

బడుటవలనను వేఱువేఱుగా వానిని గ్రహించెడి ఇంద్రియము లనేకములా ఏకమా యను సంశయము గలుగున్నది.

మూ. త్వ గవ్యతిరేకాత్.

55. సూ. త్వక్కు అన్ని యింద్రియప్రదేశములందును ఉన్నది ఆది యాక్రమింపని యింద్రియప్రదేశము లేదు గాన త్వక్కు ఒకటే యింద్రియము.

త్వక్కు అనఁగాఁ జర్మము. ఇది పూర్వపక్ష సూత్రము.

మూ. న యుగపదర్థానుపలబ్ధేః

56. సూ. రూపాది విషయములు ఒక్కమాటుగాఁ దెలియఁబడక పోవుటవలన త్వక్కు ఒక్కటె యింద్రియ మనరాదు.

ఆత్మ మనస్సుతోను మనస్సు ఇంద్రియములతోను ఇంద్రియములు విషయములతోను గలియుట క్రమము. ఇంద్రియము లన్నియు ఒకటేయన్నచో రూపరసగంధాదులు ఒకమాఱుగనె తెలియఁబడవలసి వచ్చును. అట్లు త్వక్కు అన్నిటిని గ్రహించుటలేదు. త్వక్కువల్లనే అన్ని విషయములు తెలియఁబడుచో అందఱకు త్వక్కు ఉంతనే యున్నది. స్పర్శవలననే అన్ని విషయములు తెలియఁబడవలెను గాన కొందఱు గ్రుడ్డివారుగను కొందఱు మూగివారుగను కొందఱు చెవిటివారుగను ఉండుట సంభవింపదని భావము.

మూ. విప్రతిషేధాచ్చ నత్వగేకా.

57. సూ. విప్రతిషేధముండుటనుబట్టి త్వక్కు ఒక్కటే యింద్రియము గాదు.

త్వగింద్రియము వస్తువులనుజేరి గ్రహించునా లేక వస్తువులను జేరకయే గ్రహించునా. చేరి గ్రహించునన్నచో రూపములు దూరమునుండియె త్వగింద్రియము చేరకుండనె గ్రహింపఁబడుచున్నది. చేరకుండనే గ్రహించునన్నచో స్పర్శమును త్వగింద్రియము చేరిగాని గ్రహింపదు. ఇట్లు రెండుపక్షములందును విరోధముండుటచే త్వగింద్రియము ఒకటే యన్నియును గ్రహింపదు. విప్రతిషేధ మనఁగా తుల్యబలవిరోధము గలిగియుండుట.

మూ. ఇంద్రి యార్థత్వాత్.

58. సూ. ఇంద్రియములచేఁ గ్రహింపఁదగిన శబ్దస్పర్శరూప రసగంధములు అయిదు విధములుగ నుండుటవలన ఇంద్రియములు అనేకములు.

శబ్దాదులు ఒక్కొక్క యింద్రియముచేతనె గ్రహింపఁబడుటవలన వానికి వైలక్షణ్య మున్నది. త్వగింద్రియముచేత స్పర్శ గ్రహింపఁబడును రూపము గ్రహింపఁబడదు. దానిని గ్రహించుటకు నేత్రేంద్రియము అనుమానింపఁ బడుచున్నది. స్పర్శను రూపమును గ్రహించు త్వగింద్రియ నేత్రేంద్రియముల చేత గంధము గ్రహింపఁబడదు కాన గంధము గ్రహించు ప్రయోజనముగల ఘ్రాణేంద్రియము అనుమానింపఁబడుచున్నది. ఆ మూఁడిటిచే రసము గ్రహింపఁ బడదు. కాన దానిని గ్రహించు నాలుక యనుమానింపఁబడుచున్నది. ఆ నాలుగింటిచే శబ్దము గ్రహింపఁబడదు. కాన శబ్దమును గ్రహించు చెవి యనుమా నింపఁబడుచున్నది. ఇట్లు ఇంద్రియప్రయోజనములు ఇతర సాధనములచే సాధింపఁదగినవి గావని భావము.

మూ. న, తదర్థ బహుళత్వాత్.

59. సూ. ఇంద్రియ విషయములు బహుళముగా నుండుటవలన ఇంద్రియము లయిదే యనుట తగదు.

శబ్దములు వర్ణపద వాక్య ధ్వన్యాదిరూపములై యున్నవి. స్పర్శములు శీతోష్ణానుష్ణశీతాదిరూపములు. రూపములు శుక్ల హరిత పీత నీలాదులు రసములు కటు కామ్ల మధురాదులు. గంధములు ఇష్టానిష్టాపేక్షణీయములు. ఈ విధముగా నింద్రియవిషయములు అనేకములు గాన ఇంద్రియములును అయిదు కంటె నెక్కువగునని యాక్షేపణ.

మూ. గంధ త్వాద్య వ్యతిరేకా ద్గంధాదీనా మప్రతి షేధః

60. సూ. గంధాది విషయము లనేకమైనను అందు గంధత్వాదిజాతులు భిన్నములు గాకపోవుటవలన గంధాదు లనేకమని చెప్పుట తగదు.

అవాంతరభేదము లనేకమైనను గంధత్వ శబ్దత్వ స్పర్శత్వ రూపత్వ రసత్వ జాతులయిదే గాన వానిని గ్రహించెడి యింద్రియము లయిదే యని సమాధానము.

మూ విషయత్వాఽవ్యతిరేకా దేకత్వం.

61. సూ. అవాంతరభేదములను గ్రహింపక గంధత్వ శబ్దత్వాది జాతి రూపముగ విషయములైదే యన్నచో గంధత్వ శబ్దత్వాదులందు విషయత్వము సమానముగా నుండుటవలన విషయత్వ రూపజాతినిబట్టి దానిని గ్రహించెడి యింద్రియ మొక్కటె.

మూ. న, బుద్ధి లక్షణాధిష్ఠాన గత్యాకృతి జాతి పంచత్వేభ్యః

62. సూ. బుద్ధి లక్షణములు అధిష్ఠానములు గతులు ఆకృతులు జాతులు అనునవి యయిదుగా నుండుటనుబట్టి యింద్రియ మొకటే యనరాదు.

బుద్ధి లక్షణములు కనులు చెవులు మొదలగు వాని జ్ఞానములకు సంబంధించినవి. అవి యయిదు. పంచేంద్రియములకు ఆధారమైన శబ్దస్పర్శాదులు అధిష్ఠానములు. అవి యయిదు. ఇంద్రియములు విషయములను సమీపించుటలు గతులు. అవియు నైదె. ఇంద్రియముల యాకారములు ఆకృతులు. అవి యయిదు. భూమి నీరు తేజస్సు గాలి ఆకాశము అను భూతజాతులు అయిదు.

మూ. భూతగుణ విశేషోపలబ్ధే స్తాదాత్మ్యం.

63. సూ పృథివ్యాది భూతములయొక్క గుణవిశేషములు ఇంద్రియము లందుఁ గనిపించుటవలన ఇంద్రియములు. భూత ప్రకృతికములు.

పృథివీ గుణమగు గంధము ముక్కునందు, జలగుణమగు రసము నాలుకయందు వాయుగుణమగు స్పర్శ చర్మమందు ఆకాశ గుణమగు శబ్దము చెవులందు తేజోగుణమగు రూపము కంటియందుఁ గనిపించుటవలన ముక్కు మొదలగు వానికి తదాత్మమైన పృథివ్యాది భూతములు ప్రకృతులు. కాని వానికి అవ్యక్తము ప్రకృతి గాదని భావము.

ఇది ఇంద్రియ నానాత్వప్రకరణము

—:(o):—

మూ. గంధ రసరూప స్పర్శ శబ్దానాం స్పర్శ పర్యంతాః పృథివ్యాః

64 సూ. గంధ రస రూప స్పర్శ శబ్దములలో గంధరస రూప స్పర్శములు పృథివీ గుణములు.

మూ అప్తేజో వాయూనాం పూర్వ పూర్వ మపోహ్య కాశ స్యోత్తరః

65. సూ. జలమునకు రస రూప స్పర్శలును, తేజస్సునకు రూప స్పర్శములును, వాయువునకు స్పర్శయు ఆకాశమునకు శబ్దమును గుణములు.

మూ. న సర్వ గుణానుపలబ్ధేః

66. సూ. ఆయా భూతములు ప్రకృతిగాఁ గల యింద్రియములకుఁ బైని జెప్పఁబడిన గుణములన్నియుఁ గనిపింపకపోవుట వలన ఈ గుణనియమము సరియైనది గాదు.

పృథివి యొక్క యింద్రియమగు ముక్కుచేఁ బృథివీ గుణములైన రస రూప స్పర్శములన్నియు గ్రహింపఁబడుటలేదు. గంధము మాత్రము గ్రహింపఁబడుచున్నది. జలముయొక్క యింద్రియమగు నాలుక రసమును దక్క మిగిలిన రూపస్పర్శలను గ్రహించుటలేదు. ఇట్లే మిగిలినవియు. దీనినిబట్టి పైనియమము సరియైనది గాదని ఆక్షేపణము.

మూ. ఏకైకస్యైవోత్తరోత్తర గుణ సద్భావా దుత్తరోత్తరాణాం తదనుపలబ్ధిః

67. సూ. గంధాది గుణము లొక్కొక్కటే వరుసగా పృథివ్యాది భూతముల గుణములై యుండుటవలనఁ దరువాతివగు జలాదుల యొక్క రసాదిగుణములను ముక్కు మొదలగునవి గ్రహింపవు.

ఆక్షేపకుఁడు ఇందు స్వమతమును నిరూపించుచున్నాఁడు.

గంధము పృథివిగుణము గాన పృథివికి ఇంద్రియమైన ముక్కు గంధమునే గాని జలతేజో వాయు గుణములగు రస రూప స్పర్శలను గ్రహింపదు. ఇట్లే కన్ను చర్మముల విషయములో గ్రహింపవలయును.

మూ విష్టం హ్యపరం పరేణ.

68. సూ. పృథివ్యాదులు జలాదులతోఁ గలిసియుండుటవలనఁ బృథివ్యాదుల యందున్న జలాదులతో నాలుకకు సంయోగము గలుగఁగా రసాది గ్రహణము గలుగుచున్నది.

ఆక్షేపకుడు స్వమతములోఁ బృథివ్యాదులందు రసగ్రహణ మెట్లు గలుగుచున్నదో దానినిగూర్చి తన గుణనియమమును ఇందు నిరూపించెను. విష్టం=సంబంధించినది.

మూ. న పార్థివాప్యయోః ప్రత్యక్షత్వాత్.

69. సూ. పృథివియందును జలమందును రూపమును స్పర్శమును ప్రత్యమగుచుండుటవలన పైమూఁడు సూత్రములందుఁ జెప్పినది యుక్తముగాదు.

పృథివీ ద్రవ్యములు జలద్రవ్యములు ప్రత్యక్షమగుటనుబట్టి " పృథివ్యాదులు జలాదులతో కలయిక వలన రసాదులైన అనేక గుణములు గ్రహింపఁబడుచున్నవి". రూపము లేకపోవుటవలన తైజసద్రవ్యములే గాని పార్థివ ద్రవ్యములును జలద్రవ్యములును బ్రత్యక్షము గావు అనరాదు " అని భావము. తైజస ద్రవ్యములు గలియుటచే పృథివీ జలద్రవ్యములు ప్రత్యక్షమగుచున్నవి అన్నచో అప్పుడు వాయువు గూడఁ బ్రత్యక్షము గావలసియుండును గదా. అందుచే పృథివికి గంధ రసరూప స్పర్శములు, జలమునకు రస రూప స్పర్శములు తేజస్సునకు రూపస్పర్శములు గలుగునని చెప్పుట న్యాయమని భావము.

మూ. పూర్వ పూర్వ గుణోత్కర్షాత్ తత్తత్ప్రధానం.

70. సూ. గంధాదిగుణములు ఉత్కర్షముగా నుండుటవలన ముక్కు మొదలయిన యింద్రియములకు ఆ గంధాదిగుణములు ప్రధానముగా గోచరమగును.

మూ. తదవ్యవస్థానంతు భూయస్త్వాత్.

71. సూ. గంధాదిగుణముల యాధిక్యమునుబట్టి వానిని గ్రహించు ముక్కు మొదలగు వానికి ఇంద్రియత్వ వ్యవస్థ కలుగును.

పృథివి నాల్గుగుణములు గలిగినదయ్యును జలాదులతోఁ గలియని పృథివికి గంధము ఎక్కువగా నుండుటవలన వానిని గ్రహించు నింద్రియములకు ఇంద్రియము లనువ్యవహారము గలుగుచున్నదని భావము.

మూ. సగుణానా మింద్రియభావాత్.

72. సూ. గంధాదిగుణములతోఁ గూడిన ముక్కు మొదలైనవే యింద్రియములుగా నుండుటవలన అవి బాహ్యములైన గంధాదిగుణములనే గ్రహించును గాని తమ గుణములను వేఱుగా గ్రహింపవు.

ముక్కు మొదలగునవి తమ గుణములనుబట్టియే యింద్రియములైనవి. ముక్కు మొదలగునవి తమ గంధాదిగుణముల సాహాయ్యమునుబట్టియె బాహ్యగంధాదులను గ్రహించును తమకు వేఱుగా సహకారులు లేనందువలన తమ గంధాదులను గ్రహించుటలేదు. ఇట్లే మిగిలిన యింద్రియములనుగూర్చి తెలియవలెను.

మూ. తేనైవ తస్యాఽగ్రహణాచ్చ.

73. సూ. ఇంద్రియము తనచేతనె దన్ను గ్రహించుట కుదురకపోవుట వలనను ఇంద్రియములు తమ గుణములను వేఱుగా గ్రహింపవు.

కన్ను బాహ్యద్రవ్యములనే గాని తన్ను గ్రహింపదు. కనుక రూపగంధాదులు సిద్ధించుటలో అప్రత్యక్షముగా నుండుటవలన అవి పైకిఁ గనిపించక లోన నున్నవని గ్రహింపవలెను.

మూ న శబ్దగుణోపలబ్ధేః.

74. సూ చెవిచేఁ దన గుణమగు శబ్దము తెలియఁబడుచుండుటవలన. "ఇంద్రియములు తమ గుణములను వేఱుగా గ్రహింపవు" అనరాదు.

రంధ్రములోని యాకాశమె చెవి యనఁబడును. కాన ఆకాశమె తన గుణమయిన శబ్దమును గ్రహించుచున్నదని యాక్షేపణము.

మూ. తదుపలబ్ధి రితరేతర ద్రవ్యగుణ వైధర్మ్యాత్.

75. సూ. ద్రవ్యగుణములగు రూపము శబ్దము మొదలగునవి ఒకదానికొకటి విరుద్ధధర్మములుగల వగుటవలన శబ్దము ఉపలబ్ధమగుచున్నదేగాని నేత్రరూపాదులు ఉపలబ్ధమగుటలేదు.

శబ్దము చెవిని జేరునట్లు రూపాదులు నేత్రాదులను జేరవు. శబ్దమును రూపాదులును విరుద్ధధర్మములు గలవి. కావున శబ్దమునుబట్టి రూపాదులందు ఆక్షేపింపరాదని భావము. గంధాదులనుబట్టి ముక్కు మొదలైనవి ప్రవర్తించును. చెవి శబ్దగుణమును అపేక్షింపకయే యింద్రియమగునని తెలియునది.

ఇది

ఆత్మాది ప్రమేయ చతుష్టయ పరీక్షణము

మూఁడవ యధ్యాయములోని మొదటి యాహ్నికము

—:(०):—

# న్యాయ మీమాంసాదర్శనము

## తృతీయాధ్యాయము

### రెండవ యాహ్నికము

మూ. కర్మాకాశసాధర్మ్యాత్ సంశయః

1. సూ. అనిత్యమై స్పర్శలేని కర్మతోను, నిత్యమై స్పర్శలేని యాకాశముతోను స్పర్శలేని బుద్ధి సమానధర్మము గలదగుటవలనఁ గర్మనుబట్టి యనిత్యమా యాకాశమునుబట్టి నిత్యమా అని బుద్ధియందు సంశయము గలుగుచున్నది.

మూ. విషయప్రత్యభిజ్ఞానాత్.

2. సూ. విషయములను గూర్చి ప్రత్యభిజ్ఞానము గలుగుటవలన బుద్ధి నిత్యమైనది.

ఇదివఱకుఁ జూచిన ఘటమును స్పృశించుచున్నాను. అను ప్రత్యభిజ్ఞానము వలనఁ బూర్వజ్ఞానము నిలిచియున్నదని తెలియుచున్నది కాన బుద్ధి నిత్యమైనదని భావము. ఇది సాంఖ్యమతము.

మూ. సాధ్యసమత్వా దహేతుః.

3. సూ. సాధ్యముతో సమానముగ నుండుటవలన ఈ హేతువు సరియైనది గాదు.

"బుద్ధి విషయములను గుర్తుపట్టునది గాన నిత్యము" అను దానిలో విషయములను గుర్తుపట్టునది గాన అను హేతువు సాధ్యమగు నిత్యత్వముతో సమానముగ నున్నది. హేతువు ఎప్పుడును నిశ్చితమై యుండవలయును. నిశ్చితమైన హేతువునుబట్టి సాధ్యము సాధింపఁబడును. ప్రత్యభిజ్ఞానము చేతనమైన యాత్మధర్మము గాని బుద్ధిధర్మము గాదు గాన నిత్యత్వముతోపాటు బుద్ధికి ప్రత్యభిజ్ఞానగుణమును ఉన్నట్లు గూడ సాధింపవలసియున్నది. కాన

సాధ్యసమము. హేతువు తానే సాధింపఁదగిన స్థితిలో నుండి యుంకొక దానిని సాధింపఁజాలదు అందుచే ఈ హేతువు హేత్వాభాసముగాని సరియైనది గాదు.

మూ. న, యుగపదగ్రహణాత్.

4. సూ. ఒక్కసారిగా బుద్ధి యన్ని విషయములను గ్రహింపక పోవుటవలన ఆ బుద్ధికిని బుద్ధి వృత్తులకును అభేదము లేదు.

ప్రత్యభిజ్ఞనుబట్టి బుద్ధి నిలుకడగా నుండును ఆ బుద్ధినుండి వృత్తులు అనఁగా జ్ఞానములు బయలుదేఱును ఆ వృత్తులకును ఆ వృత్తులుగల బుద్ధికిని నిప్పునకు నెరసులకువలె అభేదము అని సాంఖ్యుల మతము యొక్క ఖండన మిది. వృత్తి వృత్తిమంతములకు అభేదము చెప్పినపుడు రెండు లేవు గాన ఒకదాని నొకటి గుర్తుపట్టుట (ప్రత్యభిజ్ఞానము) గుదురదు. అందుచే "ప్రత్యభిజ్ఞానమును బట్టి బుద్ధి నిత్యము" అని నిత్యత్వసాధనము వీలుపడదు " అను నాక్షేపణకు ఇది సమాధానము. ఏలయనఁగా. వృత్తి వృత్తిమంతములకు భేదము సిద్ధము. అందుచే ప్రత్యభిజ్ఞానమును దానినిబట్టి నిత్యమును గుదురునని సమాధానము.

మూ. అప్రత్యభిజ్ఞానే చ వినాశ ప్రసంగః

5 సూ. అనుభవించిన విషయమును గుర్తింపనపుడును అపుడు బుద్ధి నశించినదని చెప్పవలసి వచ్చును గాన బుద్ధికిని బుద్ధి వృతులకును అభేదము లేదు.

బుద్ధియు బుద్ధినుండి బయలుదేఱు చాక్షుషాది జ్ఞానవృత్తులును అభిన్నము లన్నచో ఇదివఱకు ఒక విషయమును జూచిన నేత్రాదులు మఱికొంత కాలమునకు ఆ విషయమును గుర్తింపనిచో ఆ గుర్తింపని వృత్తినిబట్టి గుర్తించుటకు సాధనమైన బుద్ధి లేదనవలసివచ్చును. అట్లు బుద్ధి లేకపోవుటలేదు. కాన భిన్నములని భావము.

మూ. క్రమవృత్తిత్వా దయుగపద్గ్రహణం.

6. సూ. మనస్సు అణువు గాన అది క్రమముగా ఇంద్రియములతోఁ గలిసి పనిచేయుటవలన జ్ఞానములు క్రమముగనే గాని యొక్కసారిగఁ గలుగవు.

మూ. అప్రత్యభిజ్ఞానం విషయాంతర వ్యాసంగాత్.

7. సూ. మనస్సు ఇతర విషయమందు వ్యాసక్తమై యుండుటవలన ఆ వ్యాసక్తవిషయమునే గాని తదితర విషయములను గుర్తించుటలేదు.

దానినిబట్టియు వృత్తి వృత్తిమంతములకు అభేదము లేదని భావము.

మూ. న, గత్యభావాత్.

8. సూ. మనస్సు వ్యాపకమైనది విషయములు దాని దగ్గరకేవచ్చును గాని అది విషయముల దగ్గఱకుఁ బోదు అందుచే దానికి గమనము లేకపోవుట వలన మనస్సునకు క్రమముగా నింద్రియములతో సంబంధము గలుగు అనరాదు.

మూ. స్ఫటికాన్యత్వాభిమానవత్తదన్యత్వాభిమానః.

9. సూ. మంకెన పువ్వు మొదలగు వానిదగ్గఱ నున్న స్ఫటికము ఒక్కటేయైనను వేఱుగా ఎఱుపు నలుపు పసుపు మొదలైన రంగులు గలిగినట్లు తోఁచిన రీతిఁగా వృత్తులకంటె అభిన్నమైనను మనస్సు ఆయా వృత్తుల సన్నికర్ష మున అది వేఱుగా నున్నట్లు తోఁచుచున్నది.

సూ. వేఱనితోఁప జేయు భ్రమను సాధించు హేతువు లేకపోవుటవలనఁ బైని జెప్పఁబడినది యుక్తము గాదు.

ఇది ప్రత్యేక సూత్రము గాదు భాష్యకారుని పంక్తియని కొందఱందురు. ఇక్కడ స్ఫటికము యొక్క దృష్టాంతము సరియైనదిగాదు. గంధాది గుణము లతోపాటు గంధాది జ్ఞానములుగూడ వేఱువేఱుగా నున్నది. అందుచేత ఇక్కడ స్ఫటిక దృష్టాంమునుబట్టి వృత్తివృత్తిమంతములకు అభేదము చెప్పరాదు. క్రమముగ ఇంద్రియ విషయములందు జ్ఞానములు గలుగుచున్నది పోవుచున్నది. దీనినిబట్టి గంధాదులకంటె మనస్సు భిన్నమైనట్లు గంధాదిజ్ఞానములు గూడ భిన్నములని భావము.

ఇది బుద్ధ్యనిత్యతాప్రకరణము

—:(o):—

మూ. స్ఫటికేఽప్యపరాపరోత్పత్తేః క్షణికత్వాద్వ్యక్తీనా మహేతుః.

10. సూ. పదార్థములు క్షణికములగుటవలన స్ఫటికమందును వేఱు వేఱు స్ఫటికములు పుట్టును గాన స్ఫటికమువలె మనస్సు ఒకటే యయినను అనేకముగాఁ దోఁచుచున్నదను హేతువు సరియైనది గాదు.

శరీరము ఉపచయాపచయములను బొందుచుండుటవలనఁ బదార్థములు క్షణికమని క్షణికవాదుల యాశయము. పూర్వవస్తువు నశించుచున్నది క్రొత్త వస్తువు పుట్టుచున్నది. కానఁ బూర్వవస్తువునే యిప్పుడు చూచుచుండుట సందర్భింపదని భావము.

మూ॥ నియమహేత్వ భావా ద్యథాదర్శన మభ్యనుజ్ఞా.

11. సూ. అన్ని పదార్థములు శరీరమువలె ఉపచయాపచయములను బొందుచున్నవను నియమమును తెలుపు హేతువు లేకపోవుటవలన అన్నియు క్షణికము లనరాదు మఱియింక ఉపచయాపచయములు గనిపించిన శరీరాదు లందు క్షణికత్వమున్నదని అవి కనిపింపని రాయి స్ఫటికము మొదలగు వానిలో క్షణికత్వము లేదని కల్పింపఁబడవలయును.

మూ. నోత్పత్తి వినాకరణోపలబ్ధేః.

12. సూ. క్షణికమైన వస్తువులందు ఉత్పత్తి వినాశములు గన్పించుట వలనను స్ఫటికమందు అవి కనిపింపకపోవుటవల్లను స్ఫటికాదులకు క్షణికత్వము చెప్పరాదు

మూ. క్షీరవినాశే కారణానుపలబ్ధిత్ దధ్యుత్పత్తి వచ్చ తదుత్పత్తిః.

13. సూ. పాలు పెరుగైనప్పుడు పాలు నశించుటకును పెరుగు పుట్టుటకును గారణము ఉపలబ్ధము గానట్లు స్ఫటికము విషయములోఁ గూడ పూర్వస్ఫటికము వినాశమగుటకును ఉత్తరస్ఫటికము పుట్టుటకును గారణము గనిపించుటలేదు. కాన అన్నియు క్షణికములె.

మూ. లింగతో గ్రహణాన్నానుపలబ్ధిః.

14. సూ. ప్రత్యక్షముగాఁ గనిపింపక పోయినను అనుమాన ప్రమాణమునుబట్టి పాలు నశించుచున్నవని పెరుగు పుట్టుచున్నదని యూహింపఁ

బడుచుండుటవలన "స్ఫటికమునకు ఉత్పత్తి నాశములు గనిపించుటలేదు" అనరాదు.

మూ. న పయసః పరిణామగుణాంతర ప్రాదుర్భావాత్.

15. సూ. పాలు మార్పుచెంది పెరుగు గుణములను బొందుచున్నవే గాని పాలకు నాశముగాని పెరుగునకుఁ బుట్టుకగాని లేదు.

మూ. వ్యూహాంతరాత్ ద్రవ్యాంతరోత్పత్తి దర్శనం పూర్వ ద్రవ్యనివృత్తే రనుమానం.

16. సూ. భిన్న భిన్న రచనలనుబట్టి భిన్న భిన్న వస్తువులు పుట్టినట్లు కనిపించుటచేఁ బూర్వ వస్తువులు నివర్తించినవని యనమానింపబడును.

మూ. క్వచిద్వినాశ కారణోపలబ్ధేః క్వచిచ్చోపలబ్ధే రనేకాంతః.

17. సూ. పాలు పెరుగు మొదలగుచోట్ల వినాశోత్పత్తులకుఁ గారణము గనిపింపకపోవుటవలనను ఘటాదులందు వినాశోత్పత్తి కారణములు గనిపించుట వలనను పైనిజెప్పిన కారణము అనేకాంతమైనది.

అందుచే పాలు పెరుగులకు వినాశోత్పత్తులను జూచి వాని కారణమును ఊహించినట్లు స్ఫటికములకు వినాశోత్పత్తుల కారణము నూహింపవలయును. ఒక బుద్ధి నశించుచు వేఱొక బుద్ధి పుట్టుచుండుటచే బుద్ధి యనిత్యమైనదని భావము. బుద్ధి యాత్మయొక్క కార్యము గాన బుద్ధియే యనిత్యము. బుద్ధికిఁ గారణమైన యాత్మ అనిత్యము గాదు అని తెలియునది. వాస్తమునకు పులుపు పదార్థముల సంయోగమునుబట్టి పాలు నశించుట పెరుగు అగుట అగుచున్నది కాన పాలు పెరుగులలో వినాశోత్పత్తి కారణములు లేవనరాదని గ్రహించునది.

ఇది క్షణభంగప్రకరణము

—:(౦):—

మూ. నేంద్రియార్థయో స్తద్వినాశేఽపి జ్ఞానావస్థానాత్.

18. సూ. ఇంద్రియములు పదార్థములు నశించినను వానికి సంబంధించిన స్మరణజ్ఞానము నిలిచియుండుటవలన బుద్ధి యనునది ఇంద్రియముల గుణము గాని పదార్థముల గుణము గాని కాదు.

దీని జూచితిని అను ననుభవము ఆ చూచిన బుద్ధి నశించినచో ఉండదు. ఒకటి చూచిన దానిని ఇంకొకటి స్మరింపదుగదా. కాన బుద్ధి ఇంద్రియార్థముల గుణము గాదని భావము.

మూ. యుగపత్ జ్ఞేయానుపలబ్ధేశ్చ న మనసః.

19. సూ. తెలిసికొనఁదగిన శబ్దస్పర్శాది విషయములు ఒక్కమాటుగా తెలియఁబడకపోవుటవలన బుద్ధి మనస్సు యొక్క గుణముగూడఁ గాదు.

బుద్ధి మనస్సు యొక్క గుణమని చెప్పినచో బుద్ధిసాధనమును మనస్సు కర్తయును గావలసి వచ్చును. మనస్సు కర్తయైనప్పుడు బుద్ధినిబట్టి సర్వ విషయములు ఒక్కసారిగాఁ దెలియఁబడవలసి వచ్చును. అట్లు తెలియఁబడుట లేదు. దీనినిబట్టి బుద్ధి మనస్సు గుణము గాదని భావము. మఱియు ఒక్కసారిగా అన్ని గుణములు తెలియఁబడకపోవుటయె మనస్సు ఉన్నదనుటకు సూచకము.

మూ. తదాత్మ గుణత్వేఽపి తుల్యం.

20. సూ. బుద్ధి యాత్మయొక్క గుణమని చెప్పినను ఆత్మవ్యాపకము గాన అన్ని యింద్రియములలోఁ గలిసియుండుటవలన ఒక్కమాటుగా జ్ఞానము గలుగవలసివచ్చును గాన మనస్సుయొక్క గుణమని చెప్పినపుడు పట్టిన దోషమే యిక్కడను బట్టును.

మూ. ఇంద్రియై ర్మనసః సన్నికర్షాభావా త్తదనుత్పత్తిః.

21. సూ. ఒకమాటుగా వివిధేంద్రియములతోఁ గూడ మనస్సునకు సంనికర్షము లేకపోవుటవలన ఒక్కమాటు సర్వవిషయముల జ్ఞానము కలుగుట లేదు.

మూ. నోత్పత్తి కారణానపదేశాత్.

22. సూ. ఇంద్రియార్థ సంనికర్షము జ్ఞానమునకుఁ గారణమని చెప్పినట్లుగా బుద్ధి యుత్పత్తికి ఆత్మను గారణముగాఁ జెప్పకపోవుటవల్ల బుద్ధి యాత్మగుణము గాదు.

ఆత్మ మనస్సంయోగమె బుద్ధికిఁ గారణమన్నచో జ్ఞానము ఎల్లప్పుడును ఉండవలసి వచ్చునని భావము.

మూ. వినాశకారణానుపలబ్ధే శ్చావస్థానేతన్నిత్యత్వ ప్రసంగః.

23. సూ. బుద్ధి యాత్మగుణమన్నచో బుద్ధి వినాశమునకుఁ గారణము కనిపింపకపోవుటవలన బుద్ధి నిలచియుండఁగా అది నిత్యము గావలసివచ్చును.

ఏదైన నొకదానికి నాశము గలుగునన్నచో విరుద్ధమైన వస్తువైన నుండవలయును. లేక దానికాధారమైనదైన నశింపవలయును. దీనికి విరుద వస్తువు కనిపింపదు. దానికాధారమైన యాత్మ నిత్యము. కాన అది నశింపదు కాన బుద్ధినిత్యము గావలసి వచ్చునని యాక్షేపణము.

మూ. అనిత్యత్వగ్రహణాత్ బుద్ధేర్బుద్ధ్యంతరా ద్వినాశః శబ్దవత్.

24. సూ. బుద్ధి యనిత్యమైనదని మన యనుభవమువల్లఁ దెలియుట వలనఁ దరువాతి శబ్దముచే మొదటి శబ్దమునకువలెఁ దరువాతి బుద్ధిచే మొదటి బుద్ధికి నాశము గలుగుచున్నది.

మూ జ్ఞానసమవేతాత్మ ప్రదేశ సన్నికర్షా న్మనసః స్మృత్యు త్పత్తే ర్న యుగపదుత్పత్తిః.

25. సూ. జ్ఞానసాధనమైన సంస్కారముగల యాత్మప్రదేశములతో వరుసగా సంనికర్షముగల మనస్సు నుండి స్మృతులు పుట్టుటవలన అవి యొక్క మాటుగాఁ బుట్టుటలేదు.

మూ. నాంతఃశరీరవృత్తిత్వా న్మనసః.

26. సూ. మనస్సు శరీరము లోపల నున్నదగుటవల్ల శరీరమునకు వెలుపల నున్న యాత్మప్రదేశములతో దానికి సంయోగము గుదురదు.

ఇది పూర్వపక్షసూత్రము.

మూ. సాధ్యత్వాదహేతుః.

27. సూ మనస్సు శరీరములో నున్నట్లు స్థిరపడలేదు అదే సాధింపఁదగినది గానున్నది కాన ఆ సాధింపఁదగిన యనిశ్చిత హేతువునుబట్టి శరీరములోని మనస్సు శరీరము వెలుపలి యాత్మప్రదేశములతోఁ గలియదు అని చెప్పరాదు.

మూ. స్మరతః శరీరధారణోపపత్తే రప్రతిషేధః.

28 సూ. అనుభవించిన విషయములను స్మరించువాడు శరీరమును ధరించియుండుటవలన ఆ స్మరించు మనస్సు శరీరములో నుండుట సిద్ధమేగాని సాధ్యము గాదు కాన పైనిజెప్పిన ప్రతిషేధము యుక్తము గాదు.

అట్లు గానిచో మనస్సు బహిర్గతమైయున్నపుడు శరీరమందు ఆత్మ మనస్సంయోగముండదు ఆది లేనిచో యత్నమును శరీరధారణమును లేకపో వలసివచ్చును. కాన మనస్సు శరీరములో నున్నది. అది బాహ్యమందున్న యాత్మ ప్రదేశములతోఁ గలియదని సమాధానము. ఇది సిద్ధాంతసూత్రము.

మూ. న తదాశుగతిత్వా న్మనసః.

29. సూ. మనస్సు శీఘ్రగతి గలదై యాత్మప్రదేశములకుఁ బోయి విషయములను గ్రహించి శరీరములోనికి మరలఁ బ్రవేశించుటవలన శరీరమును ధరించుట కుదురదని చెప్పరాదు.

మూ. న స్మరణకాలానియమాత్.

30. సూ. విషయములను స్మరించుటలోఁ గాల నియమము లేకపోవుట వలన మనస్సు పైకిఁబోయి మరల శీఘ్రముగా శరీరమునఁ బ్రవేశించు ననరాదు.

ఆ స్మరణలో ఒకప్పుడు శీఘ్రముగాను ఒకప్పుడు ఆలస్యముగాను ప్రయత్నము జరగుచుండును. కాన ఆ సమయములో శరీరమును ధరించుట సంభవింపదని భావము.

మూ. ఆత్మప్రేరణ యదృచ్ఛాజ్ఞతాభిశ్చ న సంయోగ విశేషః.

31. సూ. ఆత్మయొక్క ప్రేరణచేఁగాని హఠాత్తుగాఁ గాని జ్ఞానమునకుఁ గర్తయగుటచేఁగాని మనస్సునకు శరీరము వెలుపలి విషయములతో సంయోగ విశేషము గలుగదు.

ఆత్మప్రేరణ స్మరణీయవస్తు జ్ఞానపూర్వకమైనదగుటచే అంతకుముందే స్మరణ కలుగును. అపుడు వస్తువు స్మరింపఁబడినదే యయినది. ఇంక ఆత్మ స్మరింపమని ప్రేరేపించుట అపుడు వెళ్లి స్మరించుట యెట్లు? మనస్సు స్మరింపఁ

గోరి స్మరించును. హఠాత్తుగా నెప్పుడును స్మరింపదు. మనస్సునకు జ్ఞానము లేదు. కాన జ్ఞానమునకుఁ గర్తయు గాదని భావము.

మూ. వ్యాసక్తమనసః పాదవ్యథనేన సంయోగవిశేషేణ సమానః.

32. సూ. నృత్యాది విషయాంతరములచే వ్యాసక్తమైన మనస్సునకు ముళ్లు మొదలగు వానిచే కాళ్లకు నొప్పి గలిగినపుడు మనస్సునకు ఆ నొప్పితో సంబంధము గలిగినట్లు ఆత్మ మనస్సంయోగము గలుగును.

మూ. ప్రణిధాన లింగాదిజ్ఞానానామయుగప ద్భావా దయుగపత్స్మరణం.

33. సూ. చిత్తైకాగ్రత లింగజ్ఞానాదులు ఒక్కమాఱుగాఁ గలుగక పోవుటవలన నొక్కమాటుగ స్మరణము గలుగుటలేదు.

లింగజ్ఞానములు వస్తువును ఉద్బోధించు జ్ఞానములు. ఇవి యనంతమగుట వలన ఒకమాఱు తత్స్మృతి గలుగదని భావము.

మూ. ప్రాతిభవత్తు ప్రణిధానాద్యనపేక్షే స్మార్తే యౌగపద్యప్రసంగః.

34. సూ. ప్రతిభ వల్లఁ గలుగు జ్ఞానమువలెఁ జిత్తైకాగ్రత మొదలగు వాని యపేక్ష లేకయె స్మరణజ్ఞానము కలుగునన్నచో ఒక్కమాటుగా ఆ స్మరణలన్నియుఁ గలుగవలసివచ్చును.

అప్పటికప్పుడు నవనవోన్మేషముగాఁ దోచు బుద్ధి ప్రతిభ. ప్రతిభా జ్ఞానము పురుషుల కర్మ విశేషమువలనఁ గలుగునని తెలియునది.

మూ. జ్ఞస్యేచ్ఛా ద్వేషనిమిత్తత్వాదారంభ నివృత్త్యోః.

35. సూ. జ్ఞానవంతుని ప్రవృత్తి నివృత్తులకు ఇచ్ఛాద్వేషములు నిమిత్తములగుటవలన వానితోపాటు అందు జ్ఞానము గూడ హేతువె యగును గాన అవి యన్నియు ఆత్మ గుణములె.

మూ. తల్లింగత్వా దిచ్ఛాద్వేషయోః పార్థివాద్యేష్వ ప్రతిషేధః.

36. సూ ఇచ్ఛాద్వేషములకుఁ బ్రవృత్తి నివృత్తులు గారణమగుటవలనఁ బార్థివాది శరీరములందు జ్ఞానాదులు లేవనరాదు.

ఆ ప్రవృత్తి నివృత్తులకు చేష్టలు కారణములు. చేష్టలకు శరీరము ప్రత్యక్షకారణమని భావము. పార్థివాది పరమాణుపుంజమె కారణ మనుచార్వాకుని మతఖండన మిది.

మూ. పరశ్వాది ష్వారంభ నివృత్తి దర్శనాత్.

37. సూ. పార్థివాది శరీరములందు జ్ఞానాదులు గలవన్నచో గొడ్డలి మొదలగు వానియందును ప్రవృత్తి నివృత్తులు గనిపించుటవలన వానియందును జ్ఞానము గలదనవలసివచ్చును.

మూ. నియమానియమౌతు తద్విశేషకౌ.

38. సూ. చేతనములకు ఇచ్ఛాద్వేషములనుబట్టి గలిగిన ప్రవృత్తి నివృత్తులు నియమముగా నుండుటనుబట్టియు, అచేతనములకు ఇచ్ఛాద్వేషము లుండవు గాన ప్రవృత్తి నివృత్తులు నియమముగా నుండకపోవుటనుబట్టియుఁ జేతనాచేతనములు రెండును భిన్నములె.

జ్ఞానేచ్ఛాక్రియాదులు చేతనధర్మములు గానఁ జేతనయుక్తమైన శరీరమునందు అవి కలుగును. గొడ్డలి మొదలగునవి యచేతనములు గానఁ జేతనముల ప్రయత్నమునుబట్టియే గాని వానికి స్వయముగాఁ బ్రవృత్తి నివృత్తులు గలుగవని భావము.

మూ. యథోక్త హేతుత్వాత్పారతంత్ర్యా దకృతాభ్యాగమాచ్చ న మనసః.

39. సూ. ఇదివరకుఁ జెప్పఁబడిన హేతువులు గలదగుటవలనను, పరాధీనమైనదగుట వలనను, తానుజేసిన కర్మనుండి తనకు భోగము లేకపోవుటవలనను మనస్సునకు ఇచ్ఛాదులు లేవు.

మనస్సు ఆత్మకు అధీనమైనది. సుఖదుఃఖాది భోగములు ఆత్మకే గాని మనస్సుకు లేవు. కాన సుఖదుఃఖాదులకుఁ గారణమైన ఇచ్ఛాదులును మనస్సుకు లేవని భావము,

మూ. పరిశేషాద్యథోక్త హేతూపపత్తేశ్చ.

40. సూ. భూతములకుఁ గాని యింద్రియములకుఁ గాని మనస్సునకుఁ గాని జ్ఞానేచ్ఛాదులు లేవని చెప్పుటచే వానిలో ఆత్మ యొకటే యింక మిగిలిన దగుటవలనను ఇదివఱలోఁ జెప్పఁబడిన హేతువులు ఉపపన్నములగుటవలనను జ్ఞానేచ్ఛాదులు ఆత్మ యొక్క గుణములు।

మూ. స్మరణం త్వాత్మనోజ్ఞస్వాభావ్యాత్.

41. సూ. ఆత్మయె తెలిసికొను స్వభావము గలదగుటవలన ఆ తెలిసికొనిన వానిని స్మరించు స్మృతియును ఆత్మయొక్క గుణమె.

మూ. ప్రణిధాన నిబంధాభ్యాస లింగ లక్షణసాదృశ్య పరిగ్రహా శ్రయాశ్రిత సంబం ధానంతర్య వియో గైక కార్య విరోధాతిశయ ప్రాప్తి వ్యవధాన సుఖ దుఃఖేచ్ఛా ద్వేష భయార్థిత్వ క్రియారాగ ధర్మా ధర్మనిమిత్తేభ్యః.

42. సూ. ప్రణిధానము నిబంధము, అభ్యాసము, లింగము లక్షణము సాదృశ్యము పరిగ్రహము ఆశ్రయాశ్రితములు సంబంధము ఆనంతర్యము వియోగము ఏక కార్యము విరోధము అతిశయము ప్రాప్తి వ్యవధానము సుఖ దుఃఖములు ఇచ్ఛాద్వేషములు భయము అర్థిత్వము క్రియలు రాగము ధర్మాధర్మ ములు అనెడి నిమిత్తములనుబట్టి స్మరణము కలుగును.

ప్రణిధానము=చిత్తైకాగ్రత. నిబంధము=ఆనుపూర్విగా ఒక విషయము నందు అర్థములను గూర్చుట. ఉదా.— ప్రమాణములచేఁ బ్రమేయాదులను స్మరించుట. అభ్యాసము=సమాన విషయముగల జ్ఞానములను ఆవృత్తి చేయుట. లింగము=సాధ్యమునందు వ్యాపకముగా నుండు కారణము. ఉదా:- అగ్నికి ధూమాదులు. లక్షణము = అర్జునాదులకు కపిధ్వజాది లక్షణములు. సాదృశ్యము :- చిత్రగతమైన ప్రతిరూపాదులు దేవదత్తాదులను స్మరింపఁ జేయునవి పరిగ్రహము = స్వీకారము. తనచేత స్వామికిఁ గాని స్వామిచేఁ దాను గాని స్వీకరింపఁబడుట. ఆశ్రయాశ్రితములు = రాజు జనులకు ఆశ్రయము. రాజునకు జనులు ఆశ్రితులు. సంబంధము = గురుశిష్యాది సంబంధము. ఆనంత ర్యము = చేయఁదగిన వస్తువులందున్న ముందువెనుకలు. వియోగము = భార్యా పుత్రాది వియోగము. ఏక కార్యము = సహాధ్యాయులు పరస్పరము స్మరింపఁ జేయుదురు. విరోధము :_పాము ముంగిస పిల్లి యెలుక మొ. అతిశయము =

సంస్కారాతిశయము. ఉపనయనాది సంస్కారములు ఆచార్యాదులకు స్మారకములు. ప్రాప్తి = ధనాది ప్రాప్తి దాతను స్మరింపఁజేయును. వ్యవధానము = ఆవరణము. ఖడ్గాదులకుఁ గోశాదులు స్మారకములు. సుఖదుఃఖములు. సుఖమునుబట్టి దుఃఖమునకు దుఃఖమునుబట్టి సుఖమునకు స్మరణ కలుగును. ఇచ్ఛాద్వేషములు కోరఁబడునట్టియు ద్వేషింపఁబడునట్టి విషయములను స్మరింపఁజేయును. భయము మరణాది భయములకు స్మారకము. అర్థిత్వము = యాచకత్వము. ఇది దాతకు స్మారకము. క్రియలు రథాది క్రియలు రథకారాదులకు స్మారకములు. రాగము = ప్రీతి పుత్రాదులకు స్మారకము. ధర్మాధర్మములు = జన్మాంతరమందు అనుభవించిన సుఖదుఃఖ సాధనములకు స్మారకములు. శిష్య వ్యుత్పత్తికై యిట్లు విస్తరించి చెప్పఁబడినది.

ఇది

బుద్ధ్యాత్మ గుణత్మప్రకరణము

—: (౦) :—

మూ. కర్మానవస్థాయి గ్రహణాత్.

43. సూ. నిలుకడలేని కర్మలను గ్రహించుచుండుటవలన బుద్ధి యుత్పన్నాపవర్గియై యుండును.

ఉత్పన్నాపవర్గి=ఉత్పన్నమైన వెంటనే నాశము పొందునది.

మూ. అవ్యక్త గ్రహణ మనవస్థాయి త్వాద్విద్యుత్సంపాతే రూపావ్యక్త గ్రహణవత్.

44. సూ. బుద్ధి యుత్పన్నాపవర్గి యని యన్నచో బుద్ధి నిలుకడ లేనిదగుటవలన మెఱవు మెఱసినపుడు దానిచే రూపము స్ఫుటముగా గ్రహింపఁబడనట్లు బుద్ధిచే ద్రవ్యములు స్ఫుటముగాఁ జూడఁబడవు.

మూ. హేతూపాదానాత్ ప్రతిషేద్ధవ్యాభ్యనుజ్ఞా.

45. సూ. నిలుకడ లేని మెఱపు దృష్టాంతమునే హేతువుగా స్వీకరించుటవలనఁ బ్రతిషేధింపఁదగిన బుద్ధికి ఉత్పన్నాపవర్గిత్వము తిరిగి యంగీకరింప బడు చున్నట్లగుచున్నది.

మూ. ప్రదీపార్చిః సంతత్యాభి వ్యక్త గ్రహణవ త్తద్గ్రహణం.

46. సూ. నిలుకడలేని దీపకాంతుల ప్రవాహముచేత వస్తువులు స్పష్టముగా గ్రహింపఁబడుచున్నట్లు బుద్ధి నిలుకడ లేనిదైనను దానిచే ద్రవ్యములు స్పష్టముగా గ్రహింపఁబడుచున్నవి.

ఇది

బుద్ధి యొక్క యుత్పన్నాపవర్గిత్వ ప్రకరణము.

— (०) —

మూ. ద్రవ్యే స్వగుణ పరగుణోపలబ్ధేః సంశయః.

46. సూ. ద్రవ్యములందుఁ దమ సజాతిద్రవ్యగుణములే కాక యితర ద్రవ్యగుణములు గూడఁ గనిపించుటవలన బుద్ధ్యాదులు శరీరగుణములా కావా? యను సంశయము గలుగుచున్నది.

పృథివీ ద్రవ్యరూపమగు చందనాదులందు స్వగుణములగు రూపాదులును పరద్రవ్యములగు జలాదుల శైత్యాదిగుణములును గనిపించుచున్నవి. జలమందుఁ దన గుణమగు ద్రవ్యమును బరగుణమగు వేఁడిమియు గనిపించుచున్నది. శరీరమందుఁ దన గుణములగు రూపాదులును తేజోగుణములగు నుష్ణాదులును గనిపించుచున్నవి; మఱియుఁ దెల్లనివాఁడనగు నేను ఎఱుఁగుదును అని యనుభవమునుబట్టి బుద్ధ్యాదులును గనిపించుచున్నవి. కాన బుద్ధ్యాదులును శరీరగుణములగునా కాదా అని సంశయము గలుగుచున్నదని భావము.

మూ. యావచ్ఛరీరభావిత్వా ద్రూపాదీనాం.

48. సూ. శరీరమున్నంతవఱకు రూపాదులు మాత్రమె యుండి చైతన్యము గను పట్టకపోవుటవలన బుద్ధి శరీరగుణము గాదు.

రూపాదులు లేని శరీరము గనపట్టదు కాని బుద్ధిలేని శరీరము గనిపించుచున్నది. కావున బుద్ధ్యాదులు శరీరగుణములు గావు. బుద్ధ్యాదులు శరీరగుణములే యైనచో శరీరమున్నంతవఱకు రూపాదులవలె నుండవలయును గాదా. ద్రవ్యమున్నంతవఱకు ఉండకపోవుటవలన శబ్దమువలె బుద్ధ్యాదులు శరీర గుణములు గావని భావము.

మూ. పాకజగుణాంతరోత్పత్తేః

49. సూ. పరిణామాది పరిపాకంబువలనఁ గలుగు నితర గుణములు ఉత్పన్నమగుచుండుటచేత శరీరాదుల రూపములు మాఱుచున్నవేగాని పూర్తిగా నశించుటలేదు బుద్ధిమాత్రము పూర్తిగా నశించుచున్నది. రూపాదుల యుదాహరణమునుబట్టి బుద్ధి శరీరగుణముగాదు అనరాదు.

మామిడికాయ ముగ్గుటచే ఫలముగాఁ బరిణామము చెందుటకై పరిపాకముచేత దాని యాకు పచ్చరంగు ఎఱ్ఱనయగుచున్నది. ఇట్లే శరీరమున బాలయౌవనాదులలో రూపము మాఱుచున్నది. దానిబట్టి మారుచున్నది. కాన శరీరగుణముకాదు అనరాదు అని భావము.

మూ. ప్రతిద్వంద్విసిద్ధేః పాకజానా మప్రతిషేధః

50. సూ. పరిణామాది పరిపాకముచే మార్పుచెందు రూపాదులకుబదులు వానికి విరుద్ధములైన రూపాదులు సిద్ధించుటవలనఁ బూర్వరూపాదులు పూర్వద్రవ్యములున్నంతవఱకు నుండును ఆ పూర్వద్రవ్యములు పోయి క్రొత్త ద్రవ్యములు రాఁగాఁ గ్రొత్తరూపములు గలుగుచున్నవి. శరీరమున బుద్ధి యట్లుగాక పూర్తిగా నశించుచున్నదిగాన అది శరీరగుణముగాదు.

కాయగా నున్నంతవఱకు ఉన్న ద్రవ్యముతోపాటు దాని ఆకుపచ్చదనము ఉండును. కాయగానున్నప్పటి ద్రవ్యముపోయి పండుగా నున్నప్పటి ద్రవ్యము కలుగఁగా దానితోపాటే రంగును మారును. బుద్ధి యట్లుగాక పూర్తిగా నశించుచున్నది గాన శరీరగుణముగాదని భావము.

మూ. శరీర వ్యాపిత్వాత్

51. సూ. శరీరమందు వ్యాపించియుండుటవలనే బుద్ధిశరీరగుణముగాదు బుద్ధి ఆత్మగుణముగాన అంతట వ్యాపించియున్న యాత్మనుబట్టి యదియు శరీరగుణమన్నచో శరీరమువలె శరీరావయవములును బుద్ధులగును అప్పుడు బుద్ధులను అనేకముగా అంగీకరింపవలసివచ్చును. ప్రతియొక శరీరమందును బుద్ధి వేరుగానుండుటచే బుద్ధివలనఁగలుగు సుఖదుఃఖాదులు వేరువేరుగా నున్నట్లు ఒకే శరీరముతోఁగూడ శరీరావయములనుబట్టి బుద్ధులు వేరుగానజ్ఞానసుఖదుఃఖాద్యనుభవములును వేరువేరుగాఁ గలుగవలసివచ్చును. అట్లు గలుగుటలేదు కాన బుద్ధి శరీరగుణముగాదని భావము.

మూ. కేశనఖాదిష్వనుపలబ్ధేః

౬2. సూ. జుట్టుగోళ్లు మొదలగువానియందు బుద్ధికనిపింపక పోవుటవలన శరీరమందు బుద్ధి వ్యాపించియున్నదనరాదు.

మూ. త్వక్పర్యంతత్వాచ్ఛరీరస్య కేశనఖాదిష్వ ప్రసంగః.

౬3. సూ. త్వక్కు వరకు వ్యాపించియున్నదె శరీరముగానజుట్టు గోళ్లు మొదలగు వానియందు బుద్ధికి ప్రసంగములేదు.

మూ. శరీర గుణవైధర్మ్యాత్

౬4. సూ. శరీరగుణములకంటె విరుద్ధమైన ధర్మములు గలదగుట వలన బుద్ధి శరీరగుణముగాదు.

శరీరగుణములు అప్రత్యక్షములు ఇంద్రియ గ్రాహ్యములు అని రెండు విధములు. గురుత్వాదులు అప్రత్యక్షములు రూపాదులు ఇంద్రియ గ్రాహ్యములు బుద్ధి ఈ రెండిటికన్న విలక్షణమైనది. తెలియదగియుండుటవలన అప్రత్యక్షమును గాదు మనో విషయకమగుటవలన ఇంద్రియ గ్రాహ్యముగాదు, ఇట్లు శరీరగుణములకంటె బుద్ధి విరుద్ధధర్మముగాదు. బహిరింద్రియములకు గోచరము గాక మనస్సుచేఁ దెలియఁబడునది బుద్ధియని భావము.

మూ. న రూపాదీనా మితరేతర వైధర్మ్యాత్

౬5. సూ. రూపాదులు ఒకదానికొకటి విరుద్ధ ధర్మముగలవైనను శరీర గుణములైనట్లే రూపాదులకంటె విరుద్ధధర్మముగలదైనను బుద్ధి శరీరగుణమె ఇది పూర్వ పక్ష సూత్రము.

మూ. ఐంద్రియకత్వా ద్రూపాదీనా మప్రతిషేధః

౬6. సూ. రూపాదులు ఇంద్రియగ్రాహ్యములగుటవలన శరీరగుణత్వ ప్రతిషేధము తగదు.

రూపాదులు పరస్పర విరుద్ధ ధర్మములుగలవైనను శరీరగుణ ధర్మమగు నింద్రియ గ్రాహ్యత్వగుణము సరిపడుటచే రూపాదులు శరీరగుణములగుచున్నవి. బుద్ధి రూపాదులతో విరుద్ధధర్మముగలదై నంతమాత్రముచేత శరీరగుణత్వమును నిషేధించుటలేదు. బుద్ధికిఁ బైని జెప్పఁబడిన అప్రత్యక్షములు ఇంద్రియ గ్రాహ్య

ము లు అను ద్వివిధమగు శరీరగుణములు పట్టికపోవుటచేత దానికి శరీరత్వము నిషేధింపఁబడుచున్నది. కాన బుద్ధి యాత్మగుణమేగాని శరీరగుణము గాదని భావము.

ఇది

బుద్ధి శరీరగుణముగాదని తెలుపు ప్రకరణము.

—(౦)—

మూ. జ్ఞానయౌగ పద్యాదేకం మనః

57. సూ. ఇంద్రియ జన్యజ్ఞానములు ఒక్కమాటుగాగలుగక వరుసగాఁ గలుగుట వలన మనస్సు ఒక్కటె. కొన్నివేల తామరఱేకులు దొంతిగాఁబెట్టి సూది గ్రుచ్చినచో ఆ సూది ఒక ఱేకునుండి యొక ఱేకుకు గ్రుచ్చుకొని క్రమముగా అన్నిటిని గ్రుచ్చును. కాని యాగ్రుచ్చుటలో ఱేకులు అత్యల్పములుగానఁ గాలవ్యవధానము తెలియఁదగినంతగా నుండదు. అట్లే మనస్సు అన్ని యింద్రియములతోఁ గలియుచుఁ గ్రమముగా ఆ యాయింద్రియ జ్ఞానములను గలిగించుచున్నను గాలవ్యవధానము తెలియఁదగినంతగా నుండదు. ప్రతి శరీరమునందు అనేకేంద్రియములుండుటవలన ఆయయిదైన యింద్రియములనుబట్టి మనస్సును అయిదా లేక ఒకటా అను సందేహమును నివారించుటకే సూత్రము చెప్పఁబడినది. మనస్సును అనేకమైనచో ఇంద్రియ జ్ఞానములు ఒకసారిగా గలుగవలసివచ్చును అట్లు గలుగుటలేదు కాన మనస్సు ఒక్కటే అని భావము.

మూ. న యుగప దనేక క్రియోపలబ్ధేః

58. సూ. ఒక్కమాటుగా ననేక కార్యజ్ఞానములు తోఁచుచుండుటవలన మనస్సు ఒక్కటిగాదు. గురువు చెప్పుచున్నాఁడు వెళ్లుచున్నాఁడు కమండలువు ధరించుచున్నాఁడు వినుచున్నాఁడు అని యనేకజ్ఞానములు ఒక్కమాటుగాఁ గలుగుట మనస్సు ఒక్కటిగాదు అనేకములు అని పూర్వపక్షి యాక్షేపణము.

మూ. అలాత చక్రదర్శన వత్తదుపలబ్ధి రాశు సంచారాత్

59. సూ. శీఘ్రముగా త్రిప్పుటవలన నిప్పుఁగొఱవి చక్రమువలెఁ గనిపించునట్లు మనస్సు శీఘ్రముగ సంచరించుటవలన జ్ఞానములు ఒకమాటుగాఁ గలుగుచున్నట్లు తోఁచుచున్నది.

మూ. యథోక్త హేతుత్వాచ్చాణు

60. సూ. పైనిజెప్పఁబడిన "ఇంద్రియజ్ఞానములన్నియునొక్కమాటుగాఁ గలుగకపోవుట" అనుకారణమువలనను మనస్సు అణు పరిణామముగలది.

మనస్సు అణువుగాన అన్నిటితోఁ బోయి కలియుచున్నది. మనస్సే గనుక మహా పరిణామముగలదై యుండును అపుడు ఒక్కమాటు సర్వ విషయములనుగ్రహింపవలసి వచ్చునని భావము.

ఇది

మనః పరీక్షా ప్రకరణము

—(o)—

మూ, పూర్వకర్తృ ఫలానుబంధాత్త దుత్పత్తిః

61. సూ. పూర్వజన్మమందుఁ జేయఁబడిన యదృష్టకర్మల ఫలమును అనుసరించి శరీరము ఉత్పన్నమగుచున్నది.

మూ, భూతేభ్యోమూర్త్యుపాదానవత్తదుపాదానః

62. సూ. అదృష్టకర్మల యపేక్షలేకయె భూతపరమాణువుల నుండి శిలామృత్తికాపర్వతాదిమూర్తి రూపములుపుట్టుచున్నట్లు ఆయా శరీరములు పుట్టు చున్నవి.

ఇది నాస్తికుని యాక్షేపము.

మూ, న, సాధ్యసమత్వాత్

63. సూ. సాధ్య సమమనుదోషము పట్టుటవలనఁ బైనిజెప్పిన యాక్షే పము సరియైనదిగాదు.

మానవాదుల శరీరములవలెనే శిలామృత్తికా పర్వతాదుల రూపములును అదృష్ట కర్మాపేక్షవలననె కలుగుచున్నవి. కాన అవిగూడ మనకు పక్ష సమ ములె అనఁగా లక్ష్యములె. శిలాపర్వతాదులుగూడ అదృష్ట కర్మఫలముల ననుస రించియె గలుగుచున్నవి. ఎట్లు మానవాది శరీరములకు అదృష్టాది కర్మాపేక్షా జన్యత్వము సాధ్యమో యట్లే శిలాపర్వతాది శరీరములకు అదృష్టాది కర్మాపేక్షా జన్యత్వము సాధ్యము. కాన అనిశ్చితమగు హేతువునుబట్టి సాధింపరాదుగాన ఈ హేతువును సాధ్యసమమని భావము.

మూ, నోత్పత్తి నిమిత్తత్వాన్మాతా పిత్రోః

64. సూ. శరీరోత్పత్తికిఁ దల్లిదండ్రుల బీజములె గారణమగుట వలన మానవాదుల శరీరములె యిటు లక్ష్యములగుటను గాని యట్టి బీజములులేని శిలా పర్వతాదుల రూపములు లక్ష్యములుగావు.

మూ, తథాఽఽహారస్య

65. సూ. అట్లే యాహారము ఉత్పత్తికి నిమిత్తమగుటవలన ఆహారము తినని శిలాపర్వతాదిరూపములు ఇట లక్ష్యములుగావు.

మూ, ప్రాప్తౌ చాని యమాత్.

66. సూ. తల్లిదండ్రులున్న ప్రతిచోటఁ దప్పక శరీరము లుత్పన్నమగునను నియమములేకపోవుటవలన శరీరములకు అదృష్టకర్మ కారణము.

మూ, శరీరోత్పత్తి నిమిత్తవత్ తత్సం యోగోత్పత్తి నిమిత్తంకర్మ

67. సూ శరీరోత్పత్తియందు అదృష్ట కర్మనిమిత్తమైనట్లే శరీరమునకు ఆత్మతో సంయోగము కలుగుటలో అదృష్టకర్మయె నిమిత్తమగును.

ఏ యాత్మయందు నిమిత్తమైన కర్మాశయముండునో యా యాత్మకే అదృష్టకర్మచేత ఉపభోగసాధనమైన శరీరము గలుగునని భావము.

మూ, ఏతే నానియమః ప్రత్యుక్తః

68. సూ. అదృష్టకర్మయె శరీరోత్పత్తికి నిమిత్తమని చెప్పుటచేత పటుత్వ నిర్బలత్వ వ్యాధి బధిర మూకాంధత్వాది నానాగుణములతో నియమములేకుండ అనేక రీతులుగా శరీరములు గనిపించుటకుఁ గారణము అదృష్ట కర్మయెయని చెప్పఁబడినది.

శరీరము అనేకరీతులుగనుండుటకు ఆయా ప్రాణులు తాము చేసికొనెడి యదృష్టకర్మయె కారణమని భావము.

మూ, తదదృష్ట కారితమితిచేత్ పునస్తత్ప్రసంగోఽపవర్గే

69. సూ. అదృష్టకర్మలేకుండనె యాయాయాత్మల యుపభోగమునకై పరమాణువులె తమ యదృష్టకర్మచే శరీరముల నారంభింపఁజేయుచున్నవన్నచో మోక్షము గలిగినపుడును పరమాణువులు మరల మరల శరీరములనుఉత్పన్నము చేయుచుండు ననవలసివచ్చును.

పృథ్వీ పరమాణువులె స్వతంత్రముగా శరీరమును తమ అదృష్టవశమున ఆరంభించును. మనస్సు తన యదృష్టమున దానిలోఁ బ్రవేశించును ఆ యదృష్టమె స్వభావముగానే జీవునికి సుఖదుఃఖములను సాధించును అని యార్హతుల మతము దానికిది ఖండనము. మఱియు పరమాణువులె శరీరముల నారంభించునన్నచో మనుష్య పశుపక్షి కీటాది శరీరములను గ్రహించుటలో నియమము లేకుండ నుండవలసి వచ్చునని తెలియునది.

మూ, మనఃకర్మ నిమిత్తత్వాచ్చ సంయోగానుచ్ఛేదః

70. సూ. మనస్సుయొక్క ధర్మయయిన యదృష్టమె కారణమగుట వలన జ్ఞానమును శరీరమును బుట్టించెడి యదృష్టమనఃసంయోగమును నశింపక పోవలసివచ్చును.

అదృష్ట మనఁగా మనోగుణమె యనెడి యార్హతుల మతఖండనమిది. అదృష్టము నిత్యము గాన వాని సంయోగధార కూడ నశింపకపోవలసివచ్చును. ఆ యదృష్టము వలననే నాశమును గలుగునన్నచో శరీరారంభమునకును నాశమునకు గారణమగుట యుపపన్నము గాదని భావము.

మూ, నిత్యత్వ ప్రసంగశ్చ ప్రాయణానుపపత్తేః

71. సూ. ఆ సంయోగధార నశింపదన్నచో మరణము ఉపపన్నము గాకపోవుట వలన శరీరాదులు నశింపకపోవలసివచ్చును.

పోనీ నాశము లేదన్నచో బాధయేమి యన్నచో శరీరాదులు నశింపక పోవలసివచ్చునని భావము.

మూ, అణుశ్యామతా నిత్యత్వవదేతత్స్యాత్

72. సూ. పరమాణువుల శ్యామత్వము నిత్యమైనను అగ్ని సంయోగాదులచే నివర్తిల్లినట్లు శరీరాదులు నిత్యమైనను అవి నివర్తిల్లునని చెప్ప వచ్చునుగదా.

మూ, నాకృతాభాగ్యమ ప్రసంగాత్

73. సూ. అట్లన్నచో నిత్యమైన యదృష్టమువల్ల శరీర సంబంధము గలుగఁగా స్వయముగాఁ దాను ఏ కర్మయుఁ జేయకుండఁగనె కర్మకు ఫలము సంభవింపవలసి వచ్చును.

అప్పుడు కర్మలు చేయుటతోను చేయకపోవుటతోను నిమిత్తము లేదు గాని శరీర భేదములుగాని నానావిధ సుఖదుఃఖాదులుగాని లేకపోవలసి వచ్చునని భావము.

ఇది

శరీరములు అదృష్ట నిష్పాద్యములు అను నియమమును బోధించు ప్రకరణము.

తృతీయాధ్యాయమున రెండవ యాహ్నికము.

—(౦)—

మూ, ప్రవృత్తిర్యథోక్తా

1. సూ. ప్రవృత్తి లక్షణము ఇదివఱకుఁ జెప్పఁబడినది.

మూ, తస్యాదోషాః

2. సూ. అట్లే దోషములును బరీక్షింపఁబడినవి.

మూ, తత్త్రైరాశ్యం రాగ ద్వేష మోహార్థాంతరభావాత్.

3. సూ. రాగద్వేషమోహములనునవి అవాంతర భేదములు గలవగుట వలన ఆ దోషములు మూఁడు రాసులుగ నుండును.

కామము మత్సరము స్పృహ, తృష్ణ. లోభము మాయ దంభము అనునవి రాగరాశిలోనివి. క్రోధము ఈర్ష్య అసూయ ద్రోహము అమర్షము అభిమానము అనునవి ద్వేషరాశిలోనివి. విపర్యయము సంశయము తర్కము మానము ప్రమాదము భయము శోకము అనునవి మోహరాశిలోనివి.

మూ, నైక ప్రత్యనీకభావాత్

4 సూ. తత్త్వజ్ఞానమున కొక్కదానికి విరుద్ధముగా నుండుట యను భావమునుబట్టి రాగాదులన్నియు ఒక్కటిగాని భిన్నములుగావు.

మూ, వ్యభిచారాదహేతుః

5. సూ. ఒక్క యగ్నిచే నశించు రూపాదులు అనేకముగా నున్నవి. ఒక్కటి పరిపాకాదులనబట్టి యనేకమగుచున్నవి. కాన వీనియందు "ఒకదానికి విరుద్ధముగానున్నది యొక్కటిగాని వేఱుగావు" అను హేతువు వ్యభిచరించుట వలన ఇది రాగాదుల భిన్నత్వమును నిషేధించుటలో హేతువుగాదు.

మూ, తేషాం మోహః పాపీయా న్నామూఢ స్యేతరోత్పత్తేః

6. సూ. మోహము లేనివానికి రాగద్వేషములు పుట్టకపోవుటవలన వానిలో మోహమె యనర్థములకు మూలము.

మూ, నిమిత్త నైమిత్తి కభావాదర్థాంతర భావో దోషేభ్యః

7. సూ. తత్త్వజ్ఞానము గలగకపోవుటలో నిమిత్తములైన రాగ ద్వేషములకు మోహము నిమిత్తమగుటచే నైమిత్తికమగుచున్నది. అందుచే నిమిత్తము వేఱు నైమిత్తికము వేఱు అగుటవలన రాగద్వేష రూపదోషముల కంటె మోహము వేఱైనది.

మూ, దోషలక్షణ విరోధాన్మోహస్య

8. సూ. మోహమునందు దోషలక్షణము విరోధింపక పోవుటవలన మోహము దోషముల కంటె వేఱైనదిగాదు.

ప్రవర్తింపఁజేయునది దోషము. అని దోషలక్షణము.

మూ, నిమిత్త నైమిత్తి కోపపత్తేశ్చ తుల్య జాతీయానా మప్రతిషేధః

9. సూ. తుల్యజాతీయములగువానికి నిమిత్త నైమిత్తిక భావము (కార్యకారణభావము) ఉపపన్నమగుట వలన తుల్యజాతీయముత్వప్రతిషేధము యుక్తముగాదు.

మోహము దోషమైన రాగాదిదోషములకు నిమిత్తమగుటలో బాధలేదని భావము.

ఇది

దోష పరీక్షా ప్రకరణము.

—:(o);—

మూ, ఆత్మనిత్యత్వే ప్రేత్యభావసిద్ధిః

10. సూ. ఆత్మ నిత్యము గాన ప్రేత్యభావము సిద్ధించుచున్నది.

ప్రేత్య=చనిపోయి అనఁగాఁ బూర్వశరీరమును విడిచి భావము పుట్టుట అని యర్థము. ఆత్మనిత్యము గనుకనే అది యొక శరీరమును విడిచి మఱియొక శరీరమును ఆత్మ పొందుచున్నదని భావము.

మూ, వ్యక్తాద్వ్యక్తానాం ప్రత్యక్షప్రామాణ్యాత్

11. సూ. ప్రత్యక్ష ప్రమాణమునుబట్టి వ్యక్తము నుండి వ్యక్తములు పుట్టుచున్నవి

మూ, న ఘటాద్ఘటానిష్పత్తేః

12. సూ. వ్యక్తమైన ఘటము నుండి ఘటము పుట్టదు గాన వ్యక్తము నుండి వ్యక్తము పుట్టు ననరాదు.

మూ. వ్యక్తాద్ఘటనిష్పత్తే రప్రతిషేధః

13. సూ. మట్టి మొదలగు వ్యక్త పదార్థముల నుండి వ్యక్తమగు ఘటాదులు పుట్టుచుండుట వలనఁ బైని జెప్పిన ప్రతిషేధము యుక్తముగాదు.

ఇది

ప్రేత్యభావ ప్రకరణము.

అవతారిక :- ఇక్కడనుండి భిన్నభిన్న మతములను దెలిపెడి యెనిమిది ప్రకరణములు ఆరంభింపఁబడుచున్నవి.

మూ, అభావాద్భావోత్పత్తి రనుపమృద్యప్రాదుర్భావాత్

14. సూ. బీజము నశింపకుండ మొలక పుట్టకపోవుటవలన అభావము నుండి (అసత్తునుండి) భావపదార్థము (సత్తు) పుట్టుచున్నది.

బీజము తాను విచ్ఛిత్తిపొంది మొలకగా మాఱునట్లు అసత్పదార్థము నుండి సత్పదార్థము పుట్టునని భావము.

మూ, వ్యాఘాతాదప్రయోగః

15. సూ. వైరుద్ధ్య ముండుట వలన నశించి పుట్టుచున్న దనుప్రయోగము యుక్తముగాదు.

ఏది నశించుచున్నదో అది నశించి పుట్టుట కుదురదు. అది యుండుట చేఁన నశించుటయేమి? మఱియు ఏది ప్రాదుర్భవింపదో ఆ ప్రాదుర్భవింపని దానిచేత అనఁగా లేనిదానిచేత నాశము ఎట్లు ఈ వైరుద్ధ్యమునుబట్టి నశించి పుట్టుచున్నదని చెప్పరాదని భావము.

మూ, నాతీతానాగతయోః కారకశబ్దప్రయోగాత్

16 సూ. భూతభవిష్యత్తులలో కర్తకర్మ మొదలగు వానిని బోధించు

కారకశబ్దములను ప్రయోగించుట వలన "నశించి పుట్టుచున్నదను ప్రయోగము యుక్తము గాదు" అనరాదు.

పుత్త్రుఁడు పుట్టును పుట్టఁబోవు పుత్త్రుఁడు పుట్టును పుట్టఁబోవు పుత్త్రుని అభినందించుచున్నాఁడు కుండ యున్నది పగిలిన కిడవనుగూర్చి విచారించు చున్నాఁడు మొదలగు ప్రయోగములందు అనంతర్యము మొదలయిన యర్థము లను చెప్పునట్లుగనే గింజ నశించి పుట్టుచున్నదను చోటను మొలకగా పుట్టఁ బోవుచు గింజ నశించుచున్నది యని యర్థము చెప్పుకొన్నచో వైరుధ్యము లేదని భావము

మూ॥ న వినష్టేభ్యోఽనిష్పత్తేః

17. సూ. నష్టమైపోయిన బీజముల నుండి యంకురములు పుట్టక పోవుట వలన "అభావము నుంచి భావము పుట్టుచున్న"దనరాదు.

బీజమును చూర్ణము చేసినచో చూర్ణమైపోయిన యా గింజ నుండి అంకు రము పుట్టదు గాన నశించి పుట్టుట యనెడి యుదాహరణముచే అభావము నుండి భావము పుట్టుచున్నదనరాదు భావము

మూ॥ క్రమనిర్దేశాదప్రతిషేధః

18. సూ. బీజము నశించుటకు మొలకగా మాఱుటకు వరుస క్రమమును జెప్పుట బీజోత్పత్తికిఁ గారణముగాఁ జెప్పఁబడినది. అందు పూర్వరూపము విడిచి యుత్తరరూపము పొందుటయే క్రమము గాన అభావము నుండి భావమగు బీజము పుట్టునను నాక్షేపణము లేదు కాన గింజ నశించి పుట్టుననుదానికిఁ బ్రతిషేధములేదు,

నీటితోఁ దడుపుట నేలలోఁ బాతిపెట్టుట మొదలగువానిచే బీజము పూర్వ రూపము విడిచి మఱొక రూపమును పొంది మొలకగా మాఱుచున్నది. బీజము నశించుట యనఁగా బీజమే పూర్తిగా నశించిపోవుటగాదు. పూర్వరూపమును విడువకయె యుత్తరరూపమును పొందుటయు సంభవింపదు. కాన గింజ మొలకగా మాఱుటకొక క్రమము చెప్పఁబడుచున్నది. కాన దానికి "అభావము నుండి భావము ఎట్లు పుట్టు"నని చెప్పి ప్రతిషేధము చెప్పరాదని భావము.

౩ది

శూన్యతోపాదానః ప్రకరణము.

మూ. ఈశ్వరః కారణం పురుషకర్మాఫల్య దర్శనాత్

19 సూ. పురుషుల కర్మ విఫలమగుట కనిపించుట వలన ఆ కర్మ ఫలమునకు ఈశ్వరుఁడు కారణము

మూ. పురుషకర్మాభావే ఫలానిష్పత్తేః

20 సూ. పురుషకర్మ లేకుండ ఫలము పుట్టకపోవుట వలన ఫల నిష్పత్తి యీశ్వరాధీనమని చెప్పరాదు

మూ. తత్కారితత్వాదహేతుః

21 సూ. పురుషకర్మ యీశ్వరునిచేఁ బ్రేరేపింపఁబడినపుడే సఫల మగునని చెప్పుటవలనఁ బైని జెప్పఁబడిన హేతువు సరియయినదిగాదు.

పురుషకారమును ఈశ్వరుఁ డనుగ్రహించినపుడు తత్ఫలమునకై యత్నించు పురుషునికి ఫలసిద్ధి యగును. ఈశ్వరానుగ్రహము లేనపుడు పురుష కర్మ విఫలమగునని భావము. నిత్యజ్ఞానేచ్ఛాప్రయత్నములచేతను సామాన్య గుణములైన సంయోగాదులచేతను విశిష్టమై జీవులకంటె భిన్నమై జగదారాధ్యమై సృష్ట్యాది కర్తయయి వేదాదులద్వారా హితోపదేశము గలిగించు జగత్తులకుఁ దండ్రియయియున్న యాత్మయే యీశ్వరుఁడని గ్రహించునది. అతఁడే ప్రతి యాత్మయందలి ధర్మాధర్మప్రవృత్తులను పృథివ్యాది భూతములను నడపును. క్షిత్యాదులు ఘటాదులవలెఁ గార్యములగుట వలన సకర్తృకములు. ఆ క్షిత్యా దులకు ఈశ్వరుఁడె కర్తయని యనుమానాదులద్వారా ఈశ్వరుని యస్తిత్వమును దెలియునది.

ఇది

ఈశ్వరోపాదానతా ప్రకరణము.

మూ. అనిమిత్తతో భావోత్పత్తిః కంటక తైక్ష్ణ్యాదిదర్శనాత్

22. సూ. నిమిత్తములేకుండఁ గంటకాదులకు తీక్ష్ణత్వాదులు గనిపించుట వలన నిర్నిమిత్తముగాఁ బదార్థముల యుత్పత్తి యగుచున్నది.

మూ. అనిమిత్తనిమిత్తత్వాన్నానిమిత్తతః

23. సూ. నిర్నిమిత్తముగాఁ బదార్థముల యుత్పత్తి యగుచున్నదని నిర్నిమిత్తమును నిమిత్తముగాఁ జెప్పుటవలనఁ బదార్థములయుత్పత్తి నిమిత్తము లేనిదిగాదు.

మూ, నిమిత్తానిమిత్తయో రర్థాంతరభావా దప్రతిషేధః

24. సూ నిర్నిమిత్తమునకును నిమిత్తమునకును అర్థములో భేద ముండుటవలనఁ బైనిజెప్పిన ప్రతిషేధముయుక్తమైనదిగాదు. నిర్నిమిత్తమనఁగా నిమిత్తమున్నదని చెప్పరాదని భావము.

ఇది

ఆకస్మికత్వ ప్రకరణము

మూ, సర్వమనిత్యముత్పత్తి వినాశధర్మకత్వాత్

25. సూ. ఉత్పత్తి వినాశ ధర్మములుగల వగుటవలన సర్వమును అనిత్యము.

మూ, నానిత్యతానిత్యత్వాత్

26. సూ. సర్వమందును అనిత్యత్వము నిత్యముగా నుండుటవలన "సర్వమును అనిత్యము" అనరాదు.

మూ, తదనిత్యత్వమగ్నేర్దాహ్యం వినాశ్యానువినాశవత్

27. సూ. దహింపఁదగిన వస్తువును దహించుటద్వారా నశింపఁజేసి యగ్ని యావస్తువుతోపాటు తానును స్వయముగా నశించునట్లు సర్వమును నశింపఁగా వానితోపాటు ఆయనిత్యత్వమును గూడ నశించును.

మూ, నిత్యస్యాప్రత్యాఖ్యానంయథోపలబ్ధి వ్యవస్థానాత్

28. సూ. ప్రమాణములచేత ఉపలబ్ధమైన దానినిబట్టి ఇవి యసత్యములు ఇవి నిత్యములు అని వ్యవస్థయుండుటవలన నిత్యత్వమును ప్రత్యాఖ్యానము చేయుట తగదు.

ప్రత్యక్షాది ప్రమాణములచే నుత్పత్తి వినాశ ధర్మములు గలిగినట్లు ఉపలబ్ధమైనవి అనిత్యములనియు ఉత్పత్తి వినాశములు ఉపలబ్ధముగాని పరమ సూక్ష్మ భూతములును ఆకాశము కాలము దిక్కు ఆత్మ మనస్సులును వాని గుణములును గొన్ని సామాన్య విశేష సమవాయములును నిత్యములనియుఁ దెలియఁదగునని భావము.

ఇది

సర్వానిత్య నిరాకరణ ప్రకరణము.

మూ, సర్వంనిత్యం పంచనిత్యత్వాత్

29. సూ. పంచభూతములు నిత్యములగుటవలన సర్వమును నిత్యమె.

మూ, నోత్పత్తి వినాశకరణోపలబ్ధేః

30. సూ. ఘటాది వస్తువులకు ఉత్పత్తి వినాశకారణములు ఉపలబ్ధమగుటవలన సర్వమును నిత్యమనరాదు.

మూ, తల్లక్షణావరోధా దప్రతిషేధః

31. సూ. పరమాణువు మొదలగువానియందుఁ గల భూతత్వాది లక్షణములు ఘటాదులందును ఉండుటవలన సర్వమును నిత్యమె.

పుట్టినది నశించినది మొదలగుజ్ఞానము భ్రమజన్యములని యీ సూత్రము యొక్క యాశయము.

మూ, నోత్పత్తి తత్కారణోపలబ్ధేః

32. సూ. ఘటాదులకు ఉత్పత్తియు ఉత్పత్తిప్రమాణములును ఉపలబ్ధమగుటవలన అవి యనిత్యమె.

మూ, నవ్యవస్థానుపపత్తేః

33. సూ. సర్వజనులకు యథార్థముగా అనుభవసిద్ధములైన ఘటాద్యనిత్యవిషయములు భ్రాంతి మూలకములన్నచో ఇది యథార్థజ్ఞానము ఇది భ్రాంతిజ్ఞానము అను వ్యవస్థ యనుపపన్నము గావలసివచ్చును.

ఇ ది

సర్వ నిత్యత్వ నిరాకరణ ప్రకరణము

మూ, సర్వం పృథగ్భావలక్షణ పృథక్త్వాత్

34. సూ. భావ లక్షణములు వేఱుగా నుండుటవలన సర్వవస్తువులు వేఱైనవి

భావలక్షణములగు గంధరస రూపాదులును వాని వాని యవయవములును ఘటాదులకంటె వేఱుగానుండుటవలనను వాటి సమూహమె ఘటాది వ్యవహారము గలిగియుండుటవలనను ఘటాది భావపదార్థములు వానిగుణములు అవయవములు పరస్పరము భిన్నములని యాక్షేపణము.

మూ, నానేక లక్షణైరేక భావనిష్పత్తేః.

35 సూ. అనేకవిధములగు లక్షణములతోడను గంధాది గుణముల తోడను ఆయా యవయవములతోడను గూడిన యొకటే భావము నిష్పన్నమగుట వలన "సర్వవస్తువులు వేఱైనవి" అనరాదు.

ఘటాదులలో అనేక లక్షణములు గలిసి యొకటేరూపము అయ్యెను. వానిలోని రూపాదులనుబట్టి వస్తువులు వేఱుగానున్నవనరాదని భావము.

మూ, లక్షణ వ్యవస్థానా దేవా ప్రతిషేధః

36. సూ. ఘటపటాదుల లక్షణవ్యవస్థనుబట్టి "ఒక్కటేభావముగాదు" అను ప్రతిషేధము యుక్తముగాదు

ఈ యవయవములతోఁ గూడినది ఘటము ఇట్టిది పటము అను వ్యవస్థ యుండుటవలనను పరమాణువులు ప్రత్యక్షము గాకపోవుటవలనను ఏఘటమును జూచినను దానినిదాకితిని ఇత్యాద్యనుభావములనుబట్టియు "సర్వవస్తువులు వేఱన రాదు" అని భావము.

ఇది

సర్వ పృథక్త్వ నిరాకరణ ప్రకరణము

మూ, సర్వమభావో భావేష్వితరా భావసిద్ధేః,

37. సూ. భావ పదార్థములన్నియు ఒకదానికొకటి అభావముగా సిద్ధించుటవలన సర్వమును అభావరూపములె. ఘటము పటముగాదు, పటము ఘటము గాదు, ఇత్యాదులలో అభావ ప్రతీతిగలుగుటవలన అన్నియు అభావరూపములని యాక్షేపము.

మూ, న స్వభావ సిద్ధేర్భావానాం

38. సూ. పృథివ్యాది భావపదార్థములకు గంధాది స్వభావములు సిద్ధించుటవలన సర్వము అభావరూపము లనరాదు.

సర్వము అభావరూపమైనచో లేనిపదార్థములకు గంధాదులు భాసిల్లవు. ఆ గంధాది స్వభావములుండుట సర్వానుభవసిద్ధము.

మూ. న స్వభాసిద్ధి రాపేక్షికత్వాత్

39. సూ. ఇతరపదార్థముల సాపేక్షవల్ల ఆ స్వభావము గలుగుటవలన సర్వపదార్థములకు ఒకటే స్వభావము సిద్ధింపదు.

హ్రస్వవస్తువును బట్టి యితర వస్తువు దీర్ఘమగును. ఆ దీర్ఘవస్తువును మఱియొక దీర్ఘవస్తువునుబట్టి హ్రస్వమగును ఒక వస్తువును బట్టి యొక వస్తువు నీలతరమగును. ఇతరవస్తువుల యపేక్షనుబట్టియేగాని స్వతస్సిద్ధముగా ఏమియు నుండదు. మంకెనపువ్వునుబట్టి స్ఫటికము ఎఱ్ఱన అగుచున్నది. కాన సర్వము అభావరూపములని పూర్వపక్షి ఆక్షేపము.

మూ॥ వ్యాహతత్వాదయుక్తం

40. సూ॥ ఇతరపదార్థ సాపేక్షత్వము వ్యాహత (= అన్యోన్యాశ్రయ దోషయుక్త) మగుటవలన పైహేతువు యుక్తమైనదిగాదు.

హ్రస్వవస్తువును బట్టి యితరవస్తువు దీర్ఘమగును అనుచోట మొదట హ్రస్వవస్తువునుబట్టి అని హ్రస్వము చెప్పఁబడుచున్నది. ఆ హ్రస్వము దేనిని అపేక్షించి హ్రస్వమని చెప్పఁబడుచున్నది. ఇట్లే యితర స్థలములందును. వ్యవహారములో రెండిటికి సామ్యాదులు చెప్పుటకు అతిశయమనుభావము గ్రహింపఁబడుచున్నది. ఇట్లే యితరస్థలములందును వ్యవహారములో రెండిటికి సామ్యాదులు చెప్పుటకు అతిశయమనుభావము గ్రహింపఁబడుచున్నది. అంతియే గాని "యసలు వస్తుస్వభావములే లేవు అవి యపేక్షాసిద్ధములు"అని చెప్పరాదని భావము.

ఇది

సర్వశూన్యతా నిరాకరణ ప్రకరణము.

మూ॥ సంఖ్యైకాంతాసిద్ధిః కారణానుపపత్త్యుపపత్తిభ్యాం

41. సూ॥ కారణములు ఉపపన్నముగను అనుపపన్నముగను ఉండుట వలన "తత్త్వము ఒకటే, తత్త్వములు రెండు, లేక మూఁడు లేక నాలుగు మొదలుగా సంఖ్యలనే ముఖ్యమైన సిద్ధాంతముగఁ దెలుపు సంఖ్యైకాంతవాదము సిద్ధింపదు.

భేదము లేకపోవుటవలన సమస్తము ఒక సత్పదార్థమే. బ్రహ్మమే అని యద్వైతవాదము. దీనికి భిన్నముగా అనేకమతములుగలవు. నిత్యములు అని సమస్తమును రెండువిధములు అని ద్వైతవాదులు జ్ఞాతజ్ఞానము జ్ఞేయము అని సమస్తము మూఁడువిధములు అని కొందఱు ప్రమాత ప్రమాణము ప్రమేయము ప్రమితి అని సర్వము నాలుగువిధములు అని కొందఱు రూపము, సాక్షి,

సంస్కారము, వేదన అనుభవము అని స్కంధములు అయిదని సౌత్రాంతికులు, అని సంఖ్యలతోఁ జెప్పు సిద్ధాంతములుగలవు. ఇందు సాధ్యసాధనములు భిన్నములా అభిన్నములా? భిన్నములన్నచో భిన్నములైనవానినుండి యొక సిద్ధాంతము సిద్ధింపదు. అభిన్నములన్నచో సాధ్యమని సాధించు సాధనములేనప్పుడు సిద్ధాంతమెట్లు సిద్ధించును. ఇట్లు భిన్నభిన్నముగను బరస్పరవిరుద్ధముగను వాదములుండుటవలన ఈ వాదములు సిద్ధింపవని భావము.

మూ, నకారణావయవభావాత్

42. సూ. కారణమునకు అవయవములు ఉండుటవలన సాధ్యమును సాధించునట్టి యవయవము గుదురుచున్నది కాన "సంఖ్యైకాంతవాదము సిద్ధింపదు" అనరాదు.

అవయవములకు అవయవికి భేదములేదుగాన తత్త్వమొకటేయన్నను రెండు అన్నను మూఁడన్నను ఎన్నియన్నను ఆతత్త్వావయనములతో ఒకదానికొకటి కారణము సిద్ధించునగాన సంఖ్యైకాంతవాదము సిద్ధింపదనరాదని భావము.

మూ, నిరవయత్వాదహేతుః

43. సూ. కార్యమునకు అవయవములుండునుగాని కారణమునకు అవయవములుండుటవలన సంభవింపదు కానఁజెప్పిన ప్రతిషేధ హేతువు యుక్తము గాదు.

తత్త్వము ఒకటే యన్నచో ఆ యొకటికి పక్షమగుచున్నది. రెండు అన్నను మూఁడు అన్నను ఇంక ఎన్ని అన్నను అవియన్నియు పక్షములే యగుచున్నవి. ఆ పక్షములకంటె భిన్నముగా సాధించు హేతువు మాత్రము లేకపోవుటచేతను, ఒకటే సాధ్యము సాధనము అని దానికి అవయవములుండుననుట యుక్తము గాకపోవుటచేతను పైనిజెప్పిన ప్రతిషేధము యుక్తముగాదనిభావము.

ఇది

సఖ్యైకాంతవాద నిరాకరణ ప్రకరణము

---

మూ. సద్యః కాలాంతరేచ ఫలనిష్పత్తేః సంశయః

44. సూ. పాకాదిక్రియలకు ఫలము వెనువెంటను, కృష్యాదులకు, గాలాంతరమందును నిష్పన్నమగుటవలన అగ్నిహోత్రహవన పరహింసాదులకు

ఫలము వెనువెంటనే కలుగునా? కాలాంతరమందుఁ గలుగునా అని సంశయము కలుగుచున్నది.

మూ. నసద్యః కాలాంతరోపభోగ్యత్వాత్

45. సూ. కాలాంతరమందు అనుభవింపఁ దగినదిగాఁ బ్రతిపాదించుట వలన అగ్నిహోత్రహవన పరహింసాదులకు ఫలము వెంటనే గలుగదు.

అగ్నిహోత్రమునందు హోమముచేసినందున ఈ దేహము పోఁగాస్వర్గము గలుగును పరులను హింసించినందువలనఁ గాలాంతరమున నరకాదులుగలుగునని భావము.

మూ. కాలాంతరే ణానిష్పత్తి ర్హేతువినాశాత్

46. సూ. స్వర్గాది ఫలములకుఁ గారణములైన అగ్నిహోత్రహవనాది కర్మలు నశించిపోవుటవలనఁ గాలాంతరమున స్వర్గాది ఫలనిష్పత్తి కలుగదు. కారణములు నశింపఁగా కారణములేకుండఁ గార్యము పుట్టదుగాన స్వర్గాదులు గలుగవని యాక్షేపము.

మూ ప్రాఙ్నిష్పత్తేర్వృక్షఫలవత్తత్స్యాత్

47. సూ చెట్లకు మొదటఁబోసిన నీరు నశించిపోయినను ఆ నీటినిబట్టి చెట్లు వర్ధిల్లి ఫలముల నిచ్చునట్లు యాగాది పుణ్యకర్మలు నశించినను వానివల్లఁ గలుగు నదృష్టము స్వర్గాది ఫలనిష్పత్తికిఁ బూర్వమందె యుండునుగాన ఆ స్వర్గాది ఫలములు కలుగును.

ఏదైన కర్మ చేసినపుడు దానివలన అపూర్వమను సంస్కారము కలుగునని యందురు. ఈ సూత్రమునఁ జెప్పఁబడిన యదృష్టమును అపూర్వమును ఒకటే. ఈ యదృష్టమునె అపూర్వమని మీమాంసకులు ఈ యపూర్వము ఫలము కలుగువఱకు నుండునని యందురు.

మూ. నాసన్న సన్న సదసత్ సదసతో ర్వైధర్మ్యాత్

48. సూ సత్తు అసత్తు రెండు పరస్పరము విరుద్ధ ధర్మములవగుట వలన కార్యము అసత్పదార్థముగాని సత్పదార్థముగాని సదసత్పదార్థములు గాని గాదు.

ఉత్పత్తికిం బూర్వము కార్యము అసద్రూపముగా (లేనిదిగా) ఉన్నదన్నచో శృంగాదులు లేని చెవుల పిల్లిమొదలగు వానినుండి శృంగాదులు పుట్టవలసి వచ్చును. ఇసుకనుండి తైలము గలుగవలసివచ్చును పోనీ ఉత్పత్తికిం బూర్వము కార్యము సద్రూపముగా (ఉన్నదిగా)ఉన్నదన్నచో లేనిదానికే పుట్టుక గాని ఉన్నదానికిఁ బుట్టుక యెట్లు సంభవించును. పరస్పరము విరుద్ధములుగానం గార్యము సదసద్రూపములుగా (ఉన్నది లేనిదిగా)గాని యుండదు అని భావము.

మూ. ఉత్పాదవ్యయదర్శనాత్

49. సూ. కార్యమునకు ఉత్పత్తియు నాశమును గనిపించుటవలనం గార్యము ఉత్పత్తికిఁ బూర్వము ఉత్పత్తిధర్మముగలదై అసత్తని పిలువఁబడును.

ఇప్పుడు ఘటము తయారైనది యిప్పుడు నశించిపోయినది యనుజ్ఞానము ఉండుటవలన ఉత్పత్తికిఁ బూర్వము ఘటాదులు అసద్రూపముగ ఉన్నవని భావము.

మూ. బుద్ధి సిద్ధంతు తదసత్

50. సూ. బుద్ధికి గోచరమైన కార్యము మాత్రము అసత్తనఁబడును. ఈ దారములతో వస్త్రముగాఁగలదని తలఁచి సాలెవాఁడు పనిచేయుచున్నాఁడు. కాని వస్త్రము తయారై యున్నదను జ్ఞానమున్నపుడు ప్రవర్తింపదు.

మూ. ఆశ్రయ వ్యతిరేకాద్వృక్ష ఫలోత్పత్తి వదిత్యహేతుః

51. సూ. ఈ లోకమందలి శరీరముచేఁ జేయఁబడినకర్మకు పరలోక మందలి శరీర కర్మఫలము అనుభవించుటలో ఆశ్రయము భిన్నమగుచున్నది కాన వృక్షఫలముల యుత్పత్తివలె ఫలముసిద్ధించునని చెప్పిన హేతువు యుక్తము గాదు.

వృక్షమునకు నీళ్లుపోయుట మొదలగు వానికిని ఆచెట్లు పెరిగి ఫలములు కాయుట మొదలగు వానికిని ఆధారమొక్కటి రెండును ఇహలోకమందె జరుగు చున్నవి. ఇహ శరీరకర్మలకు పరలోక శరీర ఫలము కుదురదుగాన దానిని బట్టి ఫలము సిద్ధించుననరాదని యాక్షేపము.

మూ. ప్రీతేరాత్మాశ్రయ త్వాదప్రతిషేధః

52. సూ. స్వర్గాది సుఖమును కర్మయును ఆత్మ నాశ్రయించి

యుండుటచే ఆశ్రయము భిన్నమని ప్రతిషేధింపరాదు. కర్మయు ఫలమును ఆత్మాశ్రయమె కాన దృష్టాంతము కుదురునని భావము.

మూ. న పుత్రపశుస్త్రీ పరిచ్ఛద హిరణ్యాన్నాది ఫలనిర్దేశాత్

53. సూ. పుత్రులు పశువులు స్త్రీలు పరిచ్ఛదములు సువర్ణము, అన్నము మొదలగునవి యాగాదులకు ఫలములుగా నిర్దేశింపఁబడుటవలన ఆశ్రయము అభిన్నమైనదని చెప్పరాదు.

సుఖకర్మలు ఆత్మ నాశ్రయించినను పుత్రాదిఫలములకు కర్మలకు ఆశ్రయ మొకటియని చెప్పరాదని భావము.

పుత్రాదిఫలములు శరీరాశ్రయములు కర్మలు ఆత్మాశ్రయములని యాక్షేపము.

మూ. తత్సంబంధాత్ ఫలనిష్పత్తేస్తేషు ఫలవ దుపచారః

54. సూ. పుత్రాదుల సంబంధమునుబట్టి ప్రీతిరూపమైన ఫలము కలుగుట వలన పుత్రాదులను ఫలములుగాఁ జెప్పినట్లు వ్యవహరింపఁబడుచున్నది.

"అన్నంవై ప్రాణాః" అన్నమె ప్రాణములు అని ప్రాణకారణమైన యన్నమును ప్రాణముగా వ్యవహరించినట్లు పుత్రాది ప్రీతివస్తువులందు పుత్రాది వ్యవహారము గౌణముగాఁ జేయఁబడుచున్నదని భావము.

ఇది

ఫల పరీక్షా ప్రకరణము

---

మూ. వివిధ బాధనాయోగాద్దుఃఖమేవ జన్మోత్పత్తిః

55. సూ. వివిధబాధలతో సంబంధముండుటవలన శరీరేంద్రియ బుద్ధులతో సంబంధమున జన్మముగలుగుట దుఃఖము.

మూ. న సుఖస్యాంతరాళ నిష్పత్తేః

56. సూ. మధ్య మధ్య సుఖముగూడఁ గలుగుచుండుటవలన శరీరాది సంబంధము దుఃఖమనరాదు.

మూ. బాధనానివృత్తే ర్వేదయతః పర్యేషణ దోషా దప్రతిషేధః

57. సూ. సుఖసాధనములనుగూర్చి తెలిసికొన్న వానికి బాధలు పోక పోవుటవలన సుఖములకోసము ప్రవర్తించుటలో దోషములుండుటవలన "శరీరాది సంబంధమున దుఃఖముగలుగదు" అనరాదు.

కోరఁబడిన సుఖములు గలుగకపోవుట లభ్యమైన సుఖసాధనాది ధనాదులను సంపాదించుట సంపాదించిన వానిని రక్షించుట అవి నశించుట మొదలగు దోషము లనేకముగా నుండుటవలన దుఃఖమెగాని శాశ్వతసుఖములేదని భావము. క్రామం కామయమానస్య యదా కామః సమృధ్యతే అథైన మపరః కామఃక్షిప్ర మేవ ప్రబాధతే (కోరిక కోరుచున్న వానికోరిక తీరినపుడు మఱి వీనిని మఱియొక కోరిక వెంటనే బాధించును.) అనుసూక్తినిబట్టి దుఃఖము గలుగుచుండునని భావము.

మూ. దుఃఖవికల్పే సుఖాభిమానాచ్చ

58 సూ. వివిధమైన దుఃఖకల్పనలో సుఖమున్నదని యభిమానము గలిగియుండుటవలన దుఃఖ నివృత్తికై దుఃఖ స్వరూపోపదేశము చేయఁబడు చున్నది.

మిథ్యాజ్ఞాన సంకల్పమువలన సుఖమందు సుఖసాధనములైన విషయము లందు రక్తుఁడై యత్నింపఁగా లభించెడి జన్మ జరావ్యాధులచేతను ఇష్టానిష్ట వియోగాదులచేతను అనేక దుఃఖములను పొందును. ఈ దుఃఖములందు భ్రమచే సుఖదుఃఖ బుద్ధిపొంది పరిణామములో దుఃఖములో నిమగ్నుఁడగును. కావ నిట్లు అత్యంత దుఃఖ నివృత్తికై యుపదేశింపఁబడుచున్నదని భావము.

ఇది

దుఃఖ పరీక్షా ప్రకరణము

—(o)—

మూ. ఋణక్లేశ ప్రవృత్త్యనుబంధా దపవర్గాభావః

59. సూ. ఋణములయొక్కయు క్లేశములయొక్కయు వ్యాపారముతో సంబంధము పోకపోవుటవలన మోక్షమనునదిలేదు.

జాయమానోవై బ్రాహ్మణ స్త్రిభిర్ఋణైర్ఋణవాన్ జాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యః యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః "పుట్టుచునే బ్రాహ్మణుడు బ్రహ్మచర్యముచే ఋషులకొరకు యజ్ఞముచేత దేవతలకొఱకు సంతానముచేత తల్లిదండ్రులకొఱకు మూఁడు ఋణములతో ఋణములుగలవాఁడగుచున్నాఁడు." "ఋణాని త్రీణ్యపాకృత్యమనో మోక్షేనివేశయేత్, అనపాకృత్యమోక్షంతు సేవమానో వ్రజత్యధః" ఈ మూడు ఋణములు తీర్చి మనస్సును మోక్షమందుంచవలెను. ఈ ఋణములు తీర్చకుండ మోక్షమును సేవించుచున్నచో (శక్తి అనుభవములేనందువలన) క్రిందపడును. ఈ పైఋణములతోను రాగద్వేషాది క్లేశములతోను సంబంధము కలిగియుండుటవలన మోక్షమేలేదని శంక.

మూ. ప్రధానశబ్దానుపపత్తే ర్గుణశబ్దే నానువాదో నిందా ప్రశంసోపపత్తేః

60 సూ ఋణాది ప్రధానశబ్దములు స్వార్థమందు అనుపపన్నములగుటవలనను నిందా ప్రశంసాపరముగఁ జెప్పిన నుపపన్నము లగుటవలనను ఋణాదిపదములకు ఋణములవంటివి అని గౌణార్థముచెప్పి శ్రుతులతో అనువాదము చేయఁబడుచున్నది.

"జాయమానోవై బ్రాహ్మణస్త్రి భిర్ఋణైర్ఋణవాన్ భవతి" (పుట్టుచున్న వాఁడై బ్రాహ్మణుఁడు మూఁడు ఋణములతో ఋణములు గలవాఁడగుచున్నాఁడు) ఇత్యాదిస్థలములందు పుట్టఁగనే బ్రహ్మచర్యాదుల కర్తుఁడు గాఁడు గాన పుట్టుచున్నవాఁడు" అనుదానికి గౌణార్థముగా ఉపనయనము సంస్కారము పొందినవాఁ"డని యర్థము చెప్పవలయును. ఉపనీతునికే బ్రహ్మచర్యాదులందు అధికారము గలదు ఇట్లే ఋణశబ్దమునకును జెప్పవలయును. అప్పుపుచ్చుకొనుట గాని బాకీతీర్చుటగాని యిక్కడలేదు. కాన ఋణము వంటిదని చెప్పుకొని ఋణముతీర్చుట యెంత ముఖ్యమో బ్రహ్మచర్యాదులు ఆచరించుట యంత ముఖ్యమని తెలుపుటకై యట్లు చెప్పఁబడెనని గ్రహింపవలయునని భావము. బ్రహ్మచర్యము చేసినచో ప్రశంసయును చేయకపోయినచో నిందయును గలుగు నని చెప్పుటయే యందలిభావము. కాన ఆ ఋణాదులతో ఆత్మకు సంబంధము పోయి మోక్షముగలుగును గాన మోక్షములేదనరాదని భావము.

మూ సమారోపణా దాత్మన్యప్రతిషేధః

61. సూ. ఆత్మయందు అగ్నులను ఆరోపించుటవలన మోక్షమనునది లేదనరాదు.

"ప్రాజాపత్యామిష్టిం నిరూప్యతస్యాం సర్వవేదసం హుత్వా ఆత్మన్యగ్నీన్ సమారోప్య బ్రాహ్మణః ప్రవ్రజేత్"

ప్రాజాపత్య యజ్ఞమునుజేసి యందు సమస్తధనములను ఆహుతిచేసి బ్రాహ్మణుఁడు ఆత్మయందు అగ్నులను సమారోపణచేసి సంన్యసింపవలయును. అను శ్రుతినిబట్టి నిత్యకర్మలతోఁగూడ ఆత్మకుసంబంధముపోవునుగాన మోక్షము కలుగునని భావము.

మూ. పాత్ర చయాంతానుపపత్తేశ్చ ఫలాభావః

62. సూ. అగ్నిహోత్రముయొక్క స్రుక్కు స్రువము మొదలగుపాత్రలను కర్మపరులు ప్రేతముయొక్క యంగములందు ఉంచుటవలన జ్ఞానికి మోక్షమె గాని పాత్రలుంచుటవలనఁ గలుగు స్వర్గఫలము కలుగదు.

కర్మపరులు చనిపోయినపుడు వారి ముఖాదులందు స్రుక్కు స్రువము జుహువు మొదలగు పాత్రలుంచుట విధి. జ్ఞాని తన యాత్మయందు అగ్నిహోత్రములను సమర్పించుటవలన వానికి అగ్నిహోత్రాదికర్మలును ఆ కర్మలతోఁ జెప్పఁబడిన "ప్రేతములయంగములందు తత్తత్పాత్రములుంచుట మొదలగునవి" యుండవు. కాన అగ్నిహోత్రాది ఫలమగు స్వర్గముగూడ జ్ఞానికిలేదు. జ్ఞానికి అగ్నిహోత్రాదికర్మలతో సంబంధములేనట్లే స్వర్గఫలముతో సంబంధములేదు గాన మోక్షము సిద్ధించునని భావము.

మూ. సుషుప్తస్య స్వప్నాదర్శనే క్లేశా భావాదపవర్గః

63. సూ. నిద్రించినవాఁడు కలలనుగాంచనపుడు కలలకుసంబంధించిన దుఃఖాదులను పొందనట్లు రాగాది క్లేశములు లేనపుడు అత్యంత దుఃఖాభావ రూపమైన మోక్షముగలుగును.

మూ. న ప్రవృత్తిః ప్రతిసంధానాయ హీనక్లేశస్య.

64. సూ. రాగాది క్లేశములు లేనివాని ప్రవృత్తి పునర్జన్మాదులకుఁ గారణముగాదు.

మూ. న క్లేశసంతతేః స్వాభావికత్వాత్

65. సూ. రాగాది క్లేశసంతతి స్వాభావికమగుటవలన దానికి విచ్ఛేదము గలుగదు.

మూ. ప్రాగుత్పత్తేర భావా నిత్యత్వవత్ స్వాభావికేప్యః నిత్యత్వం.

66. సూ. ఉత్పత్తికిఁ బూర్వమందు అనాదిగానున్న యభావము అనిత్యమైనట్లే క్లేశసంతతియు స్వాభావికమయినను అసత్యమె.

మూ. అణుశ్యామతా నిత్యత్వవద్వా

67. సూ. పరమాణువుల శ్యామత్వముఅనాదియైనను వాని శ్యామత్వము అగ్ని సంయోగాదులనుబట్టి యనిత్యమైనట్లు క్లేశ సంతతియు అనిత్యమైనది.

మూ. న, సంకల్ప నిమిత్తత్వాచ్చ రాగాదీనాం

68. సూ. రాగాదులు మిథ్యాజ్ఞాన సంకల్ప నిమిత్తములగుటవలనను తత్వజ్ఞానము కలుగఁగా మిథ్యాజ్ఞాన జన్యరాగాదులు పోవునుగాన "క్లేశసంతతికి విచ్ఛేదము గలుగదు" అనరాదు తత్త్వజ్ఞానముచే మిథ్యాజ్ఞానము నశింపఁగా రాగాదులు నివర్తించును అదే మోక్షము అని భావము.

ఇది

అపవర్గ పరీక్షా ప్రకరణము

ఇది

చతుర్థాధ్యాయమందు మొదటి యాహ్నికము

---

ఇంక

నాల్గవ యధ్యాయములో రెండవ యాహ్నికము

మూ. దోష నిమిత్తానాం తత్త్వజ్ఞానా దహంకార నివృత్తిః.

1. సూ. రాగద్వేషాది దోషములకు నిమిత్తములైన శరీరాదుల తత్త్వ నమువలన అహంకారము పోవును

మూ. దోషనిమిత్తం రూపాదయో విషయాః సంకల్ప కృతాః.

2. సూ. మనస్సంకల్పమువలన నేర్పడిన రూపాది విషయములు రాగాది దోషములకు నిమిత్తములు.

మూ. తన్నిమిత్తం త్వవయ వ్యభిమానః.

3. సూ. స్త్రీపురుషాది శరీరరూప ధనాదులందు అభిమానము గలిగి యుండుట రాగాదులకు నిమిత్తమగుచున్నది.

స్త్రీ పురుషాదులందు భావించుచు అనురాగము పొందుటను అను రంజక సంజ్ఞయందురు. దానివల్లఁ గామాదులు వర్ధిల్లును. మాంసశోణితాస్థిస్నాయుముల మూత్రాదులను జూచుటను అశుభ సంజ్ఞయందురు. దీనివల్ల రాగాదులునశింపఁగా తత్త్వజ్ఞానము కలిగి మోక్షముగలుగునని భావము.

ఇ ది

తత్త్వజ్ఞానోత్పత్తి ప్రకరణము

—(౦)—

మూ. విద్యాఽవిద్యా ద్వైవిధ్యాత్ సంశయః.

4. సూ. శరీరమున విద్య యవిద్య అని జ్ఞానము రెండు విధములుగా నుండుటవలన అవయవములకంటె అవయవి వేఱుగానున్నదా లేదా అను సంశయము కలుగుచున్నది.

విద్య = యథార్థజ్ఞానము అవిద్య = అయథార్థజ్ఞానము శరీరమునఁ బరమాణువుల పుంజము మాత్రమె యున్నది. దానినే ముముక్షువులు భావి. ప వలయును పరమాణువులుకూడ ఆభాస స్వరూపములెగాని వాస్తవములుగావు అని సౌగతమతము.

మూ. తదసంశయః పూర్వహేతు ప్రసిద్ధత్వాత్.

5. సూ. పూర్వోక్త హేతువులచే అవయవి ప్రసిద్ధమగుచున్నదిగాన అవయవియున్నదా లేదా అను సందేహమునకు తావులేదు.

ఇది రెండవ యధ్యాయములో అవయవి ప్రకరణములో నిరూపితము.

మూ. వృత్త్యను పపత్తేరపి తర్హి న సంశయః.

6. సూ. అయితే మఱి యవయవములందు అవయవి వేఱుగా నుండుట యుపపన్నము గాకపోవుటవలననే అవయవి విషయకమైన సంశయము ఉపపన్నముగాదు.

ఈ సూత్రము తర్వాతి సూత్రములలో వివరింపఁబడుచున్నది.

మూ. కృత్స్నైకదేశావృత్తిత్వా దవయవానా మవయవ్యభావః.

7. సూ అవయవములు అవయవియందు సంపూర్ణముగాఁ గాని ఏకదేశముగాఁ గాని యుండకపోవుటవలన అవయవి యనునది లేదు.

ఒక్కొక్క యవయవమందె అవయవి సంపూర్ణముగా నున్నదన్నచో అవయవ పరిమాణము వేఱు అవయవి పరిమాణము వేఱు. రెండును చిన్న పెద్ద పరిమాణములుగలవిగాన అది కుదురదు. పోని అవయవమందు అవయవి ఏకదేశ రూపముగానున్నదన్నచో అపుడు ఆయవయవమందు అవయవి ఆయవయవరూపముగా నుండునా లేక యితరావయవ రూపముగా నుండునా? తనయందు తానుండుట కుదురదు. ఇతరావయవము ఇతరావయవమందుండు టెట్లు, కాన యెట్లును గుదురదని యాక్షేపము.

మూ. తేషుచావృత్తే రవయవ్యభావః.

8 సూ. ఆయవయవములందు వానికంటె వేఱుగా అవయవి లేకపోవుటచే అవయవి యనునది లేదు.

మూ. పృథక్ చావయవేభ్యోఽవృత్తేః.

9. సూ. అవయవములకంటె వేఱుగా మఱియొకచోట అవయవి లేకపోవుటవలనను అవయవి యనునది లేదు.

అవయవములకంటె వేఱుగా మఱియొకచోట అవయవియున్నదన్నచో అవయవి నిత్యము గావలసివచ్చును.

మూ. నచావయవ్యవయవాః.

10. సూ. మఱి యవయవియును అవయవమునుగూడ ఒక్కటేగావు.

నూలుపోగును బట్టయని గోడను గృహమనిగాని యెవరును అనరు. అట్లన్నచో ఆ రెండిటికి ఆధారాధేయభావముగూడఁ గుదురదు.

మూ: ఏ కస్మిన్ భేదాభావాద్భేద ప్రయోగానుపపత్తే రప్రశ్నః.

11. సూ ఒక పేరయిన యవయవియందు భేదము లేకపోవుటవలన అది వేఱు ఇది వేఱు అని భేదార్థకశబ్దమును ఉపయోగించుట యనుపపన్నము. కాన అవయవములందు అవయవి సంపూర్ణముగానున్నదా ఏకదేశముగానున్నదా అను ప్రశ్న యుక్తముగాదు.

అనేకములందు అశేషముగానుండుట సంపూర్ణత్వము, సముదాయములో, గొంతభాగమునందు మాత్రమె యుండుట ఏకదేశిత్వము. ఆ రెండును ఒక దానికే యుండుట సంభవింపదని భావము.

మూ. అవయవాంతర భావేఽప్యవృత్తే రహేతుః.

12. సూ. అవయవికంటె వేఱుగా అవయవము ఉన్నదన్నను ఘటావయవములందు ఘటత్వాదికమువలె అవయవి స్వరూపముతోనే యుండుట సంభవించుటవలన "సంపూర్ణముగాగాని ఏకదేశముగాగాని యవయవి యుండకపోవుటవలన" అను హేతువు యుక్తమైనదిగాదు.

మూ. కేశ సమూహే తైమిరి కోపలబ్ధి వత్తదుపలబ్ధిః.

13. సూ. నేత్రరోగమున్నవానికి ఒక్కొక్క వెండ్రుక కనిపింపక వెండ్రుకల సమూహము మాత్రము గనిపించునట్లు పరమాణువొకటి మాత్రము గనిపింపక పరమాణు సమూహరూపమగు ఘటాదులు గనిపించుచున్నవి.

"అవయవి సిద్ధింపకపోయినచో సర్వపదార్థములను గ్రహించుటకు వీలుపడదు" అను పూర్వోక్తాక్షేపమునకిది యాక్షేపము (చూ. అధ్యా. ౨. ఆహ్ని ౧. సూత్ర. ౩౪)

మూ. స్వవిష యానతిక్రమేణేంద్రియస్య పటుమంద భావాద్విషయ గ్రహణస్య తస్యాభావో నావిషయే ప్రవృత్తిః.

14. సూ. ఇంద్రియములు తమ పాటవమునుబట్టియు మాంద్యమునుబట్టియు స్వవిషయములను అతిక్రమింపకుండ విషయములను గ్రహించునే గాని తమకు విషయముగాని వాని విషయమై ప్రవర్తింపవు.

కన్ను ఎక్కువ పాటవము గలిగినదైనను తనకు విషయములైన రూపములను గ్రహించునేగాని తనకు విషయముగాని గంధాదులను గ్రహింపదు

అణువులు అతీంద్రియ విషయములు, అణుసముదాయమె ఇంద్రియ విషయమగును. ఆ యింద్రియములు స్వస్వవిషయములను గ్రహించును. కాన పై సూత్రమునఁ జెప్పినది యుక్తముగాదని భావము.

మూ. అవయవావయవి ప్రసంగ శ్చైన మాప్రళయాత్.

15. సూ. అవయవిని అంగీకరించినచో పెద్దది చిన్నవానికి అవయవి గను చిన్నవి యవయవములుగను తిరుగ దానిని విభజింపఁగా మరల పెద్దది యవయవి చిన్నవి యవయవములుగను అయి ప్రళయమువఱకు అవయవిగను అవయవములుగను అగుచుఁ జివరకు నేదియు లేకపోవలసివచ్చును.

కనుక అవయవి సిద్ధింపకపోయినచో సర్వ పదార్థములను గ్రహించుటకు వీలుపడదనుట బాగుగనేయున్నదని భావము.

మూ. న ప్రళయోఽణు సద్భావాత్.

16. సూ. ఘటాదులు నశించినను వానికి ఆశ్రయములైన పరమాణువులు నశింపక యుండునుగాన సర్వము నశించుననరాదు.

ఆశ్రయములగు పరమాణువులు నశింపవుగాన వానివలన సృష్టిగలుగును గాన సర్వ ప్రళయ మగుననరాదని భావము.

మూ. పరంవా త్రుటేః.

17. సూ. త్రుటియొక్క యతి సూక్ష్మమైన విభాగమే పరమాణువు.

త్రుటి అనఁగా ఎండలోఁ గిటికీల యందుఁ గనిపించు సూక్ష్మ రేణువు. విభజింపఁగా విభజింపఁగా వచ్చియింక విభజింప శక్యముగాని భాగమే పరమాణువు. కాన దానికి నాశము లేదని భావము.

ఇది

అవయవావయవి ప్రకరణము

మూ. ఆకాశ వ్యతిభేదాత్ తదనుపపత్తిః.

18. సూ. పరమాణువు యొక్క లోపలను పైని ఆకాశము కలిసి యుండుట వలనఁ బరమాణువు నిరవయవముగాదు. పరమాణువు నిరవయవముగానపుడు అనిత్య మగును.

కాన సర్వప్రళయము గలుగునని సర్వముశూన్యమునని మరల ఆక్షే పింపఁబడుచున్నది.

మూ. ఆకాశాసర్వగతత్వం వా.

19. సూ. పరమాణువు లోపల ఆకాశము లేదన్నచో ఆకాశము సర్వ వ్యాపకమును గాకపోవలసివచ్చును.

మూ. అంతర్బహిశ్చ కార్యద్రవ్యస్య కారణాంతర వచనా దకార్యే తదభావః.

20. సూ. లోపల పైని అను పదములచేత కార్య ద్రవ్యముల యొక్క యితరకారణములె చెప్పఁబడుటవలన కార్యములకె లోపల పైని అనునవి యుండును గాని కార్యముగాని పరమాణువులకు లోపల పైని అనునవి యుండవు.

మూ. శబ్ద సంయోగ విభవాచ్చ సర్వగతం.

21. సూ. పుట్టిన శబ్దములును, మన స్సంయోగమును పరమాణు తత్కార్యముల సంయోగమును ఆకాశమందంతట వ్యాపించి యుండుట వలనను ఆకాశము సర్వవ్యాపకము.

ఆకాశముచే సంయోగము పొందని మూర్త ద్రవ్యమేదియు నుండదు కాన ఆకాశము సర్వగతమని భావము.

మూ. అవ్యూహావిష్టంభ విభుత్వాని చాకాశధర్మాః.

22. సూ. అడ్డు తగిలి వెనుకకు మరలింపక పోవుటయు ఉత్తరోత్తర ప్రదేశమున నడ్డు తగలక పోవుటయును వ్యాపకత్వమును ఆకాశధర్మములు.

మూ. మూర్తిమతాంచ సంస్థానోపపత్తే రవయవ సద్భావః.

23. సూ: మూర్తి గలిగిన ద్రవ్యములు గుండ్రముగఁగాని కోలగాఁగాని నలుచతురముగాఁగాని ఇంక నితరమైన సన్నివేశ రూపమైన యాకారములు గలిగి యుండుట యుపపన్నమగుట వలనఁ బరమాణువులకు అవయవము లుండును.

మూ. సంయోగోపపత్తేశ్చ.

24. సూ. పరమాణువుల కితర పరమాణువులతో సంయోగమును ఉప పన్నమగుట వలనను పరమాణువులు సావయవములు.

ఆ పరమాణువులకు ఇతర పరమాణువులతో సంయోగమును వాని మధ్య అవకాశమును, అవకాశముండుటను బట్టి సావయవత్వమును గలుగునని యాక్షేపణము.

మూ. అనవస్థా కారిత్వా దనవస్థానుప పత్తే శ్చాప్రతిషేధః.

25. సూ. పరమాణువు సావయవమన్నచో అత్యల్ప భాగములకు అనవస్థయు సర్వవిధమైనవి అనవస్థతోఁగూడిన యవయవములు గలవన్నచో మేరు పర్వతము ఆవగింజ మొదలగు వానియందు తుల్యపరిమాణత్వమును అంగీకరింపవలసివచ్చుటయు సంపవించుటవలనను "పరమాణువు నిరవయవముగాదు" అని ప్రతిషేధింపరాదు.

ఇది

నిరవయవ ప్రకరణము

—(౦)—

మూ. బుద్ధ్యా వివేచనాత్తు భావానాం యాథాత్మ్యానుపలబ్ధివత్ తదనుపలబ్ధిః.

26. సూ. ఇది దారము ఇది దారము అని వేఱువేఱుగా దారములను విడఁదీసి చెప్పఁగా నింక వస్త్రమనునది వేఱుగా నుపలబ్ధము గానట్లు బుద్ధితో వివేచన చేయుటవల్ల భావములు వాస్తవముగ ఉపలబ్ధ మగుటలేదు. వానికి సంబధించినజ్ఞానములేగాని, ఆ పదార్థములు ఉపలబ్ధముగావు.

మూ. వ్యాహతత్వా దహేతుః.

27. సూ. వ్యాఘాత ముండుట వల్లఁ బై హేతువు యుక్తముగాదు. బుద్ధితో వివేచనచేయఁగా ఏదారమున కాదారము విడఁదీయఁగా బట్టకు దారముల రూపము గలుగుట సిద్ధింపదు. కాని దారములవల్ల బట్టయగుచున్నది యని ప్రతీతి కలుగు చున్నది గాని దారములే బట్ట అని ప్రతీతి కలుగుటలేదు. ఇట్లే బట్టచేత నేకప్పుకొనుట కుదురునుగాని దారములచేఁ గుదురదు. మఱి దారములను బట్టను వివేచనము చేయుటవల్ల బాహ్యవస్తు వున్నట్లు సిద్ధించుచున్నది. (పరస్పరము అసంబద్ధముగా నుండుటవలన) కార్యద్రవ్యము కారణద్రవ్యముల కంటె వేఱుగా గ్రహింపఁ బడుటలేదు.

మూ. తదాశ్రయత్వా దపృథగ్గ్రహణం.

28. కార్యమగువస్త్రము కారణమగు దారముల నాశ్రయించిన దగుటచేత వస్త్రమనునది దారములకంటె వేఱైనదిగా గ్రహింపఁ బడుటలేదు.

మూ. ప్రమాణత శ్చార్థ ప్రతిపత్తేః.

29. సూ. ప్రత్యక్షాది ప్రమాణములను బట్టి ఘటాది పదార్థ ప్రతీతి గలుగు చుండుటవలన బుద్ధిచేఁ బదార్థ వివేచన గలుగుచున్నది.

పదార్థ ప్రతీతియే గలుగనుచో ఆపదార్థములకు సంబంధించిన జ్ఞానము గూడఁ గలుగక పోవచ్చునని భావము.

మూ. ప్రమా ణానుపప త్త్యుపప త్తిభ్యాం.

30. సూ. ప్రమాణము ఉపపన్న మగుటను బట్టియు గొన్నిచోట్ల అనుపన్న మగుటను బట్టియు వ్యాఘాతముండుట చేత "బాహ్యవస్తువులేదు" అన రాదు.

ఘటాదులందుఁ బ్రమాణమున్న దందమా దానివల్లనే బాహ్యార్థములు సిద్ధించును. ప్రమాణము లేదందుమా అపుడు ఘటజ్ఞానమునకు ఘటాకారమెట్లు. కాన బాహ్యవస్తువు లేదు అనరాదని భావము.

మూ. స్వప్న విషయాభిమానవదయం ప్రమాణ ప్రమేయాభిమానః.

31. సూ. స్వప్నములో వస్తువు లేకున్నను ఉన్నదని యభిమానము గలుగునట్లు వస్తు విషయక ప్రమాణ ప్రమేయముల యభిమానము గలుగును.

మూ. మాయా గంధర్వనగర మృగతృష్ణికా వద్వా.

32 సూ. లేక ఇంద్రజాలమందలి మాయాగంధర్వ నగరాదులవలె గాని ఎండమావులందలి జలప్రతీతివలెఁ గాని వస్తుప్రతీతి కలుగును.

ప్రమాణ ప్రమేయ వ్యవహారము వాస్తవముగాదు. విజ్ఞానములె ఆ మాయాకారములు గలిగి వాసనా పరిపాకము వలన స్వప్న జ్ఞానమువలె ఇంద్ర జాల ప్రతీతివలెను గలుగునని ఈ సూత్రములచే శంకింప బడుచున్నది.

మూ॥ హేత్వభావా దసిద్ధిః

33. సూ. "బాహ్యవస్తువులేదు"అని చెప్పుటలో ప్రమాణము లేకపోవుట వలన బాహ్యవస్తువులేదు"

చక్షురాది ప్రమాణములచేతబట్టి బాహ్యవస్తువులు సిద్ధించునని భావము.

మూ. స్మృతి సంకల్పవచ్చ స్వప్నవిషయాభిమానః.

34. సూ. స్మృతి సంకల్పములవలె స్వప్న విషయాభిమానము కూడ పూర్వోపలబ్ధి విషయకమైనది.

పూర్వము అనుభవించిన విషయములు స్మరణకువచ్చినట్లు పూర్వవస్తువులె స్వప్నమందు వచ్చునుగాన స్వప్నవిషయములు అంతకుపూర్వము లేనివిగావని భావము.

మూ. మిథ్యోపలబ్ధి వినాశ స్తత్త్వజ్ఞానాత్ స్వప్న విషయాభిమాన ప్రణాశవత్ ప్రతిబోధే.

35. సూ మెలుకువ వచ్చినపుడు స్వప్న విషయాభిమానము నశించి నట్లు తత్త్వ విజ్ఞానమువలన మిథ్యాపదార్థోపలబ్ధి నశించును.

మిథ్యాపదార్థోపలబ్ధి = స్థాణ్వాది పదార్థములందు జరుగు భ్రాంతి జ్ఞానము.

మూ. బుద్ధేశ్చైవం నిమిత్తసద్భావోపలంభాత్.

36. సూ. మిథ్యాబుద్ధికి నిమిత్తమును అస్తిత్వమును ఉన్నట్లు ఉపలబ్ధి మగుటవలనను బాహ్యవస్తువువలె మిథ్యాబుద్ధియు గలదుగాన మిథ్యాబుద్ధిలేదని ప్రతిషేధింపరాదు.

మూ. తత్త్వప్రధాన భేదాచ్చ మిథ్యాబుద్ధే ర్ద్వైవిధ్యోపపత్తిః

37. సూ. వస్తుతత్త్వమునకు ప్రధానములతో భేదముండుటవలన మిధ్యాబుద్ధిరెండువిధములుగనుండుట యుపపన్నమగుచున్నది.

స్థాణువునందు స్థాణుత్వబుద్ధి వస్తుతత్త్వము స్థాణువునందు పురుషత్వము ఆరోపించెడి బుద్ధిప్రధానము. స్థాణువునందు బురుషుడని, రాజునందు

పాముని బెడ్డయందు పావురమని యిట్లు మిథ్యాబుద్ధి గలుగుచున్నది. కాన ప్రమాణ ప్రమేయబుద్ధులు మిథ్యలనుట యుక్తముగాదని భావము.

ఇది

బాహ్యార్థ భంగ నిరాకరణ ప్రకరణము

---

మూ. సమాధి విశేషాభ్యాసాత్.

38. సూ. సమాధి విశేషమును మాటిమాటికి అభ్యసించుటవలనఁ దత్త్వ జ్ఞానము వృద్ధిపొందును. ధ్యేయవిషయమందు మాత్రమె చిత్తైకాగ్రతయుండుట సమాధి. దానిని మాటిమాటికి అభ్యసించుటవలన తత్త్వజ్ఞానము వృద్ధిపొందును గాన "తత్త్వజ్ఞానము క్షణికము అందుచే తత్త్వజ్ఞానము పోఁగా మిథ్యాజ్ఞానము కలుగునని చెప్పరాదని మాటిమాటికి అభ్యసించుటవలనఁ దత్త్వజ్ఞానము నిలఁబడఁగా మిథ్యాజ్ఞానమున కవకాశము గలుగదని భావము.

మూ. న, అర్థవిశేష ప్రాబల్యాత్.

39. సూ. రాగద్వేషాద్యర్థ విశేషములు బుద్ధియందుఁ జిరకాలమునుండి ప్రబలముగానుంటుటవలనఁ దత్త్వజ్ఞానము గలుగదు.

మూ. క్షుదాదిభిః ప్రవర్తనాచ్చ.

40. సూ. క్షుత్పిపాసలచేతను శీతోష్ణ సుఖదుఃఖరోగాదుల చేతను బుద్ధులు అనిచ్ఛా పూర్వకముగఁ బ్రవర్తించుటవలనను చిత్తమునకు ఏకాగ్రత కుదురదు.

ఈ పై రెండు సూత్రములు పూర్వపక్ష సూత్రములు.

మూ. పూర్వకృత ఫలానుబంధా త్తదుత్పత్తిః.

41. సూ. పూర్వజన్మమందలి తత్త్వజ్ఞాన హేతుకమైన వివేక యోగాభ్యాసాది ఫలముల సంస్కారమునుబట్టి సమాధి కలుగును.

మూ. అరణ్యగుహాపులినాదిషు యోగాభ్యాసోపదేశః.

42. సూ. అరణ్యములు గుహలు ఇసుకతిన్నెలు మొదలగు వానియందు చిత్తైకాగ్రతకై యోగాభ్యాసము ఉపదేశింపఁబడుచున్నది.

మూ. అపవర్గేఽప్యేవం ప్రసంగః,

43. సూ. మోక్షమందుఁగూడ నిట్లే రాగాదులు ప్రబలముగనుండుట వలన మరల దుఃఖాది బుద్ధులు ప్రవర్తింపవలసివచ్చును.

మూ. న, నిష్పన్నావశ్యంభావిత్వాత్.

44. సూ. కర్మవశముచే నిష్పన్నములైన శరీరములు జ్ఞానాదులందుఁ దప్పక కారణములగుటవలన దుఃఖాదులు మోక్షమందుఁ గలుగవు.

మూ. తదభావశ్చాపవర్గే,

45. సూ. మోక్షమందు ధర్మాధర్మములను ప్రవర్తింపఁజేయు బుద్ధుల కాశ్రయమైన శరీరేంద్రియాదులు ఉండవు.

మూ. తదర్థం యమనియమాభ్యామాత్మసంస్కారో యోగాచ్చాధ్యాత్మవిధ్యుపాయైః.

46. సూ. మోక్షముకొఱకు యమ నియమములచేతను యోగశాస్త్రమందుఁ జెప్పఁబడిన యాత్మతత్త్వాధిగమ సాధనములచేతను ఆత్మను సంస్కరింపవలయును.

అహింస సత్యము అస్తేయము బ్రహ్మచర్యము అపరిగ్రహము ఇవి యమములు, శౌచము సంతృప్తి తపస్సు వేదపఠనము ఈశ్వరధ్యానము ఇవి నియమములు, ఆసనములు ప్రాణాయామము ఇంద్రియనిగ్రహధ్యానము ధారణ (నాభిచక్రమందు చిత్తమునుంచుట) సమాధి ఇవి ఆత్మతత్త్వమును దెలియఁజేయు సాధనములు.

మూ. జ్ఞానగ్రహణాభ్యాసస్తద్విద్యైశ్చ సహ సంవాదః.

47. సూ. మోక్షముకొఱకు జ్ఞానసంపాదనము, శ్రవణమననాద్యభ్యాసమును తత్త్వవిదులతో సంవాదమును జేయవలయును.

మూ. తం శిష్యగురు సబ్రహ్మచారి విశిష్ట శ్రేయోఽర్థిభిరనసూయిభిరభ్యుపేయాత్.

48. సూ. అసూయలేని శిష్యగురు సహాధ్యాయి విశిష్ట శ్రేయోఽభిలాషులతోఁగూడఁ గలిసి తత్త్వవిదుని సమీపింపవలయును.

మూ. ప్రతిపక్ష హీనమపి వా ప్రయోజనార్థ మర్థిత్వే.

49. సూ తత్త్వజ్ఞానమందుఁ గోరిక కలుగఁగా తత్త్వ నిర్ణయము కొఱకుఁ దాను ప్రతికూల పక్షములేనివాఁడై తత్త్వవిదుని సమీపింపవలెను.

ఇ ది

తత్త్వజ్ఞాన వివృద్ధి ప్రకరణము

—(౦)—

మూ. తత్త్వాధ్యవసాయ సంరక్షణార్థం జల్ప వితండే బీజ ప్రరోహ సంరక్షణార్థం కంటక శాఖావరణవత్.

50. సూ పశువులనుండి మొక్కలను సంరక్షించుటకై ముండ్లకంచెవలెను బరోక్త దోషములనుండి తత్త్వనిర్ణయమును రక్షించుటకయి జల్పములు వితండములును ఇదివఱకుఁ జెప్పఁబడినవి.

మూ. తాభ్యాం విగృహ్యకథనం.

51. సూ. వాదమున జయింపఁగోరిజల్పవితండవాదములను జేయవలెను, ముముక్షువులు మాత్రము వీతరాగులుగాన తత్త్వజ్ఞానేచ్ఛతోఁ గాక జయేచ్ఛతో వాదము చేయఁదగదని తెలియునది.

ఇ ది

నాలుగవ యధ్యాయమున రెండవ యాహ్నికము

# న్యాయ దర్శనము

## పంచమాధ్యాయము

### ప్రథమాహ్నికము

మూ. సాధర్మ్య వైధర్మ్యోత్కర్షాపకర్ష వర్ణ్యావర్ణ్యవికల్పసాధ్య ప్రాప్త్యప్రాప్తి ప్రసంగ ప్రతిదృష్టాంతానుత్పత్తి సంశయ ప్రకరణ హేత్వర్థాప త్త్యవిశేషోపప త్త్యుపలబ్ధ్యనుపలబ్ధి నిత్యానిత్య కార్యసమాః.

1. సూ. సాధర్మ్యసమము ౧ వైధర్మ్యసమము, ౨ ఉత్కర్షసమము ౩ అపకర్షసమము, ౪ వర్ణ్యసమము, ౫ అవర్ణ్యసమము, ౬ వికల్పసమము, ౭ సాధ్యసమము, ౮ ప్రాప్తిసమము, ౯ అప్రాప్తిసమము, ౧౦ ప్రసంగసమము, ౧౧ ప్రతిదృష్టాంతసమము, ౧౨ అనుత్పత్తిసమము, ౧౩ సంశయసమము, ౧౪ ప్రకరణసమము, ౧౫ అహేతుసమము, ౧౬ అర్థాపత్తిసమము, ౧౭ నిత్యసమము ౧౮ ఉపపత్తిసమము, ౧౯ ఉపలబ్ధిసమము, ౨౦ అనుపలబ్ధిసమము, ౨౧ నిత్యసమము, ౨౨ అనిత్యసమము, ౨౩ కార్యసమము, ౨౪ అనిజాతు లిరువదినాలుగు.

వివ: హేతువును గేవల సాధర్మ్యమునుబట్టిగాని, కేవల వైధర్మ్యమును బట్టిగాని ఖండించునది యని జాతి సామాన్యలక్షణము, వీని వివరణము ముందు సూత్రములతోఁ జూడఁదగును.

మూ. సాధర్మ్య వైధర్మ్యాభ్యా ముపసంహారే తద్ధర్మ విపర్యయోపపత్తేః సాధర్మ్య వైధర్మ్యసమౌ.

2. సూ. సాధ్యవిషయమును వాది నిరూపించి యుపసంహారము చేయఁగాఁ బ్రతివాది తిరుగ వ్యాప్తి నపేక్షింపని కేవలసాధర్మ్యముచే సాధ్య

ధర్మమును వ్యతిరేకముగ నుపపన్నమొనర్చినచో సాధర్మ్యసమమను జాతియుఁ, గేవల వైధర్మ్యముచే సాధ్యధర్మమును వ్యతిరేకముగ నుపపన్నమొనర్చినచో వైధర్మ్యసమమను జాతియునగును.

వివ: ఉదా:- "ఘటమువలెఁ గృతకమగుటవల్ల శబ్దము అనిత్యము. వ్యతిరేక దృష్టాంతముచే ఆకాశమువలెఁగాని" అని వాది యుపసంహారము చేయఁగాఁ బ్రతివాది "ఇది యిట్లుగాదు. అనిత్యమైన ఘటముయొక్క సాధర్మ్యము (సామ్యము)వలనఁగాని, నిత్యాకాశముయొక్క వైధర్మ్యమువలనఁగాని, శబ్దము అనిత్యమైనచో "అమూర్తమగుటవలన శబ్దము ఆకాశమువలె నిత్యము"అని చెప్పి "నిత్యాకాశ సాధర్మ్యమువల్ల ఆకాశమువలె అమూర్తమగుటవల్ల శబ్దము నిత్యముగా వలసివచ్చును" లేనిచో అనిత్యమును సాధించు విశేషహేతువు లేనపుడు ఏదో యొకానొక సాధర్మ్యముచే శబ్దమును అనిత్యముగా సాధించినచో ఇంకొక సాధర్మ్యముచే శబ్దము నిత్యము మాత్రము ఎందుకుఁగాదు అని వాదించుట సాధర్మ్య సమమగునని భావము. మఱియొక యుదా: ద్రవ్యము క్రియాహేతుగుణములతో సంబంధించియుండుటవలన ద్రవ్యమైనయాత్మ క్రియగలది. ద్రవ్యమైనమట్టిబెడ్డ క్రియాహేతుగుణయుక్తమై క్రియగలది ఆ మట్టి బెడ్డవలె నాత్మయు గ్రియగలది" అని వాది యుపసంహారము చేయఁగాఁ బ్రతివాది "సర్వవ్యాపకమగు ద్రవ్యము క్రియలేనిదిగాన నాత్మయుఁ గ్రియలేనిదే. వ్యాపకమైన యాకాశము క్రియలేనిది అట్లే యీ యాత్మయుఁ గ్రియలేనిది"అని యాకాశ సాధర్మ్యముచేత ఆత్మయుఁ గ్రియలేనిది గావలసివచ్చును. క్రియగల మట్టి బెడ్డతో సాధర్మ్యమువల్లఁ గ్రియలేనది యనియు నగుచున్నది. కానఁ గ్రియగలదియని సాధించు నింకొక విశేషహేతువును జెప్పవలయును. అట్టి విశేషహేతువును జెప్పనపుడు ఏదో యొక్క సాధర్మ్యముచే ఆత్మను గ్రియగలదానినిగా సాధించినచో నింకొక సాధర్మముచే ఆత్మ క్రియలేనిది మాత్రము ఎందుకుఁగాదు అని వాదించుట సాధర్మ్య సమమను జాతియగునని భావము. వైధర్మ్య సమమునకుదా: "ఘటమువలెఁ గృతకమగుటవలన శబ్దము అనిత్యము. వ్యతిరేక దృష్టాంతముచే ఆకాశమువలెఁగాని, అని వాది యుపసంహారము చేయఁగా బ్రతివాది "ఇట ఆకాశమును వైధర్మ్యముగా గ్రహించినట్లు ఘటభిన్నమైన పటమును వైధర్మ్యముగా గ్రహించి పటభిన్నమైన యాకాశకాలాదులు అమూర్తములైనట్లే పటభిన్నమైన ఘటమును

అమూర్తము గను. "అమూర్తమైనది నిత్యముగాన శబ్దము నిత్యము" అని చెప్పి యాకాశ వైధర్మ్యమున బట్టి శబ్దము అనిత్యము ను, పటవైధర్మ్యమును బట్టి నిత్యము ను గావలసివచ్చుచున్నది అనిత్యత్వమును సాధించు విశేష హేతువైనను జెప్పవలయును, అట్టి విశేష హేతువు లేనపుడు పటవైధర్మ్యముచే నిత్యమేల కుఁగాదు" అని వాదించుట వైధర్మ్యసమ మగునని భావము. మఱియొక యుదా: ఆత్మ వ్యాపకముగా నఁ గ్రియలేనిది క్రియగల ద్రవ్యము వ్యాపకము గాదు. ఎట్లన మట్టిబెడ్డ, ఆత్మ యట్టిదిగాదు కాన ఆత్మ క్రియలేనిది" అని వాది యుపసంహారము చేయఁగాఁ బ్రతివాది "క్రియలేని ద్రవ్యమైన యాకాశము క్రియా హేతు గుణరహితముగాఁ గనిపించుచున్నది. ఆత్మ మాత్రమట్లుగాదు కాన ఆత్మ క్రియలేనిది. క్రియగల మట్టిబెడ్డయొక్క వైధర్మ్యమునుబట్టి యాత్మ క్రియలేది గావలసివచ్చును అని యాక్షేపించి క్రియగలదియని తెలుపు విశేష హేతువును జెప్పవలయును. అట్టి విశేష హేతువులేనపుడు వైధర్మ మునుబట్టి యాత్మ క్రియలేనిదిగా ఎందుకుఁగాదు. "అని వాదించుట వైధర్మ్యసమ మను జాతి యని భావము. వీనిని సత్ప్రతి పక్షదేశ నాభాసము లందురు.

మూ. గోత్వాద్గో సిద్ధివత్తత్సిద్ధిః.

తె. సూ. గోత్వమునుబట్టి గోవ్యవహారము సిద్ధించినట్లు వ్యాప్తితోఁ గూడిన పక్షధర్మతగల కృతకత్వాది హేతువులవలన శబ్దాదులందు అనిత్యత్వాదులు సిద్ధించును

వివ: గోవునందు మాత్రమె గల గోత్వమునుబట్టి యనఁగా గంగడోలు గలిగియుండుటనుబట్టి గోవ్యవహారము సిద్ధించును, గంగడోలులేనివి గోవులు గావు అనువ్యాప్తినిబట్టిగోవ్యవహారము సిద్ధించినట్లే యెక్కడెక్కడఁగృతకత్వము గలదో యక్కడక్కడ అనిత్యత్వము గలదు. కృతకత్వము లేని చోట అనిత్యత్వములేదు ఎట్లన ఆత్మవలె. ఇక్కడ వ్యాప్తి విశిష్టమగు పక్ష ధర్మతగలదు గానఁ గృతకత్వ హేతువువలన శబ్దమునకు అనిత్యత్వము సిద్ధించినది. ప్రతివాది చెప్పినదానిలో వ్యాప్తిలేదుగాన నిత్యత్వము సిద్ధింపదు. ఎక్కడెక్కడ అమూర్తత్వముగలదో అక్కడ నిత్యత్వమున్నది అనువ్యాప్తి సరియైనదిగాదు. అట్లే యైనచో అమూర్తములునిత్యములునగు వాయ్వాదులందును నిత్యత్వము సిద్ధి పవలసివచ్చును. కాన అమూర్తమగుటవలన అను హేతువులో వ్యాపి విశిష్ట పక్ష ధర్మతా జ్ఞానములేదుగాన ఈ హేతువు దుష్టమైనది. సాహచర్య నియమము

గదా వ్యాప్తియనఁగ. ఎక్కడెక్కడ పొగయున్నచో యక్కడక్కడనిప్పుగలదు నిప్పులేనిచోటఁ బొగలేదు. అనుసాహచర్య నియమము వ్యాప్తి, అట్టివ్యాప్తితోఁ గూడిన పక్షధర్మత (సందేహింపఁబడిన సాధ్యముగలది పక్షము) ఇటలేదుగానఁ బ్రతివాది చూపినది యుక్తముగాదని భావము, కానఁగేవల సాధర్మ్యముచేతఁ గాని సాధ్యమును సాధించుచో సాధ్యవ్యవస్థయుంతదు. ఈ ధర్మసమము మొదలగువానితో అట్టిదోషములుండుటచేత ఇవి జాతులుఅనఁగా హేత్వాభాసములనఁబడెనని తెలియనది.

ఇది

## సత్ప్రతి పక్షదేశ నాభాస ప్రకరణము

మూ. సాధ్యదృష్టాంత యోర్ధర్మ వికల్పా దుభయసాధ్యత్వా చ్చోత్కర్షాపకర్ష వర్ణ్యా వర్ణ్య వికల్పసాధ్యసమాః.

4. సూ. సాధ్యదృష్టాంతములలో ఏదో యొక దానియందు ధర్మవైవిధ్యముండుటవలన, ఉత్కర్షసమము, అపకర్షసమము, వర్ణ్యసమము, అవర్ణ్యసమమువికల్పసమము, అనుజాతులైదును, పక్షదృష్టాంతములు రెండును సాధింపఁదగియుండుటవలన సాధ్యసమమను జాతియనగు.

వివ: వ్యాప్తిని బురస్కరింపక పక్షమందుఁగాని, దృష్టాంతమందుఁగాని సాధ్యసమములో ఏదో యొకదానిచే లేని క్రొత్తధర్మమును (ఉత్కర్ష ధర్మమును) బ్రసంగింపఁజేయుటయని ఫలితార్థము.

ఉదా: "కృతకమగుటవలన శబ్దము ఘటమువలె అనిత్యము" అని వాది స్థాపింపఁగాఁ బ్రతివాది యనిత్యత్వమును గృతకత్వమును ఘటమందు ఘటరూపముతోపాటు ఉన్నవిగాన ఘటమువలె శబ్దముగూడ రూపముగలదగును. ఘటమువలె రూపముగలదిగానిచో ఘటము అనిత్యమునుగాదు అనుననిష్టము నాపాదించుట యుత్కర్షసమమగునని భావము. ఇట వివక్షింపఁబడిన దానికంటె విపరీతమైన దానిని సాధించుటవలన హేతువు విశేషవిరుద్ధమైనది. ఇట్లే శ్రవణ యోగ్యమగు శబ్ద సాధర్మ్యమగు కృతకత్వమునుబట్టి ఘటముగూడ శ్రవణ యోగ్యమగును అని యాపాదించుట యుత్కర్షసమమగును.

ఉన్నధర్మమును తగ్గించుట యపకర్షసమము.

ఉదా: ఘటమువలెఁ గృతకమగుటవలన శబ్దము అనిత్యము అనివాది యనఁగాఁ బ్రతివాది అనిత్యత్వముతోపాటు ఘటమునందున్న కృతకత్వమును బట్టి శబ్దము అనిత్యమైనచో అప్పుడు కృతకత్వానిత్యత్వములతోపాటు శబ్ద సాధర్మ్యమునుబట్టి ఘటమందున్న రూపము నివర్తింపఁగా, ఘటమునందున్న రూపము నివర్తించునట్లు శబ్దమందలి కృతకత్వమును అనిత్యత్వమును నివర్తింప వలసివచ్చును అని యాపాదించుట యపకర్షసమము, అట్లే శబ్దమునందుఁ గృతకత్వముతోపాటు గల శ్రవణయోగ్యతా గుణముయొక్క సంబంధమువలన అనిత్యత్వ కృతకత్వములతోపాటు ఘటసాధర్మ్యమునుబట్టి శ్రావణగుణము నివర్తింపఁగా శబ్దమందు శ్రావణగుణము నివర్తించునట్లు ఘటమందు అనిత్యత్వ కృతకత్వములునునివర్తింపవలసివచ్చును అని యాపాదించుట యపకర్షసమమని తెలియునది.

పక్షమందున్నట్టియు, సాధ్యమును బోధింపఁజేయునట్టియునగు హేతువును దృష్టాంతమునందు వర్ణించుట వర్ణ్యసమము. దేనిని సాధింపఁదలఁతుమో యది యున్నదా లేదా యనుసందేహముగలది పక్షము దృష్టాంతమున సాధింపఁ దగినదానికి సందేహములేదుగాన దానినిబట్టి పక్షమందలి సందేహముగల సాధ్యమును సాధింతుము. ఇందు సాధ్యమును సాధించు హేతువును దృష్టాంతమందుఁ గూడ వర్ణించుటచే దృష్టాంతముగూడ సందేహముగలదగును. కాన నిది వర్ణ్యసమ మనుజాతియయినది.

ఉదా: ఘటమువలెఁ గృతకమగుటవలన శబ్దము అనిత్యము. అనుచో ఘట దృష్టాంతమునుబట్టి శబ్దమందు అనిత్యత్వము సాధింపఁబడుచున్నది. ఇట దృష్టాంతమగు ఘటమునందును గృతకత్వమునుబట్టి అనిత్యత్వమును వర్ణించి సాధింపుమట్లు గానిచో శబ్దమును అనిత్యముగానేరదు అనుట వర్ణ్యసమమగునని భావము. ఏది దృష్టాంతముగా స్వీకరించినను దానియందుఁ గృతకత్వాదులను బట్టి సాధ్యమును సాధింపుమని యాక్షేపించుటవలన నింక దృష్టాంతమేలేదని ప్రతివాది యాక్షేపించుట వర్ణ్యసమజాతి యగునని భావము. దీనిని తద్దేశనా భాసమందురు. పై దానికి విరుద్ధముగా అనఁగా దృష్టాంతమందుఁగల సిద్ధ సాధ్యముగల హేతువును పక్షమందు వర్ణించుట యవర్ణ్యసమము.

ఉదా: ఘటమువలెఁ గృతకమగుటవలన శబ్దము అనిత్యము అనుచోఁ గృతకత్వ సాధర్మ్యమునుబట్టి ఘటమువలె శబ్దమును నిశ్చయముగ అనిత్యమే.

అని దృష్టాంతమునందు నిశ్చితసాధ్యముగల హేతువు అనిశ్చిత సాధ్యముగల పక్షమైన శబ్దమునందు వర్ణింపఁబడుచున్నది. దృష్టాంతమైన ఘటమందలి హేతువునుబట్టియె శబ్దమునందు నిత్యత్వము సిద్ధించుచుండఁగా నింకవేఱుగా శబ్దమునందు అనిత్యత్వ సాధనప్రశ్నమయేల యనిభావము. పక్షమందు సందేహమున్నఁగదా సాధించుట. పక్షమందుసందేహమేలేనపుడు ఇంక దేనిచే దేనినిసాధింతుము పక్షములేదు దృష్టాంతములేదు కానఁ బక్షమన్నదే లేదు అనఁగా ఆశ్రయమేలేదు కాన ఆశ్రయాసిద్ధమగుచున్నది దీనిని అసిద్ధి దేశనాభాసమందురు. సాధన ధర్మములతోఁగూడిన దృష్టాంతమందు ఇతర ధర్మముల వికల్పమువల్ల సాధ్య ధర్మముల వికల్పములను బ్రసంగింపఁజేయుట వికల్పసమమనుజాతి. వికల్పమనఁగా ఒక దానియందు అదియు నుండును ఇదియు నుండును అని యనేక ధర్మముల నాపాదించుట.

ఉదా: క్రియాహేతుగుణయుక్తమైనవికొన్ని గురుత్వముగలవి బెడ్డవలె. కొన్ని తేలికయైనవి వాయువువలె. ఇట్లే క్రియాహేతుగుణ యుక్తమైనవి కొన్ని క్రియగలవి బెడ్డవలె కొన్ని క్రియలేనివి ఆత్మవలె.

ఇట్లు ఒకదానియందె గురుత్వ లఘుత్వములు, క్రియాసహితత్వ క్రియా రహితత్వములు విరుద్ధధర్మములు గలిగియుండునట్లు ఆపాదించుట వికల్ప సమమని భావము మఱియొక యుదా:

"ఘటములెఁ గృతకమగుటవలన శబ్దము" అనిత్యమనుచో ద్రవ్యమగు ఘటముగట్టిగనున్నది మఱియు ద్రవ్యమైన వస్త్రాదులు మెత్తగనున్నవి ఇట్లు ఒక నిత్యత్వద్రవ్యమందె కఠినత్వ కోమలత్వ విరుద్ధ ధర్మములున్నట్లు శబ్దమునందు అనిత్యత్వములు రెండు నుండునని యాపాదించుట వికల్ప సమమగునని భావము.

హేత్వాద్యవయవములతో యోగముగల ధర్మము సాధ్యము. దానిని పక్ష దృష్టాంతాదులతోఁ దుల్యత్వమును బ్రసక్తముచేయుట సాధ్యసమము.

ఉదా: బెడ్డయెట్టిదో ఆత్మయు నట్టిదేయగు ఆత్మ క్రియగలది అనునని సాధ్యము. ఇట్లే బెడ్డయుఁ గ్రియగలది అనునదియును గూడ సాధ్యమే. బెడ్డ క్రియగలదిగానిచో ఆత్మయుఁ గ్రియగలదిగాదు అని యాపాదించుట సాధ్యసమమనిభావము దీనిని తద్దేశనాభాసమందురు.

మూ. కిం చిత్సాధర్మ్యా దుపసంహారసిద్ధే ర్వైధర్మ్యా దప్రతిషేధః.

౫. సూ. వ్యాప్తితోఁగూడిన సాధర్మ్యవిశేషమునుబట్టి సాధ్యముసిద్ధించుచుండఁగా, వ్యాప్తి నపేక్షింపని కేవలసాధర్మ్యమునుబట్టి ప్రతిషేధించుట సంభవింపదు.

వివ: ఉత్కర్షాపకర్ష సమములతో అనిత్యవ్యాప్యమగు కృతకత్వమును బట్టి శబ్దమునందు అనిత్యత్వమును సాధించుచున్నాము. కాని కృతకత్వము రూపమునకుఁగూడ వ్యాప్యముగాదు. అందువల్ల శబ్దమునందు రూపము నాపాదింపరాదు. ఇట్లే అనిత్యత్వము రూపవ్యాప్యముగాదు. అందువల్ల రూపములేక పోవుటవల్ల శబ్దమునందు అనిత్యత్వములేదని చెప్పరాదని భావము.

ఇట్లే వర్ణ్యసమమందుఁగూడ వ్యాప్యతా విశిష్టమగు సాధర్మ్య విశేషము గల హేతువులన సాధ్యము సిద్ధించును.

అట్టిహేతువు గలిగియుండుటయె దృష్టాంతములోఁ ప్రయోజకమగును. కాని పక్షమందెట్టి విశేష విశిష్టమగు హేతువుగలదో యట్టి హేతువు గలిగియుండుట మాత్రమెగాదు. అట్లుగానిచో దూషణముతో దృష్టాంతముగా నంగీకరింపఁదగినది యుండనే యుండకపోవలసివచ్చునని తెలియునది. సాధ్యమగు పక్షము సందిగ్ధముగానుండును గాన వాది ప్రతివాదులకు సందేహములేని దృష్టాంతమునుబట్టి పక్షమును సాధింపవలయును. దృష్టాంతమేలేనపుడు ఇంక పక్షమునుసాధించుటయెట్లు అని భావము. ఇట్లే అవర్ణ్యసమమందును గ్రహించునది. ఇట్లు వికల్పసమములోఁ ప్రకృత సాధ్య వ్యాప్యమగు ప్రకృతహేతువు సిద్ధించును కాని యేదో కొంత సాధ్యధర్మ్యమువల్లఁ ప్రతిషేధింపఁదగదు. సాధ్యసమములో వ్యాప్యమగు హేతువువల్లఁ పక్షము సిద్ధింపఁగా సాధ్యము సిద్ధించును. దీనిచే పక్షము దృష్టాంతము మొదలగునవిగూడ సాధింపఁబడవు. దీనిచే దృష్టాంతాదులను సాధింపవలసినచో ఎక్కడను సాధ్యము సిద్ధింపనే సిద్ధింపదు. దృష్టాంతమువల్లఁగదా సాధించుటకు దృష్టాంతమునే సాధింపవలసి వచ్చినచో నింక దేనివల్ల దేనిని సాధించుట వీలుపడును.

మూ. సాధ్యాతిదేశాచ్చ దృష్టాంతోపపత్తేః.

౬. సూ. దృష్టాంతమందు సాధ్యధర్మమును ఆరోపించి చెప్పుటవలన దృష్టాంతముకుదురును.గాన దానిని సాధింపవలసియుండుమని ప్రతిషేధింపరాదు.

వివ: దృష్టాంతమైన ఘటాదులందుఁ కృతకత్వాది ధర్మములు మాత్రమే గాని సర్వధర్మములు అతిదేశింపఁబడవు. అనఁగా ఘటాదులందలి కృతకత్వమును బట్టియే శబ్దాదులందు అనిత్యత్వమును సాధించుచున్నాము. సర్వధర్మములను బట్టి సామ్యము చెప్పుచో రెండిటికి అభేదము గలుగును. ఇందు ఘటము శబ్దమును భిన్నములెగాని యభిన్నములుగావు. ఈ రెండిటికిఁ గృతకత్వమందెగాని యితర ధర్మములందు సామ్యములేదుగాన పెద్దయెట్టిదో యాత్మయు నట్టిదేయని యీ రీతి అభేదకథనము సంభవింపరాదని భావము.

ఇ డి

జాతిషట్క ప్రకరణము

---

సూ॥ ప్రాప్య సాధ్యమప్రాప్య వా హేతోః ప్రాప్త్యాఽవిశిష్టత్వా దప్రాప్త్యాఽసాధకత్వాచ్చ ప్రాప్త్యప్రాప్తిసమౌ.

7. సూ. హేతువు సాధ్యమును బొంది సాధ్యమును సాధించునా? లేక సాధ్యమును బొందక సాధ్యమును సాధించునా? సాధ్యమును బొంది సాధించు నన్నచో సాధ్యముతో అభేదమును బొందుటచే సాధ్యముకంటె వేఱుగా సాధనము ఉండదుఅని ప్రతిషేధించుటచే ప్రాప్తిసమమను జాతియును, సాధ్యమును బొందక సాధించునన్నచో దీపాదులు వస్తువులనుబొందక వస్తువులను గనిపింపఁ జేయనట్లు సాధనము సాధ్యమును బొందకపోవుటచే సాధ్యమును సాధింపలేదు అని ప్రతిషేధించుటచే అప్రాప్తి సమమను జాతియునగును.

వివ: "శబ్దము కృతకమగుటవలన ఘటమువలె అనిత్యము" అను నుదాహరణములో కృతకమగుటవలన అను హేతువు సాధ్యముతో నభేదమొందుట వలన సాధ్యముకంటె వేఱుగా సాధ్యములేదుగాన సాధ్య సాధకముగాదనుట ప్రాప్తి సమమను జాతియగునని భావము. ఇట్లే పై యుదాహరణములో "కృతకమగుట వలన" అనుసాధ్యమును బొందక సాధించు ననుటయుఁ గుదురదు. లోకములో దీపాదుల కాంతి వస్తువులను సమీపించిగదా యావస్తువులను ప్రకాశింపఁజేయును. కాన సాధ్యమున బొందక సాధించుటయుఁ గుదురదు గాన నిది అప్రాప్తి సమ మనుజాతియు నగునని భావము.

మూ॥ ఘటాది నిష్పత్తిదర్శనాత్ పీడనే చాభిచారా దప్రతి షేధః.

8. సూ. దండాదులను బట్టి ఘటాదుల పుట్టుక గనిపించుటవల్ల హేతువు కర్తృకరణాదులనుబొందె శ్యేనాద్యభిచార హోమములంబట్టి శత్రు పీడన జరగుటవల్ల దృష్టవస్తువును బొందకయు హేతువు కార్యములను సాధించుటవల్ల పైని జెప్పిన ప్రతిషేధము సంభవింపదు.

వివ: వీనిని బ్రతికూల తర్కాదేశా నాభాసములందురు.

ఇ ది

ప్రాప్త్యప్రాప్తి సమ ప్రకరణము

---

మూ॥ దృష్టాంతస్య కారణా నపదేశాత్ ప్రత్యవస్థానాచ్చ ప్రతిదృష్టాంతేన ప్రసంగ ప్రతిదృష్టాంతసమౌ.

9. సూ. సాధ్యమును సాధించు దృష్టాంతమునకు నింకొక హేతువును జెప్పకపోవుటవల్లఁ బ్రసంగమునుబట్టి ప్రత్యవస్థానము చేయుటచేఁ (స్థిర పఱచుటచే) బ్రసంగసమమను జాతియు, వ్యతిరేక దృష్టాంతముచేతనే వ్యాప్తిని బురస్కరింపకుండఁ బ్రత్యవస్థానము చేయుటవల్లఁ బ్రతి దృష్టాంత సమమను జాతియునగును.

ఉదా: "ఆత్మ క్రియా గుణయుక్తమైనది మట్టిబెడ్డవలె" అనుచో మట్టిబెడ్డ వలె అను దృష్టాంతమున కనిత్యత్వమును సాధించు నింకొక హేతువును జెప్ప వలయునని యాక్షేపించుట ప్రసంగ సమమగునని భావము."

దానికి హేతువును దృష్టాంతమును జెప్పినచో మరల ఆ చెప్పినవానికి మఱియొక హేతువునుజెప్పవలసియుండును ఇట్లు అనవస్థ యేర్పడును. దీనిని అనవస్థాదేశ నాభాసమందురు. ప్రతిదృష్టాంతసమము:- "క్రియా గుణయోగము వల్ల ఆత్మ మట్టిబెడ్డవలెఁ గ్రియగలది" అని చెప్పఁగా క్రియా హేతుగుణ యుక్తమైన యాకాశము నిష్క్రియముగాఁగనిపించుచున్నదని ప్రతిదృష్టాంతము స్వీకరింపబడును. ఆకాశమునకుఁ గ్రియాగుణహేతుగుణమేమియనఁగా వాయు వనస్పతుల సంయోగమువలె సంస్కారము నపేక్షించు వాయుసంయోగమె ఆ

క్రియాహేతుగుణము అని చెప్పి అకాశమువలె ఆత్మయు నిష్క్రియమని ఆక్షేపించుట ప్రతిదృష్టాంత సమమగునని భావము. దీనిని బాధ ప్రతిరోధాన్యతర దేశనాభాసమందురు.

మూ. ప్రదీపోపాదాన ప్రసంగనివృత్తి వత్తద్వినివృత్తిః.

10. సూ. వస్తువులను జూపుటకై స్వీకరింపఁబడిన దీపమును జూపుటకు మఱియొక దీపము అనవసరమైనట్లు తెలియనిదానిని దెలుపుటకై చెప్పఁబడిన దృష్టాంతమునకు మఱియొక కారణమును దెలుపుట యనవసరముగానఁ బైని జెప్పిన ప్రతిషేధము యుక్తముగాదు

మూ. ప్రతిదృష్టాంత హేతుత్వేచ నాహేతు ర్దృష్టాంతః.

11. సూ. విశేష హేతువులేని ప్రతిదృష్టాంతమె హేతువైనపుడు దృష్టాంతము సాధ్యసాధకమగుటలో హేతవుగాకపోదు.

వివః ప్రతిదృష్టాంతమువలె దృష్టాంతముకూడ సాధ్యమును సాధించుచుండుటవల్లను దృష్టాంతము సహేతుకమై యధికబలముగలదగుటవలనఁ బైని జెప్పఁబడిన ప్రతిషేధము యుక్తముగాదని భావము.

ఇది

ప్రసంగసమ ప్రతిదృష్టాంతసమ ప్రకరణము

---

మూ. ప్రాగుత్పత్తేః కారణాభావా దనుత్పత్తి సమః.

12. సూ. పుట్టుకకుఁ బూర్వము హేతువు లేకపోవుటవలన అనుత్పత్తితోఁ బ్రత్యవస్థానముచేయుట యనుత్పత్తిసమము.

ఉదా: శబ్దము ఘటమువలెఁ బ్రయత్నోత్తర కాలజన్యమగుటవలన అనిత్యము, అని వాదిచెప్పఁగా "శబ్దోత్పత్తికిఁ బూర్వము శబ్దము పుట్టనిస్థితిలో నున్నదై ప్రయత్నోత్తర కాలజన్యముగ నుండకపోవుటచే అది యనిత్యమెట్లగును నిత్యమేయగును గాన నిత్యమునకుఁ బుట్టుకలేదు గదా" అని ప్రతివాది యనుత్పత్తితో సిద్ధాంతీకరించుట అనుత్పత్తి సమమగునని భావము. దీనిని అసిద్ధ్యాదిదేశనా భాసమందురు.

మూ. తదభావా దుత్పన్నస్య కారణోపపత్తే ర్నకారణ ప్రతిషేధః.

13 సూ. ఉత్పన్నమైన శబ్దాదులు శబ్దాదిరూపముగా నుండుటచేత శబ్దాదులకుఁ గారణము ఉపన్నమగుటవలనఁ గారణము లేదనరాదు.

వివ: శబ్దాదులు పుట్టకముందు శబ్దాదులు లేనేలేవు. శబ్దాదులు పుట్టుట వలననే యనిత్యములగుచున్నవి. శబ్దాదులు పుట్టినప్పుడు హేతువుండనే యున్నది. కానఁ బైనిజెప్పిన నిషేధము యుక్తముగాదని భావము.

ఇది

యనుత్పత్తి సమప్రకరణము

— (०) —

మూ. సామాన్య దృష్టాంతయో రైంద్రియకత్వే సమానే నిత్యా నిత్య సాధర్మ్యా త్సంశయ సమః.

14 సూ. నిత్యములగు గోత్వాది జాతి సామాన్యములును అనిత్యము లగు ఘటాది దృష్టాంతములును ఇంద్రియగ్రాహ్యములగుటలో సమానములెగాన నిత్యానిత్యములందు ఇంద్రియ గ్రాహ్యత్వాది సాధర్మ్యముండుటవలన అనిత్య సంశయముతో సిద్ధాంతపఱచుట సంశయసమ మను జాతియగును.

వివ: కార్యమగుటవలన శబ్దము ఘటమువలె అనిత్యము అని చెప్పఁగా నిత్యములగు గోత్వాది సామాన్యములందును అనిత్యములైన దృష్టాంతములగు ఘటాదులందును ఇంద్రియ గ్రాహ్యత్వము సమానము కనుక కార్యత్వమును బట్టి యనిత్యమును నిర్ణయించునట్లు నిత్యానిత్యత్వ సంశయ కారణమయిన యింద్రియ గ్రాహ్యత్వమునుబట్టి గోత్వాదులవలె నిత్యమేయగును అనిత్యమగుట యెట్లు అని అనిత్యత్వ సందేహము గలుగుచున్నది. ఇట్లే శబ్దము ఘటమువలెఁ బ్రయత్నోత్తర కాలజన్యమగుటవలన అనిత్యమును అనుచోట నిత్యమైన శబ్దత్వ జాతి సామాన్యమునందును అనిత్యమైన ఘటాదులందును ఇంద్రియ గ్రాహ్యత్వ మున్నదిగాన నింద్రియగ్రాహ్యత్వమునుబట్టి నిత్యమునగుచున్నది గాన అనిత్యత్వ మందు సందేహము కలుగుచున్నది. కనుక నిట్లు హేతుజ్ఞానమునందు అప్రామాణ్య శంకగలుగుటద్వారా సాధ్య సంశయము గలుగుటవలన నిది సంశయసమ మను జాతి యనఁబడినది. దీనిని సత్ప్రతి పక్షదేశనా భాస మందురు.

మూ. సాధర్మ్యాత్సంశయే న సంశయో వైధర్మ్యా దుభయథా వా సంశయేఽత్యంత సంశయ ప్రసంగో నిత్యత్వా నభ్యుపగమాచ్చ సామాన్య స్యాప్రతిషేధః.

15. సూ. సామాన్య సాధర్మ్యమునుబట్టి సంశయ మాపాదింపఁబడినను విశేషసాధర్మ్యమునుబట్టి సాధ్యనిశ్చయముగలుగును గాన సంశయముగలుగదు. అట్లు గాక సామాన్య సాధర్మ్యమునుబట్టి విశేషసాధర్మ్యమునుబట్టి యా రెండిటిని బట్టి సంశయము గలుగునన్నచో ఎల్లప్పుడు అన్నిచోట్ల సంశయమె గలుగవలసివచ్చును. విశేషధర్మమును గ్రహించినపుడు సామాన్యధర్మము నిత్యమును సంశయ జనకమైయుండునని యంగీకరింపకపోవుటవల్లనుగూడఁ బైని జెప్పిన ప్రతిషేధము యుక్తముగాదు.

వివ: ఎప్పుడును నిర్ణయమును జేయవలసినపుడు విశేషధర్మమును ఆశ్రయింపవలయునేగాని సామాన్యధర్మమును ఆశ్రయింపరాదు. అట్లు విశేష ధర్మమును ఆశ్రయింపక సామాన్యధర్మమునే ఆశ్రయించుచో అన్ని యెడల సంశయమెగలుగునని భావము. స్థాణువా పురుషుఁడా అను సంశయములో తల చేతులు మొదలగు విశేష ధర్మముల నాశ్రయించినఁగాని నిర్ణయముగాదు. లేనిచో ఎక్కడను నిశ్చయజ్ఞానముగలుగదని తెలియునది.

ఇది

సంశయసమమను ప్రకరణము

మూ. ఉభయ సాధర్మ్యాత్ ప్రక్రియాసిద్ధేః ప్రకరణసమః.

16. సూ. నిత్యానిత్యాదులు రెండిటి సాధర్మ్యమునుబట్టి ఒక దానికంటె నొక దానిని బ్రకృష్టముగాఁ గ్రియను సాధించుట ప్రకరణసమమను జాతియగును.

వివః వాది యేదో యొక విశేషసాధర్మ్యమునుబట్టి సాధ్యమును సాధింపఁగాఁ పతివాది వాది సాధించినదానికి (ప్రక్రియ=ప్రకరణము అనఁగా వ్యతిరేకముగాని) వ్యతిరేకముగా వాది నిత్యమనినఁ బ్రతివాది యనిత్యమని, వాది యనిత్యమనినఁ బ్రతివాది నిత్యమనియు సాధించుట ప్రకరణసమమని భావము.

ఉదా: శబ్దము కృతకమగుటవలన ఘటమువలె అనిత్యము అని వాది అనిత్యత్వసాధక హేతువుచే అనిత్యము అనఁగా శబ్దము శ్రావణ యోగ్యమగుట వలన శబ్దత్వమువలె నిత్యము అని ప్రతిపాది నిత్యత్వసాధక హేతువుచే నిత్యమని సాధించుట ప్రకరణసమమని భావము. ఇట్లే వాది "శబ్దము శ్రావణమగుట వల్ల నిత్యము" అన్నచో శబ్దము కృతకమగుటవల్ల అనిత్యము అని ప్రతివాది సాధించుట ప్రకరణసమమగునని భావము. వాది యన్నది ప్రతివాదికాదని నిషేధించుట యని ఫలితార్థము. దీనిని బాధదేశనాభాస మందురు.

మూ. ప్రత్ ప్రకరణా సిద్ధేః ప్రతిషేధానువపత్తిః ప్రతిబన్ధో పపత్తేః.

17. సూ. పక్షమునకు వేఱుగాఁ బ్రతిపక్షముఁడుటనుబట్టి ప్రతిపక్షము ఉపపన్నమగుటవలనఁ బ్రకరణము సిద్ధించుచున్నది అందుచే సాధ్యమును బ్రతిషేధించుట యుక్తముగాదు.

వివ: శ్రావణాది ప్రతిపక్షమునుబట్టి ప్రతిపక్షమును ఉపపన్నమగుట వలన సాధ్యమును బ్రతిషేధించుట యుక్తముగాదని భావము. కృతకత్వమును బట్టి యనిత్యత్వమును సాధించుట ప్రస్తుతము. శ్రావణత్వమునుబట్టి నిత్యత్వమును సాధించుటయప్రస్తుతము, పూర్వము సాధింపఁబడిన శ్రావణత్వముకంటె బ్రస్తుతమగు కృతకత్వము బలవంతమగుటవలన శ్రావణత్వముచేఁ గృతకత్వమునకు బాధకలుగదని భావము.

ఇది

ప్రకరణ సమము

—(o)—

మూ. త్రైకాల్యాసిద్ధేర్హేతో రహేతుసమః.

18. సూ. హేతువు త్రికాలములందును సిద్ధింపకపోవుటవలన అహేతు సమమనుజాతియగు.

వివ: హేతువు సాధ్యముకంటె ముందుండునో? సాధ్యమునకుఁ బిదప నుండునా? సాధ్యముతోపాటు కలిసియుండునా? దండాదులైన హేతువులు ఘటాది సాధ్యముకంటెఁ బూర్వముఉండునన్నచో సాధ్యములగు ఘటాదులు

లేనపుడు హేతువు దేనిని సాధించును. పిదప అన్నచో హేతువులేనపుడు ఇంక ఘటాదిసాధ్యములు దేనివల్ల సిద్ధించును. సాధ్యముతోపాటు కలిసియుండును నన్నచో ఏదిదేనికి హేతువు ఏదిదేనికి సాధ్యమగును. హేతుకార్యములొకే కాలమునందుండుటయెట్లు? దీనినిబట్టి హేతువు అహేతువంటి దగుచున్నది గాన అహేతుసమమను జాతియయెను. దీనిని ప్రతికూల తర్కదేశనాభాసమందురు.

మూ. న హేతుతః సాధ్యసిద్ధే స్త్రైకాల్యాసిద్ధిః.

19. సూ. హేతువునుబట్టి సాధ్యము సిద్ధించుటవల్ల హేతువు త్రికాలములందు సిద్ధింపదనరాదు.

వివ: హేతువునుబట్టి చేయవలసినది చేయఁబడుట, తెలియవలసినది తెలియబడుట ప్రత్యక్షముగాఁ గనిపించుటవలనఁ త్రికాలాసిద్ధిలేదని భావము.

మూ. ప్రతిషేధానుపపత్తేః ప్రతిషేద్ధవ్యాప్రతిషేధః.

20. సూ. హేతువేలేనపుడు లేని హేతువును ప్రతిషేధించుట యుపపన్నముగాకపోవుటవలనఁగూడఁ ప్రతిషేధింపఁదగినదానికి ప్రతిషేధములేదు.

వివ: హేతు ఫలభావమును ఖండించుటలోఁ ప్రతిషేధముగూడ నుపపన్నము గాకపోవుటవలనఁ ప్రతిషేధింపఁదగిన పరకీయ హేతువునకుఁ ప్రతిషేధములేదని భావము.

౩ ౭

అహేతుసమము

— (౦) —

మూ. అర్థాపత్తితః ప్రతిపక్షసిద్ధే రర్థాపత్తిసమః.

21. సూ. అర్థాపత్తినిబట్టి ప్రతిపక్షము సిద్ధించుటవలన అర్థాపత్తిసమమగును.

వివ: దేవదత్తుడు బలిసియున్నాఁడు పగలుభుజింపఁడు అనఁగా అసలు భుజింపనిచో బలిసియుండుట కుదురదుగాన రాత్రి భుజించునని సందర్భార్థమున సిద్ధించును. దీనిని అర్థాపత్తియందురు. శబ్దము అనిత్యము అనఁగా సందర్భార్థమునుబట్టి శబ్దమునకంటె నితరమైనదెల్ల నిత్యమై వచ్చుచున్నది. కనుక

అన్నియు నితరమైనవానిలోఁ జేరిపోవుటవలన దృష్టాంతము సిద్ధింపదు. విరోధమును గలుగదు. కృతకత్వమునుబట్టి యనిత్యమనఁగా నితర హేతువునుబట్టి నిత్యమని బాధవచ్చుచున్నది. సత్ప్రతిపక్షమును గలుగుచున్నది. అనుమానమునుబట్టి యనిత్యమనఁగాఁ బ్రత్యక్షమునుబట్టి నిత్యమనిబాధకలుగుచున్నది. విశేషవిధిసఁబటి యితర నిషేధములును ఫలించుననిభావము. దీనిని సర్వదోషదేశనాభాసమందురు.

మూ. అనుక్తా స్యార్థాపత్తేః పక్షహానేరుపపత్తి. రనుక్తత్వాదనైకాంతికత్వా చ్చార్థాపత్తేః.

22. సూ. అర్థమునబట్టి చెప్పఁబడనిదెల్ల అపన్నమగునన్నచోఁ, ఈ యర్థాపత్తి చెప్పఁబడనిదగుటవల్లను, పక్షమునకు హాని యుపపన్నమగును

వివ: అనిత్యపక్షమును సిద్ధింపఁజేయునప్పుడు నిత్యపక్షమునకు హాని యర్థాత్తుసిద్ధించుచున్నది నిత్యసాధర్మ్యమైన యస్పర్శత్వమునుబట్టి యాకాశమువలె శబ్దము నిత్యమైనచో అనిత్యసాధర్మ్యమగు ప్రయత్నోత్తర కాలజన్యత్వమునుబట్టి యనిత్యమని యర్థాత్తు సిద్ధించుచున్నది. కాన అనైకాంతికమగుచున్నందున నిత్యపక్షమునకు హాని కలుగుచున్నదనిభావము.

ఇది

యర్థాపత్తిసమము.



మూ. ఏకధర్మోపపత్తే రవిశేషే సర్వావిశేష ప్రసంగాత్ సద్భావోపపత్తే రవిశేషసమః.

23. సూ. ఒకటే ధర్మము రెండిటికి నుపపన్నమగుటవల్ల భిన్న వస్తువులు రెండిటికి అభేదముకలుగఁగా సద్వస్తుధర్మములగు సత్త్వప్రమేయత్వాదులు ఉపపన్నమగుటనుబట్టి సర్వవస్తువులకు అభిన్నత్వము లేకపోవుట ప్రసక్తమగుటవలన అవిశేషసమ మనుజాతియగును.

వివ: శబ్దమునందును ఘటమునందును కృతకత్వాదులు సమానమైన ధర్మములు, కాన శబ్దమును ఘటమును అనిత్యములైనందున వానియందు సత్తాప్రమేయత్వాదులుండుటవల్ల రెండిటికి భేదములేదు. ఇట్లే అన్నియు భిన్నములుగాకపోవలసివచ్చును. అన్నియు అభిన్నములైనపుడు పక్షము, ప్రతిపక్షము, జాతి అవాంతరజాతి మొదలగు భేదములు లేకపోవలసివచ్చును. అన్నియు అనిత్యమైనపుడు జాత్యాదులు నశింపవలసివచ్చును. ఇట్లు అవిశేషముగాఁ జెప్పి

ప్రతిఘటించుట యవిశేషసమమనుజాతి యగునని భావము. దీనిని ప్రతికూల తర్కదేశనాభాసమందురు.

మూ. క్వచిద్ధర్మానుపపత్తేః క్వచిచ్చోపపత్తేః. ప్రతిషేధాభావః.

24. సూ. ఒకచోట హేతువుయొక్క వ్యాప్త్యాదిధర్మములు అనుపపన్నములగుటవల్లను ఒకచోట ఉపపన్నములగుటవల్లను పైనిజెప్పిన ప్రతిషేధము సంభవింపదు.

వివ: వ్యాప్త్యాదిధర్మములు సత్త్వాదులందు అనుపపన్నములు సర్వము నిత్యము సత్తారూపమైనదగుటవలన, అనుచోట సందిగ్ధసాధ్యమగు పక్షము సర్వము అగుచున్నది. పక్షమున నిత్యత్వమును సాధింపవలయునన్నచో నిశ్చితసాధ్యమగు దృష్టాంత మొకటి యుండవలయును. సర్వము నిత్యము అనుచోట సర్వము పక్షమగుచున్నదిగాన, పక్షముకంటె వేఱుగా దృష్టాంతము సిద్ధింపనందున వ్యాప్తి కుదురదుగాన నీ హేతువు సాధ్యసాధకము గాదని భావము. కృతకత్వాదులందు వ్యాప్త్యాదిధర్మములు ఉపపన్నములు "శబ్దము ఘటమువలెఁ గృతకమగుటవల్ల అనిత్యము" అనుచోట శబ్దముకంటె వేఱుగా దృష్టాంతము సిద్ధించుచున్నదిగాన వ్యాప్తి కుదురును. కాన వ్యాప్తి యున్నచోట హేతువు సాధ్యసాధకమగునుగాని వ్యాప్తిలేనిచోట సాధకము గాదుగాన నీ హేతువు సరియైనదిగాదనిభావము.

౩ ౭

## అవిశేషసమప్రకరణము

---

మూ. ఉభయకారణోపపత్తే రుపపత్తి సమః.

25. సూ. పక్ష ప్రతి పక్షోభయకారణములు ఉపపన్నము లగుటవలన నుపపత్తిసమ మనుజాతియగును.

వివ: "శబ్దము కృతకమగుటవలన ఘటమువలె అనిత్యము" అనునది పక్షము. శబ్దము అస్పర్శలేనిదిగాన ఆకాశమువలె నిత్యము అనునది ప్రతిపక్షము ఇట్లు రెండు విధములైన కారణములఁబట్టి నిత్యత్వములు సిద్ధించునట్లు ఉపపత్తిని జెప్పి యెదుర్కొనుట యుపపత్తి సమమను జాతియగును. దానిని తద్దేశాభాసమందురు.

మూ. ఉపపత్తి కారణాభ్యనుజ్ఞానా దప్రతిషేధః.

26. సూ. ప్రమాణముయొక్క యుపపత్తికై వాదిచేఁజెప్పఁబడిన కారణములను నిషేధింపక దానిని అంగీకరించుటవల్లఁ బైనిజెప్పఁబడిన ప్రతిషేధము ఉపపన్నముగాదు.

వివ: పైయుదాహరణములలో వాదిచెప్పినకారణములు ఉపపన్నములుగ నంగీకరింపఁబడినవిగాని నిషేధింపఁబడలేదు. ఒకదానికె నిత్యత్వమును జెప్పవలసివచ్చుచున్నదని ఆక్షేపించుట తగదనిభావము.

ఇది

అనుత్పత్తి సమప్రకరణము

మూ. నిర్దిష్ట కారణాభావేఽప్యుపలంభాదుపలబ్ధిసమః.

27. సూ. వాక్యమందునిర్దేశింపఁబడినకారణము లేకపోయినను సాధ్యము ఉపలబ్ధమగుటవలన ఉపలబ్ధిసమ మను జాతియగును.

వివ: "పర్వతము ధూమముగలదిగాన నిప్పుగలది" యనునది యగ్ని నిశ్చయమునకై చెప్పఁబడుచున్నది. ధూమము లేకపోయినను ఆలోకాదులందు సాధ్యమగు నిప్పు లభించుచున్నదిగాన ధూమమువల్ల నిప్పును సాధించుట యుక్తముగాదని దోషము. దీనిని తద్దేశనాభాసమందురు.

మూ. కారణాంతరాదపి తద్ధర్మోపపత్తే రప్రతిషేధః.

28 సూ. ఇతర కారణమునుబట్టి కూడ ఆ సాధ్యము ఉపపన్నమగుట వలనఁ బైనిజెప్పిన ప్రతిషేధము లభింపదు.

వివ: ఆలోకాదులవల్లఁగూడ సాధ్యమగు వహ్ని యుపలబ్ధమగుచున్నది. అనఁగా ధూమకారణమునుబట్టి వహ్ని నిర్ధారణ ఇటఁజేయఁబడుటలేదు. వహ్ని సందేహనివారణకై ధూమకారణము చెప్పఁబడుటలేదు. కానఁగార్యకారణ నియమ మిందులేదు అందు ధూమములేని యాలోకమునుబట్టి నిప్పు లభించుచున్నదని ధూమమువల్ల నిప్పును సాధించుట యుక్తముగాదని ప్రతిషేధింపరాదనిభావము.

ఇది

ఉపలబ్ధి సమప్రకరణము

మూ. తదనుపలబ్ధే రనుపలంభాదభావసిద్ధౌ తద్విపరీతోపపత్తే రనుపలబ్ధి సమః.

29. సూ. ఆవరణాదుల యనుపలబ్ధి యుపలబ్ధముగాకపోవుటవలన దాని యభావము సిద్ధింపఁగాఁ దద్విపరీతమగు నస్తిత్వము ఉపపన్నమగుటవలన అనుపలబ్ధి సమమనుజాతియగును.

వివ: ఉచ్చారణమునకుఁ బూర్వము శబ్దము అనుపలబ్దమగుటవల్ల శబ్దము అనిత్యము. కుడ్యాదుల యావరణమువలన ఘటాదులు అనుపలబ్దమయినట్లు ఇందు శబ్దమునకు అట్టి యావరణము అనుపలబ్దమగుచున్నది అని వాదింపఁగా ఆయావరణానుపలబ్ధికూడ అనుపలబ్ధమగుచున్నది యని జాతివాది వాదింపఁగ అనుపలబ్ధి యనుపలబ్దమగుచున్నదన్నపుడు లేదని యభావము సిద్ధించును లేకపోవుటలేదు అన్నపుడు లేకపోవుట యనుదానికి విపరీతార్థముగ ఉన్నది యనునది యుపపన్నమై యావరణమున్నది యని ఫలించుటవల్ల అనుపలబ్ధి ప్రమాణముగల యావరణాభావములేదు ఆవరణమె యుపపన్నమగునని శబ్దానిత్యత్వములోఁ జెప్పఁబడిన బాధయుక్తముగాదని భావము. దీనిని ప్రతికూల తర్కదేశనాభాసమందురు.

మూ. అనుపలంభాత్మకత్వాదనుపబ్ధే రహేతుః.

30. సూ. ఉపలబ్ధము కాకపోవుటయన్నది ఉపలబ్ధముకాకపోపు రూపము గలదగుటవలన ఆవరణాదులు ఉపలబ్ధము కాకపోవుటవల అనుపలబ్ధిలేదన్నది హేతువుగాదు.

వివ: ఉపలబ్ధికి అనువిషయ మగునది యనుపలబ్ధిచే "అది యున్నదని తెలియును. అనుపలబ్ధికి విషయ మగునది అనులబ్ధిచే అదిలేదని తెలియును ఏ వస్తువులేదో అదియనుపలబ్ధికి విషయమగును. అనుప లభ్యమానమైనదై యదిలేదని ప్రతిజ్ఞచేయఁబడును. ఆవరణాదుల యనుపలబ్ధి యుపలబ్ధము కాక పోవుచున్నదను నీ విషయము స్వవిషయమైన యనుపలబ్ధియందుఁ బ్రవర్తించునదై స్వవిషయమును బ్రతిషేధింపదు. ప్రతిషేధింపఁబడని యావరణాద్యనుపలబ్ధిహేతువుగా నగుచున్నది. ఆవరణాదులుండుటవలన ఆవియుపలబ్ధికి విషయములు. ఆ యావరణాదులు ఉపలబ్దము గావలయును. అవి యుపలబ్ధము గానపుడు స్వవిషయ ప్రతిపాదకమగును యుపలబ్ధి లేకపోవుటవలన అనుపలబ్ధికి

విషయములగును. ఇట శబ్దమును గ్రహింపకుండజేయు నావరణ కారణములు లేవు. అవి లేవుగాన అనుపలబ్ధి సిద్ధించుచున్నది. అదె దానికి విషయమగును గాన బై దోషములేదని గాన నుచ్చారణకుం బూర్వము శబ్దలేదని భావము.

మూ. జ్ఞాన వికల్పానాంచ భావాభావ సంవేదనాదధ్యాత్మం.

31. సూ. ఆత్మయందు మనస్సుచే భావా భావరూపమైన జ్ఞాన విశేషములు తెలియుటవలనంగూడం బై నిజెప్పంబడిన ప్రతిషేధము యుక్తముగాదు.

వివ: ఘటమును జూచుచున్నాను చూచుటలేదు, అగ్నిని ఊహించు చున్నాను ఊహించుటలేదు అనుభావా భావజ్ఞాన విశేషములు రెండును సులభ ముగ గ్రహింప శక్యమగుటవలనం బై ప్రతిషేధము యుక్తముగాదని భావము. మనస్సుచే నుపలబ్ధియు అనుపలబ్ధియు గ్రహింపంబడుచున్నది. కాన అనుపలబ్ధము ఉపలబ్ధమగుటలేదని చెప్పి ప్రతిషేధింపరాదనిభావము.

ఇది

అనుపలబ్ధి సమప్రకరణము

మూ. సాధర్మ్యాత్తుల్య ధర్మోపపత్తేః సర్వానిత్యత్వ ప్రసంగా దనిత్యసమః.

32. సూ ఇతర వస్తు సాధర్మ్యమునుబట్టి తద్వస్తువుతో సమాన ధర్మ ములు ఉపపన్నమగుటచే అన్నిటికి అనిత్యత్వము ప్రసక్తమగుటవల్ల అనిత్య సమ మనుజాతియగును.

వివ: కృతకమగుటవల్ల ఘటమువలె శబ్దము అనిత్యము అనుచోట ఘట దృష్టాంతముయొక్క సాధర్మ్యమైన కృతకత్వమునుబట్టి దానితో సమాన ధర్మముగల శబ్దమందు అనిత్యత్వమును సాధించునెడల సత్తారూప సాధర్మ్య మునుబట్టి అన్నియు సద్రూపమైన వస్తువువలెగాన సర్వము అనిత్యము సద్రూప మగుటవలన ఘటమువలె. శబ్దము అనిత్యము అని చెప్పి ఆకాశముగూడ సద్రూప మేగాన ఆకాశము అనిత్యమగునని చెప్పి యనిత్యముతో నెదుర్కొనుట అనిత్య సమము. దీనిని ప్రతికూల తర్కదేశనాభాసమందురు.

మూ సాధర్మ్యా దసిద్ధేః ప్రతిషేధాసిద్ధిః ప్రతిషేధ్య సాధర్మ్యాచ్చ.

33. సూ. సత్తారూప సాధర్మ్యమునుబట్టి సాధ్యము సిద్ధింపకపోవుట వల్లను, ప్రతిషేధింపఁదగిన ప్రతిపక్షమునకుఁగూడ అది సాధర్మ్యమై యుండుట వల్లను జైనిజెప్పిన ప్రతిషేధము సిద్ధింపదు.

వివ: ఏదో యొక కొంత సాధర్మ్యమునుబట్టి యన్నిటికి సాధ్యధర్మము నాపాదించుటచే సత్తాదిరూప సాధర్మ్యమునుబట్టి శబ్దానిత్యత్వము ప్రత్యేకముగా సిద్ధింపకపోవుటవల్లను, ప్రతిషేధింపఁదగిన యాకాశనిత్యత్వాదులకుఁగూడ సత్తా రూపధర్మము సాధర్మ్యమగుటవల్లను ప్రతిషేధము సిద్ధింపదనిభావము. కనుక వ్యాప్తినిబట్టి నిర్ధారణచేయవలయునని భావము.

మూ. దృష్టాంతే చ సాధ్య సాధనభావేన ప్రజ్ఞాతస్య ధర్మస్య హేతుత్వాత్తస్య చోభయథాభావా న్నా విశేషః.

34. సూ వ్యాప్యవ్యాపకభావముతో దృష్టాంతమందున్నట్లు తెలియఁబడిన కృతకత్వాది రూపధర్మము సాధ్యమును సాధించు హేతువగుటవలన ఆకృతకత్వ హేతువు అన్వయ వ్యతిరేకములు రెండు విధములుగా కృతకత్వరూప హేతువు నందుండుటవలన సత్తాదిరూపముగా పక్ష ప్రతిపక్షములందు అవిశేషముగా నుండునని చెప్పఁబడినది సంభవింపదు.

వివ: ఎక్కడెక్కడఁ గృతకత్వమున్నదో యక్కడక్కడ అనిత్య మున్నది అని వ్యాప్యవ్యాపకభావముచే శబ్దమునందు అనిత్యత్వము సిద్ధించు చున్నది. ఎక్కడెక్కడ సత్తా ధర్మమున్నదో యక్కడక్కడ అనిత్యత్వ మున్నది అనుటకు నిత్యమైన యాకాశమందు ఆహేతువు వ్యభిచరించుచున్నది. ఆకాశము సత్తారూపధర్మముగలదైనను అనిత్యముగాదు కాన వ్యాప్తిసహితమే గాని వ్యాప్తిరహితమైనది సాధ్యసాధకముగాదని భావము.

ఇది

అనిత్య సమప్రకరణము

---

మూ. నిత్య మనిత్యభావా దనిత్యేనిత్య త్వోపపత్తే ర్నిత్య సమః.

35. సూ. అనిత్య వస్తువునందు అనిత్యత్వము నిత్యముగా నుండుటచే ఆ వస్తువులందు నిత్యత్వము సిద్ధించుచున్నదిగాన నిత్యసమ మనుజాతియగును.

వివ: శబ్దము కృతకమగుటవలన అనిత్యము అని సాధించుచున్నపుడు ఆ యనిత్యత్వము శబ్దమునందు నిత్యముగానున్నదా? అనిత్యముగానున్నదా? నిత్యముగానున్నదన్నచో అనిత్యత్వధర్మము నిత్యముగానున్నట్లే అనిత్యత్వ ధర్మముగల శబ్దమును నిత్యమేయగును. అనిత్యముగానున్నదన్నచో శబ్దమున అనిత్యత్వము అనిత్యముగానుండుటుగాన శబ్దమున నిత్యత్వమును సిద్ధించును నెట్లును నిత్యత్వము సిద్ధించునని యెదురొ్కనుట నిత్యసమమనుజాతి యగును. దీనిని తద్దేశనాభాసమందురు.

మూ. ప్రతిషేధ్యే నిత్యమనిత్యభావా దనిత్యే అనిత్యోపపత్తేః ప్రతిషేధాభావః.

36. సూ. నిత్యత్వమును బ్రతిషేధింపఁదగిన శబ్దాదివస్తువులందు నిత్య ముగా అనిత్యత్వముండుటవలన అనిత్యవస్తువులందు అనిత్యత్వము సిద్ధించు చున్నదిగానఁ బైనిజెప్పిన ప్రతిషేధము ప్రవర్తింపదు.

వివ: శబ్దమునందు నిత్యత్వము ప్రతిషేధింపఁదగియున్నది. ఆ శబ్దము నందు నిత్యముగా అనిత్యత్వమున్నది. ఇట్లు అనిత్యమైన శబ్దమునందు అనిత్య త్వము సిద్ధించుచున్నదిగానఁ బై ప్రతిషేధము పట్టదనిభావము.

ఇది

నిత్యసమప్రకరణము

—(౦)—

మూ. ప్రయత్నకార్యానేకత్వాత్ కార్యసమః.

37. సూ. ప్రయత్నమువలనఁ గలిగిన కార్యములనేకముగా నుండుట వలనఁ గార్యసమ మనుజాతియగును.

వివ: ప్రయత్నానంతర జన్యమగుటవలన శబ్దము అనిత్యము అనఁగాఁ బ్రయత్నానంతరమందుఁబుట్టు వస్తువు ఇదివఱకు లేనిదై యిప్పుడు కలుగు చున్నది. ఎట్లనఁగా ఘటాదికార్యము, అనిత్యవస్తువనఁగా ఇప్పుడు ఉండియు నింకముందుండనిదని భావము. మట్టి మొదలగువానివల్లఁ గుండ మొదలగునవి పుట్టుటయును మట్టిమొదలగునవి యడ్డుతీసివేయఁగా జలములభివ్యక్తమగుటయును బుట్టుకయేయగును. ఇచు శబ్దము పుట్టుచున్నదనఁగా ఆవరణము తీసివేయఁగా

ప్రకటమగుచున్నదని యర్థముగాన ఇదివరకున్న శబ్దమే ఆవరణాదులు తీసి వేయఁగాఁగలుగుచున్నది గాన ఇదివరకు శబ్దమే యిప్పుడు అభివ్యక్తమగుచున్నది గాన శబ్దము నిత్యముగావలసివచ్చును. అని కార్యముతోఁ బ్రతిఘటించుట కార్యసమమను జాతియగును.

మూ. కార్యాన్యత్వే ప్రయత్నావైహేతుత్వ మనుపలబ్ధికారణోపపత్తేః.

38. సూ. కార్యము కంటె నితరమైనచోట అనుపలబ్ధికిఁ గారణమైన యావరణాదిక ముపపన్నమగుటవల్ల శబ్ద మభివ్యక్తమగుటలో నావరణాభావరూప ప్రయత్నము కారణమనుట యుపపన్నము గాదు.

వివ: ప్రయత్నము చేసినపిదప ఏదైన యభివ్యక్తమైంచో అచ్చట కుడ్యాది వ్యవధానము అనుపలబ్ధికిఁ గారణమగుట యుపపన్నమగును. కుడ్యాదుల వ్యవధానము పోయినచోఁ బ్రయత్నానంతరమునఁ గాఁబోవువస్తువునకు అభివ్యక్తి కలుగునుగాని శబ్దానుపలబ్ధిఁ గుడ్యాదిక వ్యవధానములుండుట సంభవిపదుగాన వ్యవధానము తీసివేయఁగా శబ్దము అభివ్యక్తమగునని చెప్ప వీలుపడదు కాన శబ్దము ఉత్పన్నమగునేగాని యభివ్యక్తముగాదు కానఁ బైని జెప్పిన నిషేధము కుదురదని భావము.

ఇది

కార్యసమము

—(o)—

మూ. ప్రతిషేధేఽపి సమానో దోషః

39. సూ. ప్రతిషేధమందును దోషము సమానమే.

వివ: ఇట్లు జాతులద్వారా వాదించి ప్రతిఘటించువానికి సదుత్తరము లీయవలెనుగాని యసదుత్తరమీయరాదని తెలిపి, యసదుత్తరమిచ్చినచో అభిమతసిద్ధి కలుగదని తెలుపుటకు కథాభాసరూపమైన షట్పక్షిని సూత్రకారుడు దెలుపుచున్నాఁడు.

అనైకాంతిక మగుటవల్ల "ప్రయత్నానంతర జన్యమగుటవల్ల" అను హేతువు శబ్దమందు అనిత్యత్వమును సాధింపదని దోషముచెప్పినచోఁ బతివాది పక్షమందును "ప్రయత్నానంతరమున నభివ్యక్తమగుట వల్ల" అను హేతువును అనైకాంతికమగుటవలన "శబ్దమందు నిత్యత్వమును సాధింపదనిభావము.

మూ. సర్వత్రైవం.

40. సూ. ఈ కార్యసమజాతియందువలెనె యన్నిచోట్లను దెలియవలయును.

వివ: ఈ విధముగా అసదుత్తరము అన్నిజాతులందు సంభవించునని భావము.

ఉదా: శబ్దము శబ్దమగుటవలన అనిత్యము అనుచోట ఆకాశమువలె శబ్దము అమూర్తముగాన శబ్దము నిత్యమగును అని చెప్పి నిత్యాకాశముతో సాధర్మ్యముండుటవలన నిత్యమనుట సాధర్మ్యసమముతోను, ఆకాశ సాధర్మ్యమునుబట్టి శబ్దము నిత్యముకాఁగా ఆకాశమువలె శబ్దమందును పరమమహత్త్వగుణము గలుగునని యుత్కర్ష సమములోను అసదుత్తరము సంభవించునని భావము ఇట్లే మిగిలినవానియందు నూహించునది.

మూ. ప్రతిషేధ విప్రతిషేధే ప్రతిషేధదోష వద్దోషః.

41. సూ. ప్రతిషేధముయొక్క విప్రతిషేధమునందును ప్రతిషేధమునందువలె దోషముగలుగును.

వివ: తుల్యబల విరోధము విప్రతిషేధము.

ఉదా: శబ్దము ప్రయత్నానంతర జన్యమగుటవలన అనిత్యము అని వాది స్థాపనచేయుట మొదటిపక్షము. ప్రయత్న కార్యములనేకమగుటవలనఁ గార్యసమమగునని ప్రతివాది జాతితో నెదుర్కొనిన ప్రతిషేధము ద్వితీయ పక్షము. ఈ ప్రతిషేధమునందుఁగూడ అనైకాంతికదోషము సమానమె యని వాదించు జాతివాది మూఁడవ పక్షము విప్రతిషేధము. అందుఁగూడ నట్లే అనైకాంతికత్వము గాని తత్సమానదోషారోపణముగాని నాల్గవ పక్షము.

మూ. ప్రతిషేధం సదోషమభ్యుపేత్య ప్రతిషేధే సమానో దోషప్రసంగో మతానుజ్ఞా.

42. సూ. ప్రతిషేధమును దోషహితమైన దానినిగ నంగీకరించి యా దోషమును దొలఁగింపక తృతీయపక్షమగు ప్రతిషేధ విప్రతిషేధమందు "నా దానిలో దోషమున్నచో నీదానిలోను దోషమున్నది" అని సమానముగ దోషము నారోపించుట మతానుజ్ఞయనెడి యయిదవ పక్షమగు నిగ్రహస్థానము

మూ. స్వపక్షలక్షణాపేక్షోపపత్త్యుపసంహారే హేతునిర్దేశే పరపక్ష దోషాభ్యుపగమాత్ సమానో దోషః.

43. సూ. వాదిచే స్థాపనచేయఁబడిన మొదటిపక్షమును గుఱించి ప్రతివాదిచేఁ జేయఁబడిన రెండవపక్షమైన స్వపక్షముపై నాదరముంచి దాని నుపపన్నముచేయుటకై యుపసంహారము చేయఁబడిన హేతునిర్దేశమందుఁ బరపక్షముచేఁ జేయఁబడిన దోషము సమానమేయనుట యాఱవ పక్షము.

ఈ పక్షములలో మొదటిది మూఁడవది యైదవదియైన పక్షములు వాదిచేఁ జేయఁబడినవి రెండవది నాల్గవది యాఱవదియైన పక్షములు ప్రతివాదివి.

వివః ఇట్లు స్వపక్ష పక్షములందు దోషము లంగీకరించుటవల్ల ఉభయ పక్షములు అయుక్తములైనను సాధ్యము సిద్ధించదు. స్థాపనవాది సదుత్తరముచే జాతివాదిని దూషించినయెడల ఈ యాఱుపక్షములు ప్రవర్తింపనే ప్రవర్తింపవని భావము.

ఇతి
పంచమాధ్యాయమున రెండవయాహ్నికము

—(o)—

అథ
పంచమాధ్యాయమున రెండవ యాహ్నికము

మూ. ప్రతిజ్ఞాహానిః ప్రతిజ్ఞాంతరం ప్రతిజ్ఞావిరోధః ప్రతిజ్ఞాసన్న్యాసో హేత్వంతర మర్థాంతరం నిరర్థక మవిజ్ఞాతార్థమపార్థక మప్రాప్తకాలం న్యూన మధికం పునరుక్త మననుభాషణ మజ్ఞాన మప్రతిభావిక్షేపో మతానుజ్ఞా పర్యనుయోజ్యోపేక్షణం నిరనుయోజ్యానుయోగోఽపసిద్ధాంతో హేత్వాభాసాశ్చ నిగ్రహస్థానాని.

1. సూ. ౧. ప్రతిజ్ఞాహాని, ౨ ప్రతిజ్ఞాంతరము, ౩ ప్రతిజ్ఞావిరోధము, ౪ ప్రతిజ్ఞా సంన్యాసము, ౫ హేత్వంతరము, ౬ అర్థాంతరము, ౭ నిరర్థకము, ౮ అవిజ్ఞాతార్థము, ౯ అపార్థకము, ౧౦ అప్రాప్తకాలము ౧౧ న్యూనము, ౧౨ అధికము, ౧౩ పునరుక్తము, ౧౪ అననుభాషణము ౧౫ అజ్ఞా

నము, ౧౨ అప్రతిభ, ౧౩ విక్షేపము, ౧౪ మతానుజ్ఞ, ౧౫ పర్యనుయోజ్యో పేక్షణము, ౨౦ నిరనుయోజ్యానుయోగము, ౨౧ అపసిద్ధాంతము, ౨౨ హేత్వా భాసములు అనునవి నిగ్రహస్థానములు.

మూ. ప్రతిదృష్టాంత ధర్మాభ్యనుజ్ఞా స్వదృష్టాంతే ప్రతిజ్ఞా హానిః.

2. సూ. స్వపక్ష దృష్టాంతమందుఁ బరపక్ష దృష్టాంత ధర్మమును అంగీకరించుట ప్రతిజ్ఞా హానియగును.

వివ: సాధ్యధర్మమునకు వ్యతిరేకమగు ధర్మముతో నెదుర్కొనఁగాఁ బ్రతికూల దృష్టాంతముయొక్క ధర్మమును స్వపక్ష దృష్టాంతమందు అంగీకరించుచుఁ బ్రతిజ్ఞను విడచుచున్నదిగానఁ బ్రతిజ్ఞా హానియగును.

ఉదా: "ఇంద్రియజ్ఞేయమగుటవలన ఘటమువలెశబ్దము అనిత్యము" అను చోట ఇంద్రియజ్ఞేయ మగుటవలన అనుధర్మముచే శబ్దమునకు అనిత్యత్వము సాధింపఁబడుచున్నది. ఇందు స్వపక్ష దృష్టాంతమగుఘటముకంటెఁ బ్రతికూల దృష్టాంతమగు నిత్యమైన గోత్వాదజాతి సామాన్యమందు సిద్ధమైన యింద్రియ జ్ఞేయత్వము పక్షమైన ఘటమందు అంగీకరింపఁబడినది. ఇంద్రియ జ్ఞేయత్వము నిత్యమైన గోత్వాదిజాతి సామాన్యమందుఁ గనిపించుచున్నదిగాన నిత్యమగు సామాన్యమువలె శబ్దముగూడ నెందుకు నిత్యముగారాదుఅని యనఁగా ఇంద్రియ జ్ఞేయమైన సామాన్యము నిత్యమైనప్పుడు ఘటముగూడ నిత్యమేయగుఁగాక. ఇది సాధకమైన దృష్టాంతమునకు నిత్యమును బ్రసంగింపఁజేయుచు నిగమనమువరకే పక్షమును విడచుచున్నది. పక్షమును విడచుటచుఁ బ్రతిజ్ఞను విడచుచున్నదని చెప్పఁబడుచున్నది.

మూ. ప్రతిజ్ఞాతార్థ ప్రతిషేధే ధర్మ వికల్పాత్ తదర్థ నిర్దేశః ప్రతిజ్ఞాంతరం.

3. సూ. ప్రతిజ్ఞ చేయఁబడిన యర్థమును బ్రతిషేధింపఁగా దానిని దొలఁగించుటకు మఱియొక ధర్మమును విశేషముగఁ గల్పించుటవలనఁ బ్రతిజ్ఞాతమగు నర్థమును నిర్దేశించుటవలనఁ ప్రతిజ్ఞాంతరమగును.

వివ: ఇంద్రియ జ్ఞేయ మగుటవలన శబ్దము ఘటమువలె అనిత్యమని చెప్పఁగా నింద్రియజ్ఞేయమగు సామాన్యము నిత్యముగాన శబ్దమును నిత్యమగు

వసే అనిత్య ప్రతిషేధము చేయఁగా సర్వగతమైన యింద్రియజ్ఞేయము సామాన్యము ఘటమైతే అసర్వగతమైన యింద్రియజ్ఞేయమగును అని ధర్మవిశేషమును గల్పించుటవల్లఁ బ్రతిజ్ఞాతార్థము నిర్దేశింపఁబడినది. ఇందు ఘటము అసర్వగతమైనయెడల నిట్లు శబ్దముగూడ అసర్వగతమైనదై ఘటమువలె అనిత్యము ఇందులో శబ్దము అనిత్యము అనునది మొదటి ప్రజ్ఞ అసర్వగతమైనది యనునది మార్చిన రెండవ ప్రతిజ్ఞ (ప్రతిజ్ఞాంతరము) ప్రతిజ్ఞకుఁ బ్రతిజ్ఞాంతరము సాధనముగాదు. హేతువును దృష్టాంతమును బ్రతిజ్ఞకు సాధనమగును. కాననీయసాధనమును స్వీకరించుట యనర్థకము. అనర్థకమగుటచే నిది నిగ్రహస్థానము.

మూ. ప్రతిజ్ఞాహేత్వోర్విరోధః ప్రతిజ్ఞావిరోధః

4. సూ. ప్రతిజ్ఞకును ఆ ప్రతిజ్ఞను నిరూపించు హేతువునకును విరోధము గలుగుట ప్రతిజ్ఞా విరోధము.

వివ: "గుణ వ్యతిరిక్తము ద్రవ్యము" అనునది ప్రతిజ్ఞ ఈ ప్రతిజ్ఞను నిరూపింప రూపాదులనుబట్టి యర్థాంతరము ఉపలబ్ధము కాకపోవుటవలన అను హేతువు చెప్పఁబడుచున్నది. ఇది ప్రతిజ్ఞాహేతువులకు విరోధము. ఎట్లనఁగా ద్రవ్యము గుణవ్యతిరిక్తమైనచో రూపాదులనుబట్టి యర్థాంతరము ఉపలబ్ధము కాకపోవుట యుపపన్నముగాదు. మఱి యింక రూపాదులనుబట్టి యర్థాంతర ముపలబ్ధమైనచో "ద్రవ్యము గుణవ్యతిరిక్తము" అనునది యుపపన్నముగాదు. కాన రెండును విరుద్ధములు.

మూ. పక్ష ప్రతిషేధే ప్రతిజ్ఞాతార్థాపనయనం ప్రతిజ్ఞాసన్న్యాసః.

5. సూ. తనచేఁ జెప్పఁబడిన పక్షమును బ్రతిషేధింపఁగా దానిని బరిహరించుటకుఁ బ్రతిజ్ఞ చేయఁబడిన యర్థమును విడచుట ప్రతిజ్ఞా సంన్యాసమనఁబడును.

వివ: "ఇంద్రియజ్ఞేయ మగుటవలన శబ్దము అనిత్యము" అనఁగా ఇంద్రిజ్ఞేయమగు గోత్వాదిజాతి సామాన్యము అనిత్యముగాదుగాన నిట్లు ఇంద్రియజ్ఞేయమగు శబ్దముగూడ అనిత్యముగాదని పక్షమును బ్రతిషేధింపఁగా "శబ్దము అనిత్యమని యెవరనిరి" యని తనచే మొదట బ్రతిజ్ఞ చేయఁబడిన యర్థమును విడచుట ప్రతిజ్ఞా సంన్యాసమనిభావము.

మూ. అవిశేషోక్తే హేతౌ ప్రతిషిద్ధే విశేష మిచ్ఛతో హేత్వంతరం.

6. సూ. సామాన్యముగఁ జెప్పఁబడిన హేతువు ప్రతిషేధింపఁబడినపుడు విశేషముగోరి మఱియొక విశేషణముతోఁగూడిన హేతువును జెప్పుట హేత్వంతరము.

వివ: శబ్దము బాహ్యేంద్రియములకుఁ బ్రత్యక్షమగుటవలన అనిత్యము అని చెప్పఁగా హేతువు అనైకాంతికమైనదని దోషము చెప్పి ప్రతిషేధింపఁగా "అయితే సామాన్యవంతమై బాహ్యేంద్రియములకుఁ బ్రత్యక్షమగుటవలన" అని విశేషణముగూడిన హేతువునుజెప్పి సర్దుకొనుట హేత్వంతరమను నిగ్రహస్థానమనిభావము.

ఇది

ప్రతిజ్ఞనుగాని హేతువునుగాని ఆశ్రయించి చెప్పఁబడిన

నిగ్రహస్థాన పంచక విశేషలక్షణము

—(౦)—

**మూ. ప్రకృతాదర్థా దప్రతిసంబద్ధార్థాంతరం.**

7. సూ. ప్రకృతమైన యర్థము నుపేక్షించి దానికి సంబంధింపని యర్థము నుపన్యసించుట యర్థాంతరము.

వివ: "శబ్దము స్పర్శలేనిదిగాన నిత్యము అది యాకాశము యొక్క గుణము అని యీరీతిగాఁ జెప్పుట యర్థాంతరమనిభావము.

**మూ. వర్ణక్రమ నిర్దేశవ న్నిరర్థకం.**

8. సూ. వర్ణములను క్రమముగా నిర్దేశించుట నిరర్థకము.

ఉదా: కచటతపలు జబగడ దశలగుటవలన ఝభఞఘఢ ధషలవలె శబ్దము నిత్యము. అని యిత్యాకముగ నిరూపించుట నిరర్థకము.

మూ. పరిషత్ప్రతివాదిభ్యాం త్రిరభిహితమప్యవిజ్ఞాతమవిజ్ఞాతార్థం.

9 సూ శ్లిష్టముగను, దెలియనట్లుగను, అతిత్వరితముగాను వాదిచే మూఁడుసార్లు చెప్పఁబడినను బరిషత్తుగాని ప్రతివాదిగాని గ్రహింపని విషయము అవిజ్ఞాతార్థము.

వివ: ఏదోవిధముగ నితరుని జయింపవలయునని తెలియనట్లు పలుకఁబడినదని భావము.

మూ. పౌర్వాపర్యాయోగా దప్రతిసంబద్ధార్థ మపార్థకం.

10. సూ మొదటఁజెప్పఁబడిన పదములకుఁగాని, వాక్యములకుఁ గాని తరువాతఁ జెప్పఁబడిన పదములతోఁగాని వాక్యములతోఁగాని పరస్పరము అనయము లేకపోవుటవలన సంబంధింపని యర్థముగలుగుట యపార్థమగును.

పదమునకుదా: పది దానిమ్మలు, ఆఱు అప్పములు, కుండ, మేకచర్మము, మాంసపుముద్ద. మొ. వాక్య:- ఇది లేడిచర్మము, కుమారి త్రాగవలసినది ఆమె తండ్రి వృద్ధుఁడు. మొ.

ఇ ది

అభిమత వాక్యార్థాప్రతిపాదక నిగ్రహస్థాన చతుష్కము

—(౦)—

మూ. అవయవ విపర్యాసవచన మప్రాప్త కాలం.

11. సూ. సభాభీరుత్వాది కారణములచేఁ బ్రతిజ్ఞాదులైన పంచావయవ వాక్యములను విపరీతముగఁ బలుకుట యప్రాప్తకాలము.

వివ: వాది సాధనముసు జెప్పి సామాన్యముగ హేత్వాభాసముల దోషముల నుద్ధరించుట మొదటిపాదము. అందుఁ బ్రతివాది యాక్షేపము చెప్పుట రెండవపాదము. పిదపఁ బ్రతివాది స్వపక్షమును సాధించుటయు అందు హేత్వాభాసములనుద్ధరించుటయు మూఁడవపాదము. జయపరాజయ వ్యవస్థ నాల్గవ పాదము ఇట్లు ప్రతిజ్ఞా హేత్వాదులక్రమము చెప్పవలయును. సభాక్షోభ వ్యామోహాదులచే అట్లు ఛెప్పక వ్యత్యస్తముగఁ జెప్పుట యప్రాప్తకాలము.

మూ. హీనమన్యతమే నాప్యవయవేన న్యూనం.

12. సూ. ప్రతిజ్ఞాది పంచావయములలో నేదొయొకటి లేకపోవుట న్యూనము.

వివ: ఉండవలసిన యన్నియవయములుండకపోవుటవల్ల సాధ్యము సిద్ధింపదు గాన నిగ్రహస్థానమనఁబడెను.

మూ. హేతూదాహరణాధిక మధికం.

13. సూ. హేతూదాహరణములధికమగుట యధికము.

ఉదా: ధూమమువల్ల ఆలోకమువల్ల వంటయింటివలె, మందువాసలెం బర్వతము అగ్నికలది. ఒకటే హేతువువల్ల సాధ్యమును సాధించు సమయబంధమును వీడి దార్ఢ్యాదిభ్రమవల్ల అధికముగాఁ జెప్పఁబడుట యనిభావము.

ఇది

స్వసిద్ధాంతానురూప ప్రయోగాభాస నిగ్రహస్థాన త్రిక ప్రకరణము

మూ. శబ్దార్థయోః పునర్వచనం పునరుక్త మన్యత్రానువాదాత్.

14. సూ. ఒకరిచేఁ జెప్పఁబడిన దానిని అనువదించునప్పుడు తక్కనితరమగుచోట శబ్దార్థములను వ్యర్థముగఁదిరుగఁజెప్పుట పునరుక్తము.

ఉదా: శబ్దపునరుక్తము- శబ్దము నిత్యము, నిత్యముశబ్దము అర్థ పునరుక్తము- శబ్దము అనిత్యము, ధ్వని నాశధర్మముగలది మొ.

మూ. అనువాదే త్వపునరుక్తం శబ్దాభ్యాసా దర్థవిశేషోపపత్తేః.

15. సూ. అనువదించునప్పుడైనచో శబ్దాభ్యాసమునుబట్టి యర్థవిశేషము ఉపపన్నమగుటవల్లఁ బునరుక్తిలేదు.

వివ: అనువాదము వ్యాఖ్యారూపమై ప్రయోజనమై యుండును గాన నది దోషము గాదనిభావము.

మూ. అర్థా దాపన్నస్య స్వశబ్దేన పునర్వచనం.

16. సూ. అర్థ సిద్ధమగుదానిని స్వశబ్దముచేఁ దిరుగఁ జెప్పుటయును బునరుక్తమగును.

ఉదా: ఉత్పత్తిధర్మము గలదగుటవలన అని చెప్పి తిరుగ ఆయర్థమునే చెప్పు అనుత్పత్తి ధర్మముగలదగుటవలన నిత్యము అని చెప్పుట పునరుక్తమని భావము.

ఇది

పునరుక్త ప్రకరణము

మూ. విజ్ఞాతస్య పరిషదా త్రిరభిహితస్యా ప్యప్రత్యుచ్చారణ మననుభాషణం.

17. సూ. పరిషత్తుచే బాగుగఁ దెలియఁబడునట్లు వాదిచే మూఁడుసార్లు చెప్పఁబడినను దానికి బదులు మాట్లాకకుండుట అననుభాషణము.

వివః సభా భీరుత్వాజ్ఞానాదులచే మాట్లాడకుండుట యనిభావము.

మూ. అవిజ్ఞాతం చాజ్ఞానం.

18 సూ. పరిషత్తుచే బాగుగఁ దెలియఁబడునట్లు వాదిచే మూఁడుసార్లు చెప్పఁబడినను దానిని దెలిసికొనలేకపోవుట యజ్ఞానము.

మూ. ఉత్తర స్యాప్రతిపత్తి రప్రతిభా.

19. సూ. ఇతరునిచేఁ జెప్పఁబడిన దానిని దెలిసికొనియు నా సమయమందు దానికి సమాధానము దోఁచకపోవుట యప్రతిభ.

మూ. కార్యవ్యాసంగాత్ కథావిచ్ఛేదో విక్షేపః.

20 సూ. కార్యాంతర వ్యాసంగమువలనఁ బ్రస్తుతవాద కథను అపు చేయుట విక్షేపము.

వివః "ఇప్పుడు తొందరపనియున్నది పిదపఁ జెప్పెదను" అని వాదమును ముగించుట విక్షేపమనిభావము.

మూ. స్వపక్ష దోషాభ్యుపగమాత్ పరపక్షే దోష ప్రసంగో మతానుజ్ఞా.

21. సూ స్వపక్షమందుఁ జెప్పఁబడిన దోషమును దొలఁగింపక పరపక్షమందుఁగూడ దోషమును బ్రసంగింపఁజేయుట మతానుజ్ఞ.

మూ. నిగ్రహస్థాన ప్రాప్త స్యానిగ్రహః పర్యనుయోజ్యోపేక్షణం.

22. సూ. నిగ్రహస్థానమును బొందినవాఁడు తాను స్వయముగ నిగ్రహింపఁబడినట్లు అంగీకరింపకపోవుట పర్యనుయోజ్యోపేక్షణము.

వివ: మధ్యవర్తులు చెప్పకుండఁ దాను ఓడింపఁబడినట్లు అంగీకరింపక పోవుట యనిభావము.

మూ. అనిగ్రహస్థానే నిగ్రహస్థానాభియోగో నిరనుయోజ్యానుయోగః

23. సూ. నిగ్రహింపఁబడని వానిని జూచి "నీవు నిగ్రహింపఁబడితి" వని యారోపించుట నిరనుయోజ్యానుయోగము.

మూ. సిద్ధాంతమభ్యుపేత్యానియమాత్ కథా ప్రసంగోఽపసిద్ధాంతః.

24. సూ ఒక సిద్ధాంతము నంగీకరించి యశక్త్యాదులచే దా నంగీకరించిన సిద్ధాంత నియమమునకు విరుద్ధముగ కథ (చర్చ) చేయుట యపసిద్ధాంతము.

మూ. హేత్వాభాసాశ్చ యథోక్తాః.

25. సూ. పూర్వోక్త ప్రకారముగనె హేత్వాభాసలును నిగ్రహస్థానము లగును.

వివ: వానికిఁ బ్రత్యేకముగ లక్షణము చెప్పనవసరము లేదనిభావము.

ఇది

కథకాన్యోక్తి నిరూప్య నిగ్రహస్థానద్వయ ప్రకరణము

ఇది

పంచమాధ్యాయమున ద్వితీయాహ్నికము

ఇది

గౌతమమహర్షిచే రచింపఁబడి

బ్రహ్మశ్రీ చర్ల నారాయణశాస్త్రి జనకగురువర ప్రాప్త విద్యుఁడును వెంకమాంబ పుత్రుఁడు నగు చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన

న్యాయమీమాంసా దర్శనము

సంపూర్ణము

—(౦)—